అట్టలోపలి వైపు అచ్చు వేసిన శిల్పంలో కనబడేది శుద్ధోదన మహారాజుకు గౌతమ బుద్ధుని తల్లియైన మహారాణి మాయాదేవి కన్న స్వప్నం గురించి జ్యోతిష్కులు వ్యాఖ్యానిస్తూ ఉండిన దృశ్యం. వారికి దిగువున వారి వ్యాఖ్యను వ్రాసుకుంటున్న లేఖకుడు కనిపిస్తాడు భారతదేశంలో లేఖన కళ చిత్ర శిల్పంలో నిబద్ధమై లభించే దృష్టాంతాలలో ఇదే ప్రాచీనమైనది.

నాగార్జున కొండ, క్రీ॥శ॥ 2వ శతాబ్దం

(జాతీయ పురావస్తు ప్రదర్శన శాల, న్యూఢిల్లీ వారి సౌజన్యంతో)

భారతీయ సాహిత్య నిర్మాతలు

# మహాకవి శ్రీశ్రీ

## (శ్రీరంగం శ్రీనివాసరావు జీవితం, రచనలు)


ఆంగ్ల మూలం, అనువాదం :

**బూదరాజు రాధాకృష్ణ**





సాహిత్య అకాడెమీ

*Mahaakavi SriSri* Telugu Translation by Budaraju Radhakrishna of his monograph in English Sahitya Akademi, 1999. Rs 25.

© Sahitya Akademi
First Edition : 1999
ISBN : 81-260-0719-2

సాహిత్య అకాదెమీ

'రవీంద్ర భవన్', 35, ఫిరోజ్ షా రోడ్, న్యూఢిల్లీ - 110 001.

విక్రయ విభాగం: 'స్వాతి' మందిర్ మార్గ్, న్యూఢిల్లీ - 110 001.
ఎడిఎ రంగమందిర, 109, జె.సి రోడ్, బెంగళూరు - 560 002.
'గుణా బిల్డింగ్', 304-305, అణ్ణాసాలై, చెన్నై - 600 018.
జీవన్‌దారా బిల్డింగ్, 4వ అంతస్తు,
23A / 44X, డైమండ్ హార్బర్ రోడ్, కలకత్తా - 700 053.
172, ముంబాయి మరాఠి గ్రంథ సంగ్రహాలయ మార్గ్,
దాదర్, ముంబాయి - 400 014.

వెల : రూ. 25

Laser typesetting Sri Maruthy Laser Printers, Chennai - 600 014
Printed at Nagarjun Printers, Chennai -21

## ప్రకరణాలు

# మొదటి ప్రకరణం

## జీవిత రేఖాచిత్రం

ఈ శతాబ్ది ప్రథమ దశాబ్దికది చివరి సంవత్సరం. ఆ సమయంలో కొన్ని విశేష సంఘటనలు జరిగాయి. అప్పుడు చరిత్రలో తెలిసినంతలో రెండోసారి బరంపురంలో సామూహిక వర్ణాంతర భోజనాలు ఏర్పాటు చేశారు. మధ్యాంధ్రలో మొదటిసారి 12వ శతాబ్దిలో జరిగిన అటువంటి విందు ఏడు సంవత్సరాల రక్తపాతానికి దారితీసింది. ఆ ఏడు ఆకాశంలో హైలీ ఉల్క వెలుగులు విరజిమ్మితే ప్రళయం ముంచుకొస్తున్నదని సామాన్య ప్రజలు వణికిపోయారు. ఆధునికాంధ్ర కవితా వైతాళికుడు గురజాడ అది సంఘ సంస్కరణ ప్రయాణ పతాకమని ముత్యాలసరాలనే సరికొత్త ఛందో రూపంలో సమకాలిక భాషారూపంలో అభివర్ణించాడు. అప్పుడొక పాత సంప్రదాయం భగ్నమై కొత్తది ఉద్భవించింది. ఆ సమయంలో ఒకానొక మధ్యతరగతి బ్రాహ్మణ కుటుంబానికి చెందిన బడిపంతులు ఇంట్లో ఒక పసిగుడ్డు భూమిమీద పడ్డాడు. ఆ సమయంలో ఈ చిన్న చిన్న సంఘటనలు ఆంధ్రుల సాంఘిక సాహిత్య చరిత్ర గతిని మార్చబోతున్నవని ఎవరూ భావించలేదు. అలా జన్మించి డెబ్బై ఏడేళ్ల దీర్ఘకాలం జీవించిన ఆ అమాయక శిశువు తనకు తెలిసిన తన జన్మకాలం తప్పని తెలియకుండానే పెరిగాడు. అతడి పుట్టినతేదీ 15-4-1910 కావచ్చు. లేదా 30-4-1910 కావచ్చు. అతడు మాత్రం తాను 2-1-1910 నాడు జన్మించానని విశ్వసించాడు. ఇది శ్రీశ్రీగా సుపరిచితుడైన శ్రీరంగం శ్రీనివాసరావు జన్మ విశేషం.

ఒక పరిశోధకుడి ప్రకారం శ్రీనివాసరావు సాధారణ నామ సంవత్సర చైత్ర శుద్ధ షష్ఠినాడు - అంటే 1910 ఏప్రిల్ 15వ తేదీన - శ్రీరామ నవమికి మూడు రోజుల ముందు ఇంచుమించు సూర్యోదయ సమయంలో ఉషస్సంధ్యలో ఆరుద్రా నక్షత్రంలో ఉద్భవించాడు. అతడి జన్మ సమయం గురించి అనంతమనే వ్యక్తి బహు పరిశ్రమచేసి పురపాలక సంఘం దగ్గరా ఇతరత్రా లభించిన ఆధారాలను బట్టి ఖచ్చితంగా తెలుసుకో గలిగానంటున్నాడు. విశాఖపట్నం పురపాలక సంఘంవారు ఖరారుచేసిన తేదీ 30-4-1910 అని వీరసంవాదం స్పష్టీకరిస్తున్నారు. అతడు 1910లో జన్మించాడనేది నిర్వివాదాంశం. అతడి తండ్రి పూడిపెద్ది వేంకట రమణయ్య; తల్లి అప్పలకొండ. అతణ్ని శ్రీరంగం సూర్యనారాయణకు

దత్తత ఇచ్చినందువల్ల ఇంటిపేరు మారింది. శ్రీనివాసరావు ఏణ్నర్ధం వయసులో ఉండగా కన్నతల్లిని కోల్పోయాడు. తండ్రి ద్వితీయ పత్నిగా సుభద్రమ్మను స్వీకరించాడు. జీవితాంతం శ్రీనివాసరావుకూ అతడి మారుదల్లికీ మధ్యగల ప్రేమాభిమాన సంబంధాలు చెక్కు చెదరలేదు. 'ప్రభవ' అనే తన కవితా సంపుటినామెకే అంకితమిచ్చాడు. శ్రీనివాసరావు ఆరోగ్యవంతమైన బాలుడు కాడు. అతడికి తరచుగా చిన్నబిడ్డ చేష్టలు వస్తుండేవి. ఏడాది పిల్లవాడైనా కాకముందే అప్పుడమల్లో ఉన్న వైద్య పద్ధతి ప్రకారం చుట్టనిప్పుతో వాతలు పెట్టి స్మారకంలోకి తేవలసి వచ్చింది. ఆ పని చేసింది శివప్రసాదరావనే వ్యక్తి.

మిసెస్ ఏ.వి.యన్. కళాశాలోన్నత పాఠశాలలో వేంకట రమణయ్య గణితోపాధ్యాయుడుగా ఉండేవాడు, విశాఖపట్నంలో. ఆయన తన కొడుకును 1915లో గోదావరయ్య బడికి పంపాడు. తిరుమల కొండలమీద మతాచారం ప్రకారం ఉపనయనం చేశాడు. తరువాతి కాలంలో శ్రీనివాసరావు తాను గురజాడ అస్తమించినపుడు విద్యాభ్యాస మారంభించాననీ సుప్రసిద్ధాంగ్లకవి స్విన్‌బర్న్ మరణానంతరం కొద్దికాలం దాటినమీదట జన్మించాననీ సగర్వంగా చెప్పుకుంటుండేవాడు. 1915-1920 మధ్యకాలంలో అతడి చదువు శివరామయ్య ప్రైవేటు స్కూల్లో సాగింది. ఎనిమిదేళ్ల వయసు నిండకముందే అతడు సులక్షణసారమనే ప్రసిద్ధచ్ఛందోగ్రంథం చదివి పద్యాలు రాయటం మొదలుపెట్టాడు. 1920లో ఆరో తరగతి చదువుతున్నప్పుడు వీరసింహ విజయసింహులనే పెద్ద నవల రాశానంటాడు గానీ లిఖిత ప్రతి దొరకలేదు. ఆయేడే కృష్ణలీలలనే నాటకంలో అతడు అశరీరవాణి అనే ఆడవేషం కట్టాడు. మాతృవియోగం తరువాత తండ్రి చాలా దయగా సంరక్షించినందువల్ల అతడి బాల్యం విలాసమయంగా గడిచింది గోడలమీద బొగ్గుబొమ్మలు గీసినా తండ్రి కోప్పడలేదు. అతణ్ని కేతవరపు వేంకటశాస్త్రి ఇంటికి ప్రయివేటుగా సంస్కృతం నేర్చుకోవటానికి పంపారుగానీ శబ్దమంజరిని ఒప్పచెప్పటం దగ్గరే ఆ చదువు సమాప్తమయింది. ఇతర విద్యార్థులతో కలిసి గాంధీజీ అరెస్టుకు నిరసనగా సమ్మెతో పాల్గొన్నందుకు పొద్దున బెత్తం దెబ్బలు తగిలించిన తండ్రి సాయంత్రానికి క్షమించాడు శ్రీనివాసరావుకు ఐదో జార్జి ముద్రగల నాణేలు బహుమానంగా కూడా లభించాయి 1924లో మారుదల్లి కన్నుమూసింది. అందువల్ల శ్రీనివాసరావు సంరక్షణకోసం పూర్తిగా తండ్రిమీదనే ఆధారపడవలసి వచ్చింది.

1925 మార్చి నెలలో శ్రీనివాసరావు పాఠశాల విద్య పరిసమాప్తమయింది. అదే యేడు అతడి వివాహమూ జరిగింది. అతడు పరిణయ రహస్యమనే నవలికను రాసి ప్రచురించాడు. అది చాలా ఇటీవల దొరికింది. ఆ సంవత్సరమే భగందర వ్యాధి వచ్చి ఆనాటి నుంచీ నలభై సంవత్సరాలపాటు అతణ్ని బాధించింది. అప్పట్లో అతడు పురిపండా అప్పలస్వామి (1904-1982) పరిచయ భాగ్యం పొందాడు. అతడే

జీవితాంతందాకా శ్రీనివాసరావుకు స్నేహితుడుగా, బోధకుడుగా, దర్శకుడుగా, అభిమానిగా కొనసాగాడు శ్రీనివాసరావు మొదటి పద్యరచన 'విశ్వరూప సందర్శనము' దాని పేరును 'దివ్య లోచనములు'గా మార్చి పురిపండా తన పత్రిక 'స్వశక్తి'లో ప్రచురించాడు. పురిపండా ప్రభావంలోపడి శ్రీనివాసరావు 1926లో కవితాసమితి సభ్యుడయినాడు. ఇంటర్మీడియట్ విద్యార్థిగా ఉండగా సంప్రదాయ ఛ్ఛందస్సులలో ప్రభవ అనే కావ్యాన్ని మూడు భాగాలుగా ప్రచురించాడు ఆ కాలంలో అతడు విశ్వనాథ సత్యనారాయణ (1895-1976), దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980), కవికొండల వేంకటరావు (1892-1969)ల ప్రభావంలో పడ్డాడు ఆ సమయంలో భావకవిత్వం ఏకచ్ఛత్రాధిపత్యంలో ఉండగా గురజాడ ప్రభావం సాహితీలోకంలో అంతగా ప్రసరించలేదు. విశాఖపట్నంలోని కవితాసమితివారు 1928లో ప్రభవను ప్రచురించారు మంచికవిగా అతడికి అది తక్షణం గుర్తింపు సంపాదించి పెట్టింది. ఆయేడే అతడు టెన్నిసన్ కవితా ఖండాలను తెలుగులోకి అనువదించాడు

మదరాసులోని క్రైస్తవ కళాశాలలో శ్రీనివాసరావు 1928లో బి.ఏ.లో ప్రవేశించాడు. ఆ మదరాసులోనే తన ప్రభవ పద్యాలను భారతి పత్రికలో కఠోరంగా విమర్శించిన కొంపల్లె జనార్దనరావుతో (1907-1937) ప్రథమ పరిచయం కలిగింది. కొంపల్లె కన్నుమూసేదాకా వారి స్నేహానుబంధం కొనసాగింది తరువాతికాలంలో తన మహోత్తమ రచన మహాప్రస్థాన గేయాలను శ్రీనివాసరావు కొంపల్లెకు అంకితం చేశాడు మదరాసులో ఉన్నప్పుడు అతడి సాహితీ వ్యాసంగం నిరాఘాటంగా సాగింది. అక్కడే తెలుగు సాహితీ ప్రపంచంలో సుప్రసిద్ధులయిన గన్నవరపు సుబ్బరామయ్య, మల్లంపల్లి సోమశేఖరశర్మ (1891-1963) వంటి వారితో చిరస్నేహం కలిగి వర్ధిల్లింది బడిపిల్లవాడుగా ఉన్నప్పటినుంచీ అతడికి దృష్టి దోషం ఉండేది తెరకు దగ్గరగా కూర్చొని సినిమాలు చూడటానికి అలవాటు పడ్డాడు. 1929నుంచీ సులోచనాలు ధరించక తప్పలేదు.

చదువు పూర్తికాగానే శ్రీనివాసరావు 1930లో విశాఖపట్నానికి తిరిగి వచ్చాడు అర్వై నాలుగురోజులు టైఫాయిడ్ జ్వరంతో బాధపడ్డాడు. తనకు వైద్యం చేసిన డాక్టర్ సి. మల్లికార్జునరావు ఉరఫ్ మల్లిక్‌ను తన ఆత్మకథలో పదే పదే స్మరించాడు. అందుకు మరో కారణం కూడా ఉంది. టైఫాయిడ్‌తోబాటు తనకున్న భావ కవితాభిమానం కూడా అదృశ్యమయిందంటాడు. అవి ప్రపంచవ్యాప్తంగా ఆర్థికమాంద్యమేర్పడిన రోజులు ఆ 'అన్నార్త తృతీయ దశకం'లో (hungry thirties) శ్రీనివాసరావు మానసికంగా, భౌతికంగా, ఆర్థికంగా అష్టకష్టాలు పడ్డాడు ఉద్యోగప్రయత్నంలో భాగంగా ఒకమారు ఖరగ్‌పూర్-కలకత్తా రైలుమార్గంమీద ఇరవైమైళ్లు నడవవలసి వచ్చింది. ఆరోజుల్లోనే అతడి మహాకావ్యం మహాప్రస్థానంలోని అత్యధిక భాగం రచితమయింది. బతుకు

నిలుపుకోవటంకోసం విశాఖపట్నంలోని స్వగృహాన్ని అమ్ముకోవలసి వచ్చింది. 1931లో కొంతకాలంపాటు విశాఖ హార్బరులో 'టైంకీపర్'గా, 'వెయింగ్ క్లర్క్'గా పనిచేశాడు. మిసెస్ ఎ.వి.ఎన్. కళాశాలలో జంతుశాస్త్ర విభాగంలో డిమాన్‌స్ట్రేటర్‌గా పనిచేస్తూ "కప్పల మేష్టారు"రనే అసందర్భ బిరుదం పొందవలసి వచ్చింది. ఆ సమయంలోనే హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ కవితలు కొన్నిటిని తెలుగులోకి అనువదించాడు. కన్యాశుల్కంలోని స్త్రీ పాత్రల గురించి అతడు రాసిన మొట్టమొదటి వ్యాసం 1932 నాటి సమదర్శినిలో అచ్చయింది. 1933 మార్చిలో బరంపురంలో జరిగిన అఖిలాంధ్ర కవి పండిత సభలో పాల్గొనటం ద్వారా అతడి మిత్ర ప్రపంచం విస్తరించింది. సాహితీదృష్టి పదునుదేలింది. 1934 నాటికి సాహిత్య పత్రికల్లో అతడి మహాప్రస్థాన గేయాలు చాలావరకు ప్రచురితమయినాయి. సాహితీరంగంలోని మండపాక పార్వతీశ్వరశాస్త్రి వంటి వృద్ధ విద్వాంసుల దృష్టిలో పడగలిగాడు. కాకినాడలో జరిగిన యువజన సమావేశంలో తన గేయాలను స్వయంగా చదివాడు. విశాఖపట్నంలోని టర్నర్స్ చౌల్ట్రీలో అడివి బాపిరాజుకు చదివి వినిపించాడు. అవి 1935లో 'జ్వాల'లో ప్రచురితమయినాయి. తన మహాప్రస్థాన గేయాలను క్షణాల్లో తిప్పి పంపిన 'భారతి' పత్రికలోనే అతడి తొలి వచన కవిత ఆకాశదీపం అచ్చయింది. అది వాడుకభాషలోని రచన. ఆయేడే విశ్వనాథ సత్యనారాయణ కిన్నెరసాని పాటలనూ, కోకిలమ్మ పెళ్లినీ సమీక్షిస్తూ అతడు రాసిన వ్యాసాలు అచ్చయినాయి. కొంపల్లె జనార్దనరావు సంపాదకత్వంలోని ఉదయిని అనే సాహిత్య పత్రికలో అతడి మొట్టమొదటి సాంకేతిక వ్యాసం - గురజాడ ముత్యాలసరాలు - ప్రచురితమయింది. ప్రబుద్ధాంధ్ర అనే మరో ప్రసిద్ధ సాహితీ పత్రికలో భారతదేశంలో విదేశాల్లో ఉన్న కొందరు మహా రచయితలు తననెలా ఆకర్షించారో చర్చిస్తూ రాసిన వ్యాసం వెలుగు చూసింది. 1935 నాటికి ఒక విశిష్ట కవి అనే ప్రతిష్ఠ దినదినాభివృద్ధమయింది.

కాకినాడలో 1936లో జరిగిన నవ్యసాహిత్య పరిషన్మహాసభలకు హాజరయ్యేనాటికి శ్రీనివాసరావు సాహితీసృష్టి ప్రతిష్ఠా క్రమాభివృద్ధిదశకు చేరుకున్నాయి. తరువాత మచిలీపట్నంలో, బెజవాడలో జరిగిన ఆ సాహితీ సంఘ సభల్లో పాల్గొనేటప్పటికి ప్రసిద్ధ యువకవుల్లో తానొకడనే గుర్తింపు వచ్చింది. విజయనగరవాసి బుర్రా శేషగిరిరావు (1884-1941) ఆంధ్ర పరిశోధక విశ్వవిద్యాలయాన్ని (Andhra Research University) స్థాపించినవాడు. అతడు శ్రీనివాసరావుకు "కవిత్వణావర్త" అనే బిరుదిచ్చాడు. 1937 జూన్‌లో దురవస్థల్లో చిక్కుకొన్న కొంపల్లె జనార్దనరావు అస్తమించగా తన మహాకావ్యాన్ని అతడి దివ్యస్మృతికి అంకితం చేశాడు శ్రీనివాసరావు. ఆయేడే అతడు మరో సుప్రసిద్ధ సాహితీపరుడైన గుడిపాటి వేంకటాచలం (చలం) పరిచయ ప్రాప్తి పొందాడు. చలం అతడి అభిమాని అయినాడు.

న్యాపతి నారాయణమూర్తి సంపాదకత్వంలో నార్ల వేంకటేశ్వరరావు, మల్లవరపు విశ్వేశ్వరరావు, కప్పగంతుల సత్యనారాయణలతోబాటు శ్రీనివాసరావు తొలితరం

ఉపసంపాదకుడుగా మద్రాసులోని ఆంధ్రప్రభలో చేరాడు. (అతడి అభిప్రాయంలో న్యాపతి న్యాయదృష్టిలోనూ నార్ల వాస్తవదృష్టిలోనూ సంపాదకత్వం వహించారు). రాయిటర్స్ వారి ఏజెన్సీ కాపీలను తెలుగులోకి తర్జుమా చేయటం తన ప్రధాన కర్తవ్యంగా ఉండేది. అతడి పని అసంతృప్తికరంగా ఉందని పత్రికా యాజమాన్యం అతణ్ని ఉద్యోగం నుంచి తొలగించింది. చలం 'యోగ్యతాపత్రం'తో అతడి మహాప్రస్థాన గేయాలు 1950లో ఒకే సంపుటంగా అచ్చు అయ్యీ కాకముందే అతడి సారస్వత ప్రతిష్ఠ పరాకాష్ఠకు చేరుకుంది. ఆనాటినుంచీ అతణ్ని 'శ్రీశ్రీ' అని పిలవటం మొదలయింది సంప్రదాయ ధోరణులుగల కృష్ణాపత్రిక అతడి విశిష్టతను గుర్తించినా, సదరు గుర్తింపువల్ల వార్తాపత్రికలో పోగొట్టుకొన్న ఉద్యోగం స్థానంలో మరో శాశ్వతోద్యోగం దొరికించు కొనేందుకు ఉపయోగపడలేదు. పదహారు సంవత్సరాల వైవాహిక జీవితంలో అతడు అనపత్యుడుగానే మిగిలిపోయాడు. అందువల్ల ఒక బంధువు పుత్రికను దత్తు చేసుకొని ఆ పిల్లకు మొదట 'అనామిక' అనే పేరు పెట్టి, దరిమిలా దాన్ని 'లెనినా' అని మార్చేశాడు

మదరాసులోని ఆలిండియా రేడియో స్టేషన్లో శ్రీశ్రీకి 1942లో ఎలాగో ఉద్యోగం దొరికిందిగాని అతణ్ని త్వరలోనే ఢిల్లీకి బదిలీ చేశారు. కేవలం నాలుగు నెలలపాటు అతడు న్యూస్‌రీడర్‌గా పనిచేశాడు. తన ఉద్యోగధర్మంగా స్టాలిన్ గ్రాడ్ యుద్ధాన్ని వర్ణించినందుకు ''గాంధేయవాది''(!) అనే పేరుపెట్టి ఉన్న పదవిని ఊడగొట్టారు ఉద్యోగ ప్రయత్నంలో మరోసారి వీధుల్లో తిరగవలసి వచ్చింది ఆ ప్రయత్నంలో అతడు అలహాబాద్, కలకత్తా, విజయనగరం, విశాఖపట్నాలను గాలించవలసివచ్చింది. చివరకు లక్నోలోని మిలిటరీ కంటోన్మెంట్‌లో లేబరేటరీ అసిస్టెంట్ ఉద్యోగం దొరికింది. అక్కడ మలేరియా జ్వరం అనేకసార్లు పట్టి పీడించింది. ఒక సహోద్యోగి సలహామీద మందుగొట్టడం మొదలుపెట్టాడు. అతడే చెప్పుకున్న మాటల ప్రకారం ''మద్యం మలేరియా నివారణకు తోడ్పడింది''. కానీ కొద్దికాలంలోనే మిలిటరీ అధికారులు అతడొక 'కమ్యూనిస్టు' అని తెలుసుకొని ఉద్యోగం నుంచి తొలగించారు. ఇంటికి తిరిగి వచ్చిన శ్రీశ్రీని అభ్యుదయ రచయితల సంఘం (అరసం) అధ్యక్షుడుగా వరించింది. 1944లో విశాఖపట్నం చేరినవాడు అబ్బూరి రామకృష్ణరావు స్థాపించిన ''నటాలి'' అనే స్వచ్ఛంద సంస్థలో స్క్రిప్ట్ రచయితగా చేరి నాటక రంగ ప్రచారంలో పాలుపంచుకొన్నాడు. నటబృందంతోపాటు తీరాంధ్రలో పర్యటించాడు. కొన్నిసార్లు అవసరమైనప్పుడు కొన్ని వేషాలు కట్టాడు. ఇంతలో తండ్రి మరణవార్త విని మదరాసు చేరుకున్నాడు. అతడి జీవితం దుర్భరమయిపోయింది. పరిసరాలు శూన్యమనిపించాయి. అయినా సరే, తానభిమానించే దేవులపల్లి కృష్ణశాస్త్రి అధ్యక్షత వహించిన మూడో అరసం మహాసభలో ప్రారంభోపన్యాసం చేయటానికి రాజమహేంద్రవరం వెళ్ళాడు. 1945లో జీవనభృతి కోసం సినిమారంగంలో ప్రవేశించాడు. అందులో కాలక్రమాన ''డబ్బింగ్ కింగ్'' అనే పేరు సంపాదించాడు. తన వృత్తి అనిశ్చితమని, ఏదో ఒక శాశ్వతోద్యోగం కావాలని ఆరాటపడ్డాడు. కాశింఖాన్ అనే

రచయిత సిఫారసుతో బాల్య స్నేహితుడైన అబ్బూరి వరదరాజేశ్వరరావు (1923-1993) ప్రోత్సాహంతో హైదరాబాదులోని నిజాం రిఫారం సెక్రటేరియట్లో పౌర సంబంధోద్యోగిగా చేరాడు. ఆ ఉద్యోగంలో ఎంతోకాలం ఉండలేకపోయాడు. 1946లో ''ముల్కీ సర్టిఫికేట్ లేని కారణంగా'' ఉద్యోగం ఊడిపోయింది. ఈవిధంగా అతడు నాలుగు విభిన్న సంస్థలనుంచి అన్నే విభిన్న కారణాలతో పదవీచ్యుతి పొందినట్లయింది. తిరిగి మదరాసు చేరుకొని సినీరంగంలో పునఃప్రవేశించి ఇతరావకాశాలకోసం ఎదురుచూడటం మొదలుపెట్టాడు.

1946-1949 మధ్యకాలంలో ఆనందవాణి అనే సాహితీ పత్రికకు అతడు సంపాదకత్వం వహించాడు. అతడికి వామపక్షాలతో ఉన్న సంబంధంగాని, వాటిమీద అతడికున్న అభిమాన గౌరవాలుగాని రహస్య విషయాలు కావు. తన సాహితీ సిద్ధాంతాలను విశదీకరిస్తూ 1947లో రెండు వ్యాసాలు ప్రచురించాడు. ఎన్నికల సభలకు భారత కమ్యూనిష్టు పార్టీ ప్రధాన కార్యదర్శి చండ్ర రాజేశ్వరరావును అనుసరించాడు. నంద్యాల రాజకీయ సభలో శ్రీశ్రీని చండ్ర 'మహాకవి' అని ప్రస్తుతించాడు. ఆనాటినుంచీ అతడి విరోధులు కూడా అలాగే వ్యవహరించటం మొదలుపెట్టారు. సాహితీ ప్రపంచంలో ఆకర్షణీయ నాయకత్వమయితే లభించిందిగానీ డబ్బుకోసం ఇబ్బందులు పడటం తప్పలేదు ఒకసారి అతడు 'శ్రీశ్రీ' (!) అనే గుర్రం మీద పందెంకాసి నష్టపోయాడు. రాయపేటలో నివాసగృహం ఏర్పరచుకొని ఏదో ఒకరోజున ధనవంతుణ్నవుతానన్న విశ్వాసంతో గుర్రప్పందేల్లో నిత్యం పాల్గొనటం మొదలుపెట్టాడు. సినీరంగంలోనూ ప్రయోగాలు చేయటం మొదలేశాడు. 1949లో నట్ ఔర్ నందా (నవీనా) అనే హిందీ సినిమాను ఆహుతి అనే పేరున తెలుగులోకి డబ్ చేశాడు. హెచ్.ఎం. రెడ్డి నిర్దోషి అనే తెలుగు చిత్రాన్నీ నిరపరాధి అనే తమిళ చిత్రాన్నీ తీస్తూ శ్రీశ్రీని చేరదీశ డు. ఆ తరువాత తాగుబోతని పోలీసులొకసారి అతడికి కృష్ణజన్మస్థానం చూపి అయిదు వందల రూపాయల జుర్మానా వసూలు చేశారు. కాలచక్రమనే తెలుగు సినిమాలో తన మరో ప్రపంచం గేయాన్ని పాడటానికంగీకరించిన బందా కనకలింగేశ్వరరావంతటి మహాగాయక నటుడు తగినట్లు పాడలేకపోయినందున ధన సంపాదనావకాశం ధ్వంసమైపోయింది. ఇటువంటి వైఫల్యాలేవీ సినీరంగం నుంచి అతణ్ని మరల్చలేకపోయాయి. 1950 నుంచీ సినీ రచయితగా స్థిరపడి త్వరలో పేరుమోసి రాణించాడు. 1951లో జరిగిన బొంబాయ్ ఫిల్మ్ ఉత్సవంలో అతడు న్యాయనిర్ణేతగా ఎంపికైనాడు. 1952లో విడుదలైన ప్రపంచమనే చిత్రంలో మొదటిసారి అతడి రూపం ప్రదర్శితమయింది. తరువాత 1968లో జి. వరలక్ష్మి దర్శకత్వం వహించిన ''మూగజీవులు'' సినిమాలో ఇతర కవులతోపాటు శ్రీశ్రీ కూడా దర్శనమిచ్చాడు.

ఈ శతాబ్ది మధ్యకాలానికి శ్రీశ్రీ మహాకవిగా మేధావిగా గుర్తింపు సాధించాడు. యువతరానికి అతడొక ఆకర్షణకరమైన (ఆదర్శం) నమూనా అయినాడు. అతడి చమత్కారాలూ ప్రత్యుక్తులూ నలుగురితో కలిసిపోయే స్వభావమూ అన్నిటికన్నా ఎక్కువగా చాటూమాటూలేని ప్రవర్తనా అన్ని రంగాల్లోనూ అతడికి అభిమానులను సంపాదించి పెట్టాయి అవిభక్త మదరాసు రాష్ట్రంలోని శాసనమండలిలో ఆయనకు సభ్యత్వం లభించింది. అతడి వామపక్షాభిమానం దేశం సరిహద్దులను అధిగమించినందువల్ల కమ్యూనిష్టు చైనా అతణ్ని ఆహ్వానించింది. అయితే ఆనాటి మదరాసు రాష్ట్ర ముఖ్యమంత్రి సి రాజగోపాలాచారి అతడు దేశం హద్దులు దాటకుండా జాగ్రత్తపడ్డాడు. ఆకాలంలో రాజకీయ వ్యంగ్య భూయిష్ఠంగా కార్టూన్ కవితలు వెలయించటం మొదలుపెట్టాడు. 1954లో స్టాక్‌హోంలో జరిగిన ప్రపంచ శాంతి మహాసభల్లో పాల్గొనవలసిందనే ఆహ్వానమందింది. కెయిరో మీదుగా ప్రయాణించి 13-11-54 – 21-12-54 ల మధ్యకాలంలో ప్రథమ పర్యాయం విదేశీయాత్ర చేశాడు. 1955 నాటికి ధనవంతుడయినాడు. మదరాసులో సొంత యిల్లూ సొంత కారూ ఏర్పడ్డాయి. తాను సంపాదిస్తున్నంత కాలమూ అభ్యదయ రచయితల సంఘంకోసం విచ్చలవిడిగా ఖర్చుపెట్టాడు. విజయవాడలో జరిగిన అయిదో అరసం మహాసభలకు అధ్యక్షత వహించాడు. భారత కమ్యూనిష్టు పార్టీకి ఎన్నికల ప్రచారంలో తోడ్పడ్డాడు. ఆ సమయంలో అరసం నుంచి వేరుపడిపోయిన మాజీ అభ్యుదయ రచయితలు ఒక్కపెట్టున అతడిమీదకు విరుచుకుపడ్డారు అది అతణ్ని చాలా బాధించించి మానసికంగా. కానీ అప్పటినుంచీ అతడు ప్రజానాయకుడై రాజకీయాల్లో గుర్తింపు పొందగలిగినాడు. గూడూరులో జరిగిన ఒక ఎన్నికల సభలో మనస్థిమితత్వం కోల్పోయి, హనుమాన్ జంక్షన్‌లో జరిగిన రాజకీయ సభ తరువాత మానసిక రోగానికి గురి అయినాడు. శ్రీశ్రీయే చెప్పిన ప్రకారం అనిసెట్టి సుబ్బారావు, ఆరుద్ర (అసలు పేరు భాగవతుల శంకరశాస్త్రి, శ్రీశ్రీ మేనల్లుడు)లు అతణ్ని మదరాసుకు చేర్చి కొంతకాలం మానసికవైద్యశాలలో చికిత్స చేయించారు

తన రేడియో నాటికల సంపుటిగా మరో ప్రపంచం అనే గ్రంథాన్ని 1956లో ప్రచురించి మరుసటేడు శ్రీశ్రీ చరమరాత్రి పేరిట తన కథానికలను అచ్చువేయించాడు 'చైతన్య స్రవంతి' అనే రచనా శిల్పాన్ని తన వచన రచనల్లో ప్రదర్శించిన శ్రీశ్రీ ఆ పద్ధతిని తెలుగు సాహిత్యంలో ప్రవేశపెట్టిన మొదటి రచయిత అనిపించుకున్నాడు. తన వాదాలను ప్రచురించటం 1958లో ఆరంభించాడు ఉషశ్రీ అనే చిత్ర సంస్థ పేరిట 'చెవిలో రహస్య'మనే సొంత సినిమా తీసి చాలా నష్టపోయాడు. అది 1959లో. ఆయేడే అతడి జీవితంలో ఉత్థానాలనేకం జరిగాయి తనకన్నా ముప్పయి సంవత్సరాలు చిన్నదైన ఉపద్రష్ట సరోజను వివాహమాడి ఆమెద్వారా ముగ్గురు కుమార్తెలకూ, ఒక్కకుమారుడికీ జన్మనిచ్చాడు. అతడి ప్రథమ పుత్రిక 1959లో జన్మించింది. తన సొంత కారును

కుదువబెట్టి 5-5-1959కీ 14-5-1959కీ మధ్యకాలంలో ప్రపంచశాంతి సంఘ మహాసభలకు డెలిగేటుగా హాజరయినాడు. తిరిగి రాగానే పచ్చి కమ్యూనిస్టనే ముద్రపడింది. ఎం.వి.శాస్త్రి అనే వకీలుతో కాకినాడలో విడిసినప్పుడు అతడిమీద దౌర్జన్యం జరిగింది. చేతి గడియారం దొంగిలించారు రష్యాలో కొని తెచ్చుకొన్న కెమేరాను లాక్కొని ధ్వంసం చేసి తిరిగి ఇచ్చారు. అరుణాచలానికి రమ్మని 1962లో చలం ఆహ్వానించాడుగాని శ్రీశ్రీ పోలేదు. 1963లో కొడుకు పుట్టాడు. 1966లో ఖడ్గసృష్టి అనే పేరున తాను రాసిన అతి వాస్తవిక కవితా సంపుటికి సోవియట్ ల్యాండ్ నెహ్రూ పురస్కారం లభించింది. బహుమతి స్వీకరించటం కోసం మూడోసారి రష్యా వెళ్లివచ్చాడు. ఆయేడే హైదరాబాదు హిందీ ప్రచారసభ వాళ్లు తమ ఆనుసాంవత్సరిక స్నాతకోత్సవంలో శ్రీశ్రీకి 'సాహిత్యాచార్య' బిరుదిచ్చారు. అంతకుముందు న్యాయమూర్తి పి.వి. రాజమన్నారుకూ, ఆచార్య వి.కె. గోకక్‌కూ మాత్రమే ఆ పురస్కారం లభించింది.

## చివరి రోజులు

సంప్రదాయ వ్యతిరేక, వామపక్షీయ, విప్లవాత్మక విషయమేదయినా శ్రీశ్రీకి ఆకర్షణకరంగా తయారయింది. ప్రజావ్యతిరేక స్వప్రయోజన పరాయణ పద్ధతులవలంబిస్తున్న సామాజికులనూ ప్రధానంగా రాజకీయవాదులనూ అశ్లీల భాషలో కూడా నిందిస్తూ వచన కవిత్వం రాస్తున్న దిగంబర కవుల రాకతో సాహితీరంగం కొత్త సమస్యలు ఎదుర్కొంటున్న సమయంలో, శ్రీశ్రీ వారి రచనలను ఇంగ్లీషులోకి అనువాదం చేస్తానని వాగ్దానం చేస్తూ 1968లో ఉత్తరం రాశాడు. అన్న మాటను నిలుపుకున్నాడు కూడా. విశాఖపట్నంలో ఎంతో ఆర్భాటంగా 1970 ఫిబ్రవరి 2వ తేదీన అతడి షష్టిపూర్తి ఉత్సవం జరిగింది. రాజకీయ విభేదాలను విస్మరించి సుప్రసిద్ధ రాజకీయ నాయకుడు తెన్నేటి విశ్వనాథం ఆహ్వాన సంఘాధ్యక్షత వహించాడు. ఆ సమయంలో శ్రీశ్రీకున్న జనాదరణ అంత ఉన్నతస్థాయిలో ఉంది. సాహితీపరులూ తదితరులూ అత్యధిక సంఖ్యలో పాలుపంచుకొన్నందువల్ల గురజాడ కళామందిరం నుంచి సభాస్థలిని మున్సిపల్‌స్టేడియానికి మార్చవలసి వచ్చింది. విశాఖపట్టణంలోని ఎల్లమ్మతోట (ఇప్పటి జగదాంబా సెంటరు) నుంచి నూతన సభా స్థలానికి దాదాపు రెండువేలమంది అభిమానులు ఊరేగింపు జరిపారు. ఆంధ్రదేశంలో అటువంటి మహత్తర గౌరవం మరే సాహితీపరుడికీ ఏనాడూ జరగలేదు. 1970లో శ్రీశ్రీ ఆంధ్రప్రదేశ్‌సాహిత్య అకాడమీలో విశిష్టసభ్యుడయినాడు.

అరసంతో తనకున్న బంధాలన్నీ తెంచుకొని 4-7-1970 నాడు తీవ్ర వాదోపవాదాల మధ్య, ఆగ్రహావేశాల మధ్య విరసం (విప్లవ రచయితల సంఘం) అధ్యక్ష పదవికి అంగీకరించాడు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ విశిష్ట సభ్యత్వానికీ, తాను యువకుడైనప్పటినుంచీ అనుబంధం పెంచుకున్న విశాఖపట్నంలోని కవితాసమితి

సాధారణ సభ్యత్వానికీ రాజీనామా చేశాడు. విరసం సంస్థాపకాధ్యక్షుడైన వెంటనే ఇతర సాహితీ సంస్థలన్నిటితోనూ తనకున్న బంధాలు తెంచుకున్నాడు. విరసం ప్రధమ ప్రచురణ ఝుంఝును ఖమ్మంలో ఆవిష్కరించాడు విరసం ఆదర్శాలకు అఖిల భారతస్థాయిలో రూపకల్పన చేయాలని ఢిల్లీలో జరిగిన ఆఫ్రో ఆసియన్ రచయితల సమావేశానికి హాజరైనాడు. అక్కడ 18-10-1970 నాడు తానూ హంస్‌రాజ్ రహ్బరూ సహ సమావేశకర్తలుగా అఖిల భారత విప్లవ రచయితల సంఘం సమన్వయ సంఘాన్ని ఏర్పాటు చేశాడు : (1970 డిశెంబరులో రహ్బరుమీద దేశద్రోహ నేరం మోపి భారత ప్రభుత్వం అభియోగం నడిపింది). ఆ సంఘంలోకి పంజాబ్, బీహార్, పశ్చిమ బెంగాల్ రాష్ట్రాలనుంచి చాలామంది యువరచయితలను చేర్చుకోగలిగాడు.

1970లో విప్లవవాదిగా మారిపోవటం హఠాత్పరిణామ మనిపిస్తుంది తాను సెవెన్‌స్టార్ సిండికేట్ వారి పత్రిక నవతకు సంపాదకుడు. ఆ సంఘం వారి దశమ వార్షికోత్సవంలో హాజరయ్యేందుకు అతడు 1970 జూలై 4వ తేదీన హైదరాబాద్ చేరుకున్నాడు. విద్వాన్ విశ్వమున్న హోటల్ గదిలో ఆరోజు జరిగిన అరసం కార్య నిర్వాహకవర్గ సమావేశానికి అధ్యక్షత వహించాడు. దరిమిలా ఆరుద్రతో కలిసివెళ్ళి బద్రుకా కళాశాల విద్యార్థుల సభలో ప్రసంగించాడు. కానీ తరువాత జరిగిన బహిరంగ సభలో కనిపించలేదు. కే.వీ. రమణారెడ్డితో కలిసి ఇంపీరియల్ హోటల్ చేరుకున్నాడు. అక్కడే రాత్రి 1.10 గంటలకు విరసం సంస్థాపకుడైనాడు. విశాఖపట్నంలో షష్టిపూర్తి సభల సందర్భంలో జరిగిన కొన్ని అనిష్ట సంఘటనలే హైదరాబాదులో ఇలా పరిణమించాయి. 1971లో విరసం ఎన్నికలను బహిష్కరించాలని నిర్ణయించింది కానీ శ్రీశ్రీ మాత్రం అఖిల భారత కమ్యూనిష్టు పార్టీ తరఫున అభ్యర్థిగా పోటీ చేయటానికి విఫలయత్నం చేశాడు. 1972లో అతడి సదసత్సంశయమనే రచనకు న్యూఢిల్లీలోని సాహిత్య అకాదమీ పురస్కారమిస్తానని ప్రకటించింది. బహుమతి స్వీకరించి ఆ సొమ్మును విరసం ప్రత్యేకోపయోగం కోసం ఒక ముద్రణాలయాన్ని స్థాపించటానికి విరాళంగా ఇద్దామనుకున్నాడు. కానీ విరసం ఆ పురస్కారాన్ని తిరస్కరించాలని నచ్చచెప్పింది. సొంత ఖర్చులతో ఢిల్లీకి వెళ్ళిన శ్రీశ్రీ నగరంలో ఉండికూడా 16-3-1973 నాడు జరిగిన పురస్కార ప్రదానోత్సవానికి హాజరుకాలేదు. కానీ ఒక పక్షం రోజుల తరువాత పోస్టు ద్వారా వచ్చిన చెక్కును స్వీకరించాడు! తెనాలిలో జరిగిన ప్రత్యేక సమావేశంలో విరసం ఈ చర్యను ఖండించింది. కానీ తన ఆధ్వర్యంలో ప్రత్యేక తెలంగాణా సదస్సు నిర్వహించాలని నిర్ణయించటాన్ని నిరసిస్తూ అప్పటికి రెండునెలల క్రితమే శ్రీశ్రీ విరసం అధ్యక్ష పదవికి రాజీనామా చేశాడు.

ప్రజామత, స్వాతి పత్రికల్లో అసంపూర్ణంగా వదిలేసిన తన జీవిత చరిత్ర అనంతాన్ని 1975 నుంచి పునః ప్రారంభించి ప్రచురించటం మొదలుపెట్టాడు.

హైదరాబాదులో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం మొదటి ప్రపంచ తెలుగు మహాసభలు నిర్వహించాలని నిర్ణయించింది. విరసంతోబాటు శ్రీశ్రీ కూడా అందుకు అభ్యంతరం తెలియజేశాడు. జ్ఞానపీఠ పురస్కార స్వీకర్త విశ్వనాథ సత్యనారాయణతో శ్రీశ్రీ విజయవాడలో సమావేశమై అటువంటి మహాసభను సమావేశపరిచే అవసరం లేదని సంయుక్త ప్రకటన విడుదల చేశాడు. శ్రీశ్రీ యౌవనంలో ఉండగా విశ్వనాథ సత్యనారాయణను ఆరాధించాడు. తరవాతి కాలంలో ఆధునిక కవితా రూపం విషయంలో వస్తు విషయంలో వారి మధ్య తీవ్ర విభేదాలు వచ్చాయి. వారిద్దరి మధ్యా అనురాగద్వేష సంస్పృష్ట సంబంధాలుండేవి. బహుశా ఆకారణంగానేమో తమది సంయుక్త ప్రకటనేననీ, కాదనీ పరస్పర ఖండనలతో వారు బహిరంగ విమర్శలు విడుదల చేశారు. దుమారం లేచింది. అయితే ఆ యిద్దరిలో ఎవరు పూర్తి నిజం చెప్తున్నారో తేలే విషయం కాదు. శ్రీశ్రీ విరసం మార్గాన్నే అనుసరించదలచాడు 1975 ఏప్రిల్ 12వ తేదీన ప్రపంచ తెలుగు మహాసభల నిర్వహణను వ్యతిరేకిస్తూ శ్రీశ్రీ కరపత్రాలు పంచాడు. మఫ్టీలో ఉన్న పోలీసులు అతణ్ని అరెస్టుచేసి ఆరాత్రి బొలారం జైల్లో విడిది చేయించారు. ఆ వ్యతిరేకోద్యమ సందర్భంగా అందులో పాల్గొన్న విరసం సభ్యులందర్నీ మీసా నిబంధనల కింద అరెస్టు చేశారు. శ్రీశ్రీని అలా చేయలేదు!

భారత ప్రభుత్వం 1975 జూన్ 26వ తేదీన అత్యవసర పరిస్థితి ఏర్పడిందని ప్రకటించిన తరువాత 20 సూత్రాల ప్రణాళికను విడుదల చేసింది. దాన్ని మెచ్చుకుంటూ శ్రీశ్రీ రాసిన గేయాలను ఆలిండియా రేడియో ప్రసారం చేసింది. 1975 ఆగస్టు 3వ తేదీ ప్రజాతంత్రలో శ్రీశ్రీ తన వీలునామాను ప్రచురించాడు. 1976 నవంబరు 11వ తేదీన డాక్టర్ డి.ఎస్. కోట్నీస్ స్మారకసంఘం కార్యదర్శి డేనియల్ లతీఫ్ నుంచి చైనా సందర్శించమని ఆహ్వానపత్రం వచ్చింది. 6-12-76న బయలుదేరి 27-12-76 దాకా 21 రోజులు చైనాలో పర్యటించి ఆకస్మికంగా తిరిగి వచ్చాడు స్వదేశానికి. చైనాలో ఉండగా 24-1-76న పెకింగ్ రేడియోలో 'నా చైనా' అనే గేయం ప్రసారం చేశాడు. అందులో చైనామాతా భారత్‌మాతా కవలపిల్లలన్నాడు. చైనా ప్రయాణానికి ముందే (మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తనను అరెస్టు చేయించిన అప్పటి) ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి వెంగళరావును ప్రస్తుతిస్తూ ప్రజాతంత్రలో ఒక వ్యాసం రాశాడు సినీతార భానుమతీ రామకృష్ణ, రచయిత డి.వీ. నరసరాజులు పొగడ్తలకతీతులని ప్రశంసించాడు. పనిలో పనిగా ఇందిరాగాంధీ ఇరవై సూత్రాల ప్రణాళికను కీర్తించాడు. చైనానుంచి తిరిగి రాగానే విప్లవ వ్యతిరేకమైన అవకాశవాదాత్మకమైన రాజకీయ విధానాలు పాటిస్తున్నందుకు విరసం శ్రీశ్రీకి అభిశంసనపత్ర మందించింది. మరికొన్ని సినీ అవకాశాలు దక్కించుకొనేందుకు చైనానుంచి అర్ధాంతరంగా తిరిగి వచ్చాడని దూషించింది. తన దుశ్చర్యలకు సంజాయిషీ ఇచ్చుకొమ్మని నిగ్గదీసింది. ఆ సమయంలో అతడు విరసానికీ, పౌరహక్కుల సంఘానికీ అధ్యక్షుడు. అత్యవసర పరిస్థితిని ఉపసంహరించమనే

దరఖాస్తుమీద సంతకమెందుకు పెట్టలేదని నిలదీసింది. విజయవాడలో 1977 జూన్ 11, 12 తేదీల్లో జరిగిన విరసం సాధారణ సమావేశానికి హాజరై తాను చేసిందంతా తన 'విదూషకత్వం' కారణంగానేనని, తనను అధ్యక్ష పదవినుంచి తప్పించవలసిందనీ కోరాడు. ఏ కారణం చేతనయితేనేం, విరసం అతణ్ని క్షమించి, అధ్యక్షపదవినుంచి తప్పించి (ఈనాటికీ ఆ పదవి ఖాళీగానే ఉంది), సంస్థలో సాధారణ సభ్యుడిగా ఉండటానికి మాత్రం సమ్మతించింది. 1977లో ఇందిరాగాంధీని తిరిగి ఎన్నుకొమ్మని ప్రచారం చేశాడు. విరసంలోని అత్యధిక సంఖ్యాకుల నిర్ణయానికి కట్టుబడి మాత్రమే ప్రపంచ తెలుగు మహాసభలను బహిష్కరించానుగాని వ్యక్తిగత కారణాలవల్ల కాదని ప్రకటించాడు!

శ్రీశ్రీ 1979 నవంబరు 19వ తేదీన మదరాసులో పదివేల రూపాయాల రాజ్యలక్ష్మీ పురస్కారాన్ని మొదటగా స్వీకరించిన వాడైనాడు. ఆంధ్రజ్యోతి పాఠకులు అతడు సుప్రఖ్యాతాంధ్రుడని ఎంపిక చేశారు అప్పుడతడు రుక్మిణీ కల్యాణమనే సినిమా తీద్దామనుకున్నాడుగాని ముందుకు సాగలేదు గూటాల కృష్ణమూర్తి ఆహ్వానంమీద పురిపండా అప్పలస్వామితో కలిసి 1980లో లండన్ నగరం సందర్శించి అక్కడ నాలుగు నెలలు గడిపాడు. జార్జి బార్కర్ (1913-. .. ... .) వంటి ప్రసిద్ధ బ్రిటిష్ రచయితలు కొందరిని కలిశాడు. 1980 మార్చి 2వ తేదీన కాకినాడలో అతడి సప్తతి పూర్తి సభలు బ్రహ్మాండంగా జరిగాయి. "శ్రీశ్రీ కవిత్వం - వస్తువు, సంవిధానం" అనే మిరియాల రామకృష్ణ సిద్ధాంత వ్యాసాన్ని ఆ సందర్భంలో విడుదల చేశారు. ఉత్సవం పూర్తి అవుతుండగానే లండన్‌కు తిరిగి వెళ్ళాడు తిరిగి వచ్చిన శ్రీశ్రీని హైదరాబాదులో విరసంవారు ఘెరావ్ చేశారు. అప్పటికి ఒక నెల ముందుగానే తనను బహిష్కరించిన విరసం వారికి తన రాజీనామా పత్రాన్ని పంపాడు! 1980 డిశెంబరులో డాక్టర్ డి.ఎ.ఎ.ఎన్. నారాయణరావు ఆహ్వానం మీద అమెరికా సంయుక్త రాష్ట్రాలకు వెళ్ళాడు. అక్కడ జూన్‌దాకా మిత్రులతో కాలక్షేపం చేశాడు. ప్రభుత్వం తనను ఆహ్వానించలేదనే వంకతో 1981 ఏప్రిల్‌లో మలేసియాలోని క్వాలాలంపూర్లో జరిగిన ద్వితీయ ప్రపంచ తెలుగు మహాసభలకు హాజరుకాలేదు. కానీ, జూన్‌లో చికాగో జరిగిన తెలుగు మహాసభలకు మాత్రం హాజరయినాడు - నిర్వాహకులు ప్రభుత్వేతర సంస్థవారు కాబట్టీ, తనను ఆహ్వానించారు కాబట్టీ. శ్రీశ్రీ సొంత దస్తూరీతో రాసి సొంత గొంతుతో చదివిన మహాప్రస్థానాన్ని అతడు లండన్లో ఉండగా గూటాల కృష్ణమూర్తి సిద్ధం చేశాడు. అమెరికాలో ఉండగా 1981లో అతడి శిప్రాలి ఫోటోకాపీని విడుదల చేశారు

ఆంధ్రప్రదేశ్‌లో 1982లో జరిగిన ఎన్నికల్లో శ్రీశ్రీ ఎన్.టి. రామారావును సమర్థించి, తన సమర్థనకు రామారావు వ్యక్తిత్వంగానీ అతడి పార్టీగానీ కారణాలు కావన్నారు. తనకున్న ప్రభుత్వ వ్యతిరేక భావనలే అలా చేయించాయన్నాడు 1982లో కొన్ని కోర్టు కేసుల్లో చిక్కుకున్నప్పుడు అభిమానులు ఆర్థిక సహాయంచేసి ఆదుకున్నారు.

అతడి ఆరోగ్యం దెబ్బతిన్నది. ఆర్థిక పరిస్థితి అస్తవ్యస్తమయింది. అయినా 1983 ఏప్రిల్‌లో జరిగిన నల్గొండ రచయితల మూడో మహాసభకు వచ్చి ఉపన్యసించాడు. ఆంధ్రజ్యోతిలో మొదలుపెట్టిన ధారావాహిక రచనలను కొనసాగించలేకపోయాడు. నేటి భారతమనే చిత్రానికి అతడు 1983 జూన్ 4వ తేదీన రాసిందే అతడి చివరి గేయం. అతడి ఇల్లు వేలానికి వస్తే మిత్రులు చేయూతనిచ్చి ఆదుకున్నారు. కేన్సర్ వచ్చింది. కోలుకుంటున్నాడనుకుంటుండగా రక్తపోటు తీవ్రమై జూన్ 6వ తేదీన ఆసుపత్రిలో చేర్చవలసి వచ్చింది. 1983 జూన్ 15వ తేదీ సాయంత్రం 5.30 గంటల ప్రాంతంలో శ్రీశ్రీ భౌతికజీవితం సమాప్తమయింది మరునాడు అతడి చివరి కోరికలకు విరుద్ధంగా అతడి భౌతికకాయానికి దహన సంస్కారాలు జరిగాయి. తన మృత శరీరాన్ని ఏదో ఒక వైద్యశాలకు దానమివ్వాలని అతడు సంకల్పించాడు. కానీ అతడి భార్య కోరిక మేరకు అగ్ని దగ్ధం చేయవలసి వచ్చింది. అతడి అంతిమ సంస్కారం కూడా వివాదాలకు దారితీసింది. బతికుండగా శ్రీశ్రీ భిన్నరంగాల్లోని లక్షోపలక్షలమందిని ఆకర్షించాడు. సాహితీ రాజకీయ సామాజిక రంగాలకు సంబంధించిన రకరకాల వివాదాల మధ్య జీవించాడు. అతడి వ్యక్తిగత లోపాలెన్ని ఉన్నా అతడి జనాకర్షణశక్తి కుంటుపడలేదు. అతడి బోళాబాళీతనమూ, చిన్నాపెద్దా భేదం లేకుండా అందరితో కలిసిపోగల సరదా పద్ధతీ, హాస్య చమత్కారాలూ, అన్నిటికన్నా మిన్నగా అతడి అద్భుత సాహితీశక్తీ అతణ్ణి శత్రు మిత్ర భేదానికీ పండిత పామర తారతమ్యానికీ అతీతంగా జనప్రియుణ్ణి చేశాయి. అందువల్లనే అల్లూరి సీతారామరాజు సాంస్కృతిక సంఘం తరపున శ్రీశ్రీ స్మారకోపన్యాసాలను ఏటేటా నిర్వహించవలసిందని ఆంధ్ర విశ్వవిద్యాలయానికి యాభైవేల రూపాయలు విరాళం ప్రకటించాడు సినీనటుడు కృష్ణంరాజు. హైదరాబాదులో హుస్సేన్‌సాగర్ ఒడ్డున మగ్దుం మొహియుద్దీన్ శిలా విగ్రహంతోబాటు శ్రీశ్రీ విగ్రహాన్ని కూడా 1986 జూన్ 3వ తేదీన ప్రతిష్ఠాపించారు. సమాజం నుంచి ఒక తెలుగుకవి పొందగలిగిన అపూర్వగౌరవాలివి. అతడితో తమకు ఎన్నెన్ని విభేదాలున్నా, విరసంవారు శ్రీశ్రీ సమగ్ర సాహిత్యాన్ని ప్రచురించారు. అతడి రాజకీయ బాంధవ్యాలతో నిమిత్తం లేకుండా తన జీవితకాలంలోనేగాక మరణానంతరం కూడా తనను గురించి ఏమాత్ర మయినా తెలిసినవారి నుంచి అఖండ గౌరవాన్ని, ప్రేమాభిమానాలను, సానుభూతిని సంపాదించుకొంటూనే ఉన్నాడు.

# ద్వితీయ ప్రకరణం

## తొలి ప్రభావాలు

తనకు రెండేళ్లయినా నిండకుండానే మాతృవియోగం కలిగినా శ్రీశ్రీ బాల్యం సుఖశాంతులతో గడిచింది. తనది విద్యావంతుల కుటుంబం. తండ్రి గణిత శాస్త్రాధ్యాపకుడు. చుట్ట నిప్పుతో తనను స్మారకస్థితికి తెచ్చిన మేనమామ శివప్రసాదరావు కలెక్టర్ కార్యాలయంలో శిరస్తాదారు. దత్తు తండ్రి సోదరుడూ విజయనగరం వాస్తవ్యుడూ అయిన సుందరనారాయణకు ఇద్దరు కొడుకులు - అప్పడు పంతులు, నారాయణబాబు అని. రెండోవ్యక్తి శ్రీశ్రీకి బాల్య స్నేహితుడు. తరువాతి కాలంలో మంచికవిగా, గాయకుడుగా అభివృద్ధికి వచ్చాడుగాని చివరకు దూరమైనాడు. తండ్రి తన బాల్య చేష్టితాలను సహించి పిచ్చిబొమ్మలతో గోడలు ఖరాబు చేయకుండా నల్లబల్లా స్పాంజి డస్టరూ కొనిపెట్టాడు. తన ఆటపాటలకు అనేక విధాల ప్రోత్సాహం లభించింది. పదేళ్ల వయసులో అశరీరవాణి అనే స్త్రీ పాత్ర ధరించి కృష్ణలీలల్లో నటించాడు. తండ్రి ఉపాధ్యాయ పాత్రను కూడా స్వీకరించాడు. సంస్కృతం నేర్చుకొమ్మని ప్రోత్సహించాడు. తన బాల్యంలోనే జాతీయవాదీ స్థానిక కవీ తన తొలి కవితను ప్రచురించిన వాడూ అయిన పురిపండా అప్పలస్వామితో కలిగిన పరిచయం కవితాసమితి అనే సాహిత్య సంస్థలో చేర్పించింది. విద్యార్థి దశ వచన గ్రంథాలనూ అపరాధ పరిశోధక నవలలనూ చదవటంలో, స్థానిక నాటక సంఘం జగన్మిత్ర సమాజంలో చిల్లరవేషాలు కట్టడంలో గడిచింది

విశాఖపట్నంలోని మిసెస్ ఎ.వి.ఎన్. కాలేజి వైస్-ప్రిన్సిపల్ వడ్డే కేశవరావు ఛందస్సు నేర్పాడు. ద్వారం జగన్నాథరావుతో కేరమ్సూ ఫుట్‌బాలూ ఆడటం, విశాఖపట్నంలోని కాశూరి నరసింగరావుతోనూ విజయనగరంలోని శ్రీరంగం నారాయణబాబుతోనూ సాహితీ చర్చలు చేయటం వీలుపడింది. బాల్యదశలో శ్రీశ్రీ రాసిన కవిత దివ్య లోచనములు స్వశక్తి పత్రికలో ప్రచురితమైన తరువాత వర్ధమాన కవిగా స్థానికంగా గుర్తింపు వచ్చింది. ఎనిమిదేళ్ల వయసులోనే పద్యరచన ఆరంభించాడు. ఉన్నత పాఠశాలా విద్య పూర్తికాకముందే తాను చదివిన పుస్తకాలను అనుకరిస్తూ గ్రంథరచన మొదలుపెట్టాడు. దేశభక్తి ప్రధాన విషయంగా వీరసింహ విజయ సింహులనే కల్పిత కథ రాశాడు. కాలూ రాయి చదివి గోకులాయ్ అనే అపరాధ పరిశోధక నవల రాశాడు. ఆరోజుల్లోనే ఎవరూ పట్టించుకోని మారుమూల ఛందస్సులలో సావిత్రీ సత్యవంతమనే పద్యనాటిక రచించాడు.

తన అభిప్రాయాలను వ్యక్తీకరించటానికి విద్యార్థిగా ఉండగానే పరిణయరహస్య మనే నవలికను రాశాడు. అలనాటి రచనలు చాలావరకు ఏమైపోయాయో తెలీదుగానీ చివరి పుస్తకం ప్రతి ఇటీవల దొరికింది. ఇటువంటి సాహిత్య వ్యాసంగంలో ఉండికూడా సమకాలిక సాహిత్యాన్ని చదువుతూనే ఉండేవాడు. విశ్వనాథ సత్యనారాయణ మేఘనినాదం, దేవులపల్లి మోహినీ గాంధర్వగానం వంటి ఖండ కావ్యాలు అతణ్ని ఎంతో ప్రభావితం చేశాయి. పద్యరచనలో విశ్వనాధను అనుకరించటానికి ప్రయత్నించాడు. అదే సమయంలో ఆధునిక భావాలనూ కార్యక్రమాలనూ అభిమానించే సెట్టి మాష్టారుతో (విశాఖపట్నం వాస్తవ్యుడైన సెట్టి లక్ష్మీనరసింహంతో) సన్నిహిత సంబంధమేర్పడింది. నవయుగ వైతాళికుడైన గురజాడ వేంకట అప్పారావు (1861-1915) రచనల ప్రభావానికి ముగ్ధుడయ్యేలోగా, శ్రీశ్రీ బసవరాజు అప్పారావు (1854-1933), కవికొండల వేంకటరావు (1892-1965), చింతా దీక్షితులు (1891-1960) రాసిన కవితల మీద అభిరుచి పెంచుకున్నాడు గురజాడ ప్రభావానికి లోబడే ముందు ఆ ముగ్గురే తన బాల్య గురువులన్నాడు. తరువాతి కాలంలో ఇద్దరే తనకు నిజమైన గురువులని, మొదటి వ్యక్తి తన తండ్రి అనీ, రెండోవారు అబ్బూరి రామకృష్ణరావని (1896-1979) చెప్పుకున్నాడు. అబ్బూరి బహుముఖ విద్వాంసుడు. ప్రసిద్ధకవి. రాజకీయ విశారదుడు. వృత్తిరీత్యా ఆంధ్రవిశ్వవిద్యాలయ గ్రంధాలయాధిపతి. ఆయన ద్వారానే తనకు ఆస్థానకవి చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి (1870-1950) మీద అపారగౌరవం కలిగిందని శ్రీశ్రీ చెప్పాడు

లక్నోలో 1936లో జరిగిన అభ్యుదయ రచయితల సంఘ ప్రథమ సమావేశానికి హాజరైన అబ్బూరి 1920 ప్రాంతాల్లో ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్య (1898-1928) అనుయాయి ఆంధ్ర విశ్వవిద్యాలయ స్థాపకోపాధ్యక్షుడైన కట్టమంచి రామలింగారెడ్డికి మిత్రుడయినందున, ఆయన కోరగా విశ్వవిద్యాలయం తెలుగుశాఖలో ఉపన్యాసకుడుగా చేరి తరువాత గ్రంథాలయాధిపతి అయినాడు (ఆ పదవిలో ఆయన మూడు దశాబ్దాలపై కాలం పనిచేశాడు). ఆయన మైసూరు మహారాజా కళాశాలలో సంస్కృతం చదివి, తరువాత విద్యార్థిగా నవద్వీపం చేరుకున్నాడు. కొన్నాళ్లు శాంతినికేతనంలో కూడా ఉన్నాడు. విశాఖపట్నంలో భారత కమ్యూనిష్టు పార్టీ శాఖ నేర్పరిచేందుకు శ్రమించాడు. ఆయన దరిమిలా మానవేంద్రనాథ్ రాయ్‌కి సన్నిహితానుచరుడై తీరాంధ్రలో రాడికల్ కమ్యూనిష్టు సిద్ధాంతాలను ప్రచారం చేశాడు. ఆయన తొలితరం భావకవిగా ప్రసిద్ధుడు. తెలుగు నాటకరంగ ప్రవర్తకుల్లో స్థానం సంపాదించాడు. ఆయన నటుడు కూడా. ఆయనే లండన్ అభ్యుదయ రచయితల మానిఫెస్టోను రహస్యంగా సంపాదించి చదవమని శ్రీశ్రీకి ఇచ్చినవాడు. శ్రీశ్రీ దాన్ని అద్భుత సాహితీరూపంలో పెట్టాడు. అబ్బూరి చతుర సంభాషణశీలి. ఆయన్ను నడిచే

విజ్ఞానసర్వస్వ మనేవాళ్ళు. అబ్బూరికి శ్రీశ్రీమీద అపార ప్రేమాభిమానాలు కలిగాయి. చిరస్థాయిగా మిగిలాయి 1956 ప్రాంతాల్లో శ్రీశ్రీని ప్రశంసిస్తూ ఓ గేయం కూడా రాశాడు - అంతకు ముందు శ్రీశ్రీ ''కవితా! ఓ కవితా!'' అనే గేయంలోని రాజకీయ విశ్వాసాలను అధిక్షేపించినప్పటికీ, శ్రీశ్రీ అబ్బూరికి జీవితాంతం కృతజ్ఞుడుగా ఉన్నాడు. తన గురువనేవాడు ప్రపంచ సాహిత్యాలవైపూ, సాహితీ ధోరణులవైపూ తన దృష్టిని మళ్ళించి జ్ఞాననేత్రం ప్రసాదించిన వాడన్నాడు ద్రోణాచార్యుడని ప్రస్తావించేవాడు. తనను తీర్చిదిద్దినవాడని పదేపదే చెప్తుండేవాడు.

చాలా చిన్నవయసునుంచే శ్రీశ్రీ పుస్తకాల పురుగైనాడు అందుకు సాక్షు లతడి బాల్య స్నేహితులైన పన్యాల రంగనాథరావు (1919-1987), మల్లవరపు విశ్వేశ్వరరావులు (1906-1986). చిన్నతనంలోనే తాను మొపాసా (1850-1893)ను మొదట, తరవాత ఛెహోవును (1860-1904) చదివి ఉత్తేజితుణ్ణయినానని శ్రీశ్రీ చెప్పాడు. యువకుడుగా ఉండగా శ్రీశ్రీని జేమ్స్‌జాయిస్ (1882-1941) యులైసిస్, మయకోవిస్కీ (1899-1930) లెనిన్ అనే రచనలూ గురజాడ రచనలన్నీ 'శాశ్వత ప్రభావం'లో ముంచాయి. విద్రోహికవి అనే పేరు తెచ్చుకున్న నజ్రుల్ ఇస్లాం (1899-1976) రచనలతో తనకు పురిపండా పరిచయ భాగ్యం కలిగించాడన్నాడు శ్రీశ్రీ హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ (1898-1990) కవితలు కొన్ని అలరించగా, శ్రీశ్రీ తక్షణం వాటిని తెలుగు చేశాడు శ్రీశ్రీకి జీవితాంతం ఒక 'అలవాటు' ఉండేది - అది తాను చదివి సమ్మోహితుడైనపుడు ఆ సాహితీ రూపాలను అనువదించటమనేది అబ్బూరి విశ్వవిద్యాలయ గ్రంధ భాండాగారం తలుపులు శ్రీశ్రీ కోసం ఎప్పుడూ తెరిచి ఉండేవాడు. అప్పటికింకా శ్రీశ్రీ కావ్యభాషాశైలిలో ఛందోబద్ధంగా పద్యరచన చేస్తుండేవాడు. తరువాతి కాలంలో విశ్వనాథ దేవులపల్లుల ప్రభావం నుంచి బయటపడి 'సొంత గొంతుక'ను - ఆధునికాంధ్ర సాహితీ చరిత్రలో చిరస్థాయిగా నిలిచే స్వీయ ధోరణిని - సవరించుకోడానికి దశాబ్ది కాలం కావలసి వచ్చిందని చెప్పుకున్నాడు. అతడి మొదటి మంచి కవిత ప్రభవ (1927), తర్వాతి సుప్తాస్థికలు (1928) ఆ ఇద్దరు మహాకవుల ధోరణిలోనే పదప్రసిద్ధ ధారాశుద్ధితో వెలువడ్డాయి ''డాడా తిరుగుబాటు, అధివాస్తవిక ప్రయోగం'' అనే పేరిట ఇరవై ముప్పయిమంది కవులు రాసిన కవితలున్న కరపత్రాన్ని అబ్బూరి తనకివ్వగా వాటిని చదివి ముగ్ధుడై స్వీయాభిప్రాయాలనూ, భావాలనూ, వ్యక్తీకరించడానికి అనేక మార్గాలున్నాయని గ్రహించానన్నాడు శ్రీశ్రీ. ఆకాలంలో వచన పద్య రచనలో ప్రయోగాలు చేస్తున్న శిష్ట్లా ఉమామహేశ్వరరావు (1909-1953) రచనలను గమనించి తానెందుకు అలా రాయగూడదని ఆవేశపడ్డాడు. గురజాడ ప్రభావం సరికొత్త ఛందస్సులను కనిపెట్టే మార్గాలను అన్వేషించమని ప్రోత్సహించింది ఇంటర్మీడియట్ కోర్సు పూర్తి చేసేలోగా అతడు అబ్బూరి వశీకరణ శక్తికి మైమరిచాడు; రాడికల్ హ్యూమనిజంవైపు మొగ్గలేదుగాని రాడికలిజాన్ని అభిమానించాడు.

1928లో విద్యాభ్యాసం కోసం మదరాసు చేరినప్పుడు కొందరు మహా విద్వాంసులతో రచయితలతో పరిచయమేర్పడింది శ్రీశ్రీకి. ప్రసిద్ధ సాహితీ పత్రిక భారతి కార్యాలయమున్న వీధిలోనే అతడికి గృహవసతి కలిగింది. విద్వత్కవి వేటూరి ప్రభాకరశాస్త్రి (1888-1950), ఆంధ్రేతిహాస పరిశోధకుల్లో అగ్రగణ్యుడైన మల్లంపల్లి సోమశేఖరశర్మ (1851-1963), జానపద భాషాశైలుల్లో కవితలు వెలయించి ప్రశాంతంగా ఉన్న సాహితీ సరస్సును అల్లకల్లోలం చేసిన నండూరి సుబ్బారావు (1895-1958) వంటి ఉత్తమ సాహితీపరుల్తో పరిచయం కలిగింది. ఇక్కడే తన ప్రథమ కావ్యాన్ని నిర్దాక్షిణ్యంగా విమర్శించిన కొంపెల్ల జనార్దనరావుతో (1907-1938) ప్రథమ పరిచయం కలిగి, అది స్నేహంగా పెరిగి, తరవాతి కాలంలో తన మహాప్రస్థాన గేయాలను అంకితం చేసేంతగా పరిణమించింది. భావకవి మల్లవరపు విశ్వేశ్వరరావు (1906-1986), జరుక్, మిణేశాస్త్రి, రుక్కులాంటి రకరకాల కత్తిరింపు పేర్లతో చండప్రచండాధిక్షేప కవిగా పేరుమోసిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914-1968), జ్వాల అనే సాహితీ పత్రిక సంపాదకుడుగా పేరుమోసిన సామినేని ముద్దుకృష్ణ (1899-1973) అతడికి మిత్రులయినారు. భారతి పత్రికకు సంపాదకుడుగా ఉండి తన కవిత 'సుప్తాస్థిక'లను తిరుగు టపాలో తిప్పి పంపిన గన్నవరపు సుబ్బరామయ్య (1890-1963) మిత్రుడై తరువాత అభిమానిగా పరిణమించాడు. ఈ మిత్రులతో తెలుగు సాహితీ రంగంలోని విభిన్న భావ స్రవంతుల గురించి చేసిన చర్చల వల్ల శ్రీశ్రీకి విశాలదృష్టి కలిగింది; అతడి విమర్శన దృష్టిపదును బారింది.

మదరాసులోని అడయార్, కన్నెమరా పబ్లిక్ లైబ్రరీలను శ్రీశ్రీ కొల్లగొట్టాడు. మదరాసు క్రిస్టియన్ కళాశాలలో బి.ఏ. విద్యార్థిగా ఆ నగరంలో రెండేళ్లున్న కాలంలో ఎడ్గార్ అలాన్‌పో(1809-1849) కవిత్వమూ, మొపాసా (1850-1893), ఛార్లెస్ బాదిలాయిర్ (1821-1867) రచనల అనువాదాలు అతణ్ని ముగ్ధుల్ని చేశాయి. అమెరికా లోని బీట్‌తరం వారి కవితలనో ఇంగ్లండులోని క్రుద్ధ యువకుల (angry young men) రచనలనూ అధ్యయనం చేశాడు. మహాత్మాగాంధీని ప్రభావితం చేసిన ఆఫ్రికన్ యువకుల రచనలకోసం గాలించాడు. జీన్‌పాల్ సార్త్ర్ (1905-1980) రచనలు పఠించాడు. జర్మన్ విద్వాంసుడు మాక్స్‌ఢోర్డాన్ అనేకమంది ఫ్రెంచి కవులను ఉల్లేఖిస్తూ ప్రచురించిన 'డీ జెనరేషన్' సంకలనం అతణ్ని ఆకట్టుకొంది. సర్ ఆర్థర్ కానన్‌డాయిల్ సృష్టించిన షెర్లాక్ హెూమ్స్ పరిష్కారాలను పరిశీలించాడు. పి.జి. వుడ్‌హౌస్ నవలలు వినోదపరిచాయి. అనతోల్ ఫ్రాన్స్ (1844-1924) కథలూ నవలలేగాక డెబ్బయ్ అయిదేళ్ల వయస్సులో తన భుజాలమీద ఎర్రజెండా మోసిన ఆయన ధైర్యసాహసాలు చకితపరిచాయి. అమెరికన్ రచయిత సిన్‌క్లెయిర్ లూయీ (1885-1951) నవలలేగాక అమెరికన్ పెట్టుబడిదారీ వ్యవస్థను తీతడు వ్యతిరేకించిన విధానం కూడా

ఆకర్షణకరమైనాయి. త్రివేణి పత్రికలో నేషనల్ హెరాల్డ్ సంపాదకుడు ఎం వి. చలపతిరావు (1909-1983) పరిచయం చేసిన ఎడిత్ సెట్వెల్ (1887-1964) అనే బ్రిటిషు క్యూబిస్టు కవయిత్రి రచనలు ఆకట్టుకోగా, ఆమెను అనుకరించి తానూ కొన్ని రచనలు చేశాడు క్రోపోట్కిన్ రాసిన 'An Appeal to youth' చదివి అతడి ప్రభావంతో తెలుగులో ఒక గేయం రాశాడు. ఎ.సి. స్విన్‌బర్న్, ఆల్గర్నాన్ ఛార్లీల కవితలు చదివి వారిని అనుకరించాడు, తన గేయాలు కొన్నింటిలో రబీంద్రనాథ్ ఠాకూర్‌లాగా ఒకసారి శబ్ద సౌందర్యంకోసం మరోసారి అర్థానుభూతికోసం కవితలను రెండుసార్లు చదవటమనే 'బలహీనత' నలవరచుకొన్నాడు ఈ విధానం వల్ల తన రచనల్లో అనేక సందర్భాల్లో అర్థాతిశాయిగా శబ్దప్రయోగం జరిగిందని తరువాతికాలంలో గ్రహించాడు. కొంతకాలం పాటు జేమ్స్ జాయిస్ (1882-1941), డైలాన్ థామస్‌లు (1914-1953) అతణ్ని మురిపించారు. తరువాత పి విలియమ్ ఆకర్షించాడు. జాన్ ఎడ్వర్డ్ మాన్‌ఫీల్డ్ (1878-1967) రాసిన 'ఎ కాన్‌సిక్రేషన్', (1902 నాటి) సాల్ట్ వాటర్ బలాడ్స్‌లో వాడిన నావికుల మాండలికం తనపై ప్రభావం చూపాయని తానే చెప్పుకొన్నాడు. విలియం సరోమాన్, ఫ్రాంజ్ కాఫ్కా, సాల్వదార్ తాల్స్, మార్తినీ, ఆనతోల్ బ్రెటన్, ఆంతోనీ ఛెహెూవ్, రసెల్ బేకర్, గ్రీకుకవి ఒదిస్యూస్ ఎమిన్, రష్యన్‌కవి వ్లాదిమర్ మయకోవిస్కీ (1893-1930)ల రచనలు కొన్నింటిని అనువదించాడు. ఎవరు ఎక్కడ ఎప్పుడు రాసిన కవిత్వమయినా సరే శ్రీశ్రీ కవితా దాహార్తిని పెంచేది. తనకు నచ్చిన ఏ కవితనయినా అనువదించటమనే 'ప్రయోగం' ద్వారా తన అభివ్యక్తి పద్ధతిని ఆవిష్కరించటానికి ప్రయత్నం చేశాడు

బి.ఏ. ప్యాసయి విశాఖపట్నానికి తిరిగి వచ్చిన శ్రీశ్రీ మరోసారి అబ్బూరి ప్రభావంలో తలమునకలై, తన గురువు ప్రపంచ అభ్యుదయ రచయితల సమాఖ్యకు శాఖగా స్థాపించిన వర్ధమాన లేఖక సంఘంలో చేరాడు. అప్పట్లో అతడు వెర్లయిన్ (1844-1896) ప్రతీక వాద పరిచయం సంపాదిస్తున్నాడు. రింబాంద్, మలార్మే (1842-1898) (సంగీత సాహిత్య సమ్మిశ్రణమయిన) బాదిలైర్ (1821-1867) సమన్వయాలు, ఫ్రాయిడ్ అధివాస్తవికత, త్రిస్తాన్ సారా ఆంద్రీబ్రెటన్ల డాడాయిజం, లూయీ అరగాన్ శైశవవాదం, స్వయంరచనా కళలను (automatic writing) అధ్యయనం చేస్తున్నాడు. పరిశుద్ధ కవితా కళలంటే ఏమిటో వెతుకులాడుతున్నాడు వచనంలో విమర్శనాత్మక వ్యాసరచన అభ్యసిస్తున్నాడు. గురజాడ కన్యాశుల్కంలోని స్త్రీ పాత్రలను గురించిన అలాంటి వ్యాసం 1932లో ప్రచురించాడు.

1938 మార్చిలో బరంపురంలో జరిగిన అఖిలాంధ్ర కవిపండిత సభకు హాజరయినప్పుడు సుప్రసిద్ధ కథానికా రచయితా నవలాకారుడూ అయిన చింతా దీక్షితులతో పరిచయం కలిగింది. అప్పటికే లబ్ధప్రతిష్ఠులైన కొందరు విద్వాంసులను అతడి కవిత

లాకర్షించాయి. 1934లో మండపాక పార్వతీశ్వరశాస్త్రి (1885-1940) ప్రశంసించటమే విద్వత్ప్రపంచం మొదటిసారి ప్రసాదించిన గుర్తింపు కావచ్చు బహుశా. తరువాతికాలంలో మహాప్రస్థానమనే గ్రంథరూపంలో ప్రచురించిన విడివిడి గేయాలను శ్రీశ్రీ మిత్రులవద్దా బహిరంగంగానూ చదివి తక్షణామోదం సంపాదించటం మొదలయింది. 1934 ఏప్రిల్ 12న కాకినాడలో జరిగిన యువజన సమావేశంలో మరో ప్రపంచ గీతం ఆలపించగా ప్రశంసల వర్షం కురిసింది. ప్రసిద్ధ నవలాకారుడూ, చిత్రకారుడూ, సంగీతవేత్తా అయిన అడివి బాపిరాజు (1899-1973) సమక్షంలో విశాఖపట్నం టర్నర్ సత్రంలో ఆ గేయాన్ని చదివి వినిపించిన తరువాత ముద్దుకృష్ణ (1899-1973) 1935 జనవరి 16న వెలువడ్డ తన పత్రిక జ్వాల సంచికలో దాన్ని ప్రచురించాడు. శ్రీశ్రీ చేదుపాటను జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి ఆలపించగా విన్న గుడిపాటి వెంకటచలం (1894-1979) చలించి కన్నీరు కార్చాడు. తన అభిమాని అయిన శ్రీశ్రీ గేయాలను మెచ్చుకొని బహిరంగ సమయాల్లో దేవులపల్లి కృష్ణశాస్త్రి తానూ పాడటం మొదలుపెట్టాడు. అతడి సుప్తాస్థికలనూ మహాప్రస్థాన గేయాన్నీ 1934 ఏప్రిల్‌లో తక్షణం తిప్పిపంపిన భారతి పత్రికే అంతకు ఒక నెలరోజుల ముందు శ్రీశ్రీ వ్యావహారిక వచన కవితను ప్రచురించింది. ఇలా తనను ప్రభావితుణ్ని చేసిన వారిని కూడా శ్రీశ్రీ ప్రభావితులను చేయటం మొదలయింది. దేవులపల్లి రచనలు కొన్ని శ్రీశ్రీ పీఠికలతో కూడా వెలువడ్డాయి. కాకినాడ, మచిలీపట్నం, విజయవాడల్లో జరిగిన నవ్య సాహిత్య పరిషత్సమావేశాల్లో అతడికి యువకుల్లో అగ్రపీఠం లభించింది. ఇవన్నీ అతడి ఆత్మ విశ్వాసాన్ని పెంచటంతో ఆగలేదు. పురిపండా గుర్తుచేసినట్లు అతడి అహంకారం పెరిగి చాటుమాటుగానైనా భవిష్యదాంధ్ర కవితా ధోరణులకు తానే నాయకత్వం వహించి శాసిస్తాననే వరకూ వచ్చింది 1940 నాటికి సంప్రదాయ పత్రిక కృష్ణాపత్రిక కూడా సమకాలిక మహాకవుల్లో అతణ్నీ చేర్చవలసి వచ్చింది. ప్రతిభ సంపాదక మండలిలో 1940లో సభ్యుడై సాహితీ ప్రపంచంలో శ్రీనివాసరావుగాకాక శ్రీశ్రీగా పునర్జన్మించాడు

1938-1944 మధ్యకాలంలో అతడు మదరాసులోనూ ఇతరత్రా రకరకాల ఉద్యోగాలు చేశాడు కవిగా తనకు లభ్యమవుతున్న ప్రతిష్ఠగాని, ఆకలి బాధల్లో ఉండటంగాని శ్రీశ్రీ విస్తృత పఠన వ్యాసంగాన్ని ఆపలేదు. 1944లో విశాఖపట్నానికి తిరిగి వచ్చిన తరువాత అబ్బూరి తెలుగు నాటక రంగానికి ప్రచారం కలిగించాలని స్థాపించిన నటాలిలో స్క్రిప్ట్ రచయితగా చేరాడు. అప్పుడప్పుడు చిన్న చిన్న వేషాలు కూడా కట్టూ దాదాపు ఒక సంవత్సరకాలం అతడు నాటక సంఘంతోబాటు పర్యటించాడు. తన బంధువు నారాయణబాబును, అబ్బూరి రామకృష్ణరావు కుమారుడు వరదరాజేశ్వరరావునూ కలుపుకొని చెహొవ్ రాసిన 'చెర్రీ ఆర్చిడ్'ను అనువదించడమో, అనుకరించటమో చేయమన్నారు. 'సంపంగి తోట' అనే పేరిట ఆ పని నెరవేర్చాడు. ఈ

కలిసి కట్టు ప్రయత్నం అనవసర వివాదానికి దారితీసింది. అబ్బూరి రామకృష్ణరావు నారాయణబాబు అనువాదం 'శ్రాద్ధయోగ్యంగా ఉం'దని తిప్పి కొట్టాడు ఫలితంలో అది అన్నదమ్ముల మధ్య మనస్తాపానికి దారితీసింది అ పుండు వారి జీవితాంతం మానలేదు 1945లో మరోసారి మదరాసు చేరుకొని సినిమారంగంలో ప్రవేశించినా, ప్రపంచ సాహిత్యాధ్యయనం మానలేదు; తనకు నచ్చిన వాటిని అనుకరించటం మాననూ లేదు. 1946, 1949ల మధ్య మూడేళ్లపాటు ఆనందవాణి అనే సాహితీ పత్రికకు సంపాదకుడుగా పనిచేశాడు. 1947 ప్రాంతాల నుంచి కమ్యూనిస్టు ఉద్యమాలలో క్రియాశీల పాత్ర వహిస్తూ బహిరంగోపన్యాసాలు చేయటం మొదలేశాడు. ఇంగ్లీషు నుంచి తెలుగులోకేకాక ఇటునుంచి అటు కూడా అనువదించటం ఆరంభించాడు. పురిపండా కవితను ఇంగ్లీషులోకి అనువాదం చేశాడు తన తరానికి చెందిన పరాభి (జననం 1919), ఆరుద్ర (1928-1998), కాళోజీ నారాయణరావు (జననం 1914), కె వి. రమణారెడ్డి (1928-1998) కవితలకేగాక, తరువాతి తరానికి చెందిన రావిశాస్త్రి (రాచకొండ విశ్వనాథశాస్త్రి (1922-1993), శేషేంద్రశర్మ (జననం 1927), గజ్జెల మల్లారెడ్డి (1922-1997) మొదలైనవారి రచనలకూ్కడా పరిచయ వాక్యాలూ పీఠికలూ రాస్తుండేవాడు.

యువతరం మీద శ్రీశ్రీ ప్రభావం స్పష్టరూపం ధరించింది. హైదరాబాదు నిజాం అశిక్షితసేనలూ రజాకార్లూ తెలంగాణా ప్రజలమీద నడిపిన కిరాతక చర్యలనూ, భారత కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర మహాసభలు ప్రతీకారంగా లేవదీసిన సాయుధ సమరాన్నీ సమర్థిస్తూ అతడొక్క అక్షరమైనా రాయకుండా మౌనం పాటించాడు. కానీ పీడిత ప్రజలమీద సానుభూతితో నిజాం రాక్షసచర్యలను కవితారూపంలో ఖండించిన వారిని మాత్రం ప్రోత్సహించాడు ఇంతకుముందే ప్రస్తావించినట్లు శ్రీశ్రీ 1946లో నిజాం రిఫాం సెక్రటేరియట్లో కొలువు చేశాడు. అప్పుడు కూడా అంత గొప్పవి కాని రచనలేవో చేస్తూనే ఉండేవాడు - సిరిసిరి మువ్వా శతకం వంటివి కమ్యూనిస్టులతో బహిరంగ స్నేహం వెలగబెట్టున్నా, మహాప్రస్థాన గేయాల్లో మార్క్స్ సిద్ధాంతాలను ప్రశంసించినా ప్రచారం చేసినా, సాధారణ పౌరుల భయంకర బాధలకతడు ప్రతిస్పందించనేలేదు! తరువాతి కాలంలో నిరంకుశ రాక్షస ప్రభుత్వానికి కుమ్మక్కుగా ఉన్నందుకు అన్ని వామపక్షాలవారూ అతణ్ణి అభిశంసించారు అయితే అతడెన్నడూ తానెందుకు చలించలేదో ఎందుకు ప్రతిక్రియకు తలపడలేదో ఎందువల్ల తాను మౌనవ్రతం పాటించాడో చెప్పనేలేదు. ఉలకలేదు, పలకలేదు. బాధిత ప్రజల ప్రయోజనం కోసం నిజాం వ్యతిరేక, రజాకార్ వ్యతిరేక ఉద్యమాలను వ్యతిరేకిస్తూ ఎన్ని ప్రలోభాలు వచ్చినా అతడొక్క అక్షరమైనా రాయనని ప్రతిజ్ఞ చేశాడని చెప్పే త్రిపురనేని మహారథివంటివారు ఇంకా ఉన్నారు. జీవనోపాధికోసం, సాగినంతకాలం నడుస్తుందన్న నమ్మకంలో అతడు నిజాం కొలువు

తాత్కాలికమైన ఉపాధి సౌకర్యంగా పరిగణించాడేమో చెప్పలేం. కానీ దరిద్ర ప్రజల దౌర్భాగ్యాలకు చలించని అతడి మౌనం దౌర్జన్యాన్ని సహించే అర్ధాంగీకారంలాంటిది. బహుశా తనమీద కలిగిన ఈ అసహ్యభావాన్ని నీరుగార్చటం కోసమేమో ప్రతీకాత్మకంగా తన మేనల్లుడు భాగవతుల శంకరశాస్త్రి (అంటే ఆరుద్ర) రాసిన 'త్వమేవాహ'మనే కవితకు పరిచయం రాశాడు. తెలంగాణా పోరాటాన్ని వర్ణించే రచనకు అతిశయోక్తులతో మెప్పులందించాడు. స్వతంత్రలో ఆ గేయ కావ్యాన్ని ప్రశంసిస్తూ సుదీర్ఘవ్యాసం ప్రచురించాడు. తనకు సంపూర్ణ సంతృప్తి కలిగిస్తూ తనకన్నా బాగా ఆరుద్ర రాసిన తరువాత తానదే ఇతివృత్తంతో కవిత వెలయించటం అనవసరమనిపించిందని సమర్థించుకున్నాడు

మచిలీపట్నం వాస్తవ్యుడయిన నళినీకుమార్ (అసలు పేరు వుండవల్లి సూర్యనారాయణ) ఆర్థిక సహాయంతో ఎట్టకేలకు 1950లో మహాప్రస్థాన గేయాలు ఒక సంపుటిగా వెలుగు చూశాయి. నేను ప్రచురిస్తానని బహిరంగ ప్రకటన చేసిన విశ్వనాథ అలా చేయలేదుగాని, చలం మాత్రం తన మాట నిలబెట్టుకొని కావ్యాన్ని పరిచయం చేస్తూ యోగ్యతాపత్రమిచ్చాడు. అప్పటికే శ్రీశ్రీ సినీరంగ ప్రవేశం చేసి సొమ్ము గడిస్తున్నాడు. అవిభక్త మదరాసు రాష్ట్ర శాసనమండలిలో సభ్యుడైనాడు. అయితే ఇటువంటి వ్యాపకాలేవీ అతడి జంట అలవాట్లను తొలగించలేదు - అవేమంటే ప్రపంచం నాలుగుమూలల్లో ఎక్కడ వెలసిన సాహిత్యాన్నయినా చదవటం, తనకు నచ్చిన వాటిని తెలుగులోకి అనువదించటం. 1953లో సామాజిక రాజకీయ వ్యవహారాలను వెక్కిరిస్తూ కార్టూన్ కవితలు రాయటం మొదలుపెట్టాడు. 1952లోనే అమ్మ అనే పేరుతో కార్ల్ చేపెక్ రాసిన మదర్ అనే నాటకాన్ని తెలుగులో పెట్టాడు. అప్పుడప్పుడు అబ్బూరి వరదరాజేశ్వరరావు, ఆరుద్రలతో కలిసి సీదాసాదా పద్యాలు రాసి ఆనందించేవాడు. తన కవితలు కొన్నిటిని ఇంగ్లీషులోకి సొంతంగా తర్జుమా చేశాడు. తెలుగులో మొదటిసారిగా చేతనా స్రవంతి విధానంలో రేడియో నాటకాలూ కథానికలూ రాస్తుండేవాడు. ఒక దశాబ్దంపాటు అధివాస్తవిక ధోరణి అతడి ద్వితీయప్రవృత్తి అయింది. అందుకు యూరోపియన్ల కవితల ప్రభావం కారణం. దిగంబర కవిత్వాన్ని ఇంగ్లీషులోకి పరివర్తించటానికి స్వచ్ఛందంగా అంగీకరించాడు. క్రమంగా పాత కమ్యూనిస్టు విధానాలనుంచి నక్సల్‌బరీ పోకడలవైపు మొగ్గటం మొదలుపెట్టాడు. విప్లవ రచయితల సంఘానికి సంస్థాపకాధ్యక్షుడైనాడు. అయినప్పటికీ 1971లో మయకొవిస్కీ లెనిన్‌మీద రాసిన కవితను ఆంధ్రీకరించాడు. అదే సంవత్సరం రెక్కవిప్పిన రివల్యూషన్ అనే శీర్షికతో ఆంజెలో కత్రోచీ వచన కవిత -'బిగెనింగ్ ఆఫ్ ద ఎండ్'ను - తెలుగుచేశాడు. లండన్లో ఉన్నప్పుడు కొన్ని స్వీయ కవితలను ఆంగ్లీకరించాడు.

సాహితీ ప్రపంచంలో ఎక్కడ ఏం జరుగుతున్నదో తెలుసుకోవాలనీ, ఏ సాహితీరూపం ఎలాటిదో చదివి స్పందించాలనీ, తనకు నచ్చినపుడు వాటిని అనువదించటమో, పునఃసృష్టి చేయటమో, అనుకరించటమో మంచి పద్ధతి అనీ భావించిన ప్రతిష్ఠావంతులైన తెలుగు కవుల్లో శ్రీశ్రీ బహుశా ఏకైక వ్యక్తి అనిపిస్తుంది. ఇంగ్లీషు నేర్చిన సాహితీపరులందరికీ తెలుగు సాహిత్యాన్ని గురించిన విశేషాలు అందుబాటులో ఉండాలని అతడి వాంఛ. మొదట సంప్రదాయ కవిత, తరువాత ఆధునిక కవితా ధోరణుల, ఆమీదట ప్రతీకాత్మక ప్రాయోగిక కవితా రూపాలూ ప్రభావితం చేసినమీదట, అతడీ కఠోరమార్గంలో ఆత్మ సాక్షాత్కారం పొందాడు. అతడు ప్రసిద్ధి కెక్కగానే తరువాతి తరం రచయితలకూ కొన్ని సందర్భాల్లో తన పూర్వ విరోధుల క్కూడా అతని సాహితీరూపం, అభివ్యక్తీ నమూనాలైనాయి. అతడే సాహితీ రూపాన్ని చేపట్టినా కవితాదర్శ నిర్దేశకుడయినాడు.

# మూడో ప్రకరణం

## పూర్వరంగ, సమకాలిక పరిస్థితులు

శ్రీశ్రీమీద ప్రసరించి ఈ శతాబ్దిలో ఒక మహాకవిగా అతణ్ని తీర్చిదిద్దిన ప్రభావాలను సముచిత మార్గంలో గ్రహించాలంటే అతడి జన్మ సమయంలో బాల్యంలో ఆంధ్రలో ఉన్న సాహిత్య సాంఘికార్థిక పరిస్థితులను పరిశీలించటం మంచిది. అత్యధిక సంఖ్యాకులైన కవులూ రచయితలూ తమ కార్యకలాపాలను సంప్రదాయ పద్ధతులకు పరిమితం చేసుకోగా, సాహిత్య ప్రపంచంలో లభ్యమయ్యే, తనకు ఊపిరిపోసే విషయాలను అవగతం చేసుకోవాలని తపించిన వారిలో శ్రీశ్రీ అగ్రగణ్యుడు. పరిగ్రాహ్య యోగ్య విషయాలన్నిటినీ అతడు జీర్ణం చేసుకోవాలని ప్రయత్నించాడు. తన భావాలనూ, అనుభవాలనూ తరువాతి తరంలోని అనేకానేక యువ రచయితలు మరోవిధంగా ఉత్తమ సాహిత్యాన్ని అందించటం సాధ్యంకాదని విశ్వసించేంత శక్తిమంతంగా చైతన్యవంతంగా వ్యక్తీకరించాడు ప్రస్తుతం తెలుగు సాహిత్య చరిత్రలో తనకున్న స్థానాన్ని చేరుకోవటంలో అతడి కుటుంబ లక్షణాలూ అతడి చుట్టూ ఉన్న సాహితీమూర్తులూ అతడి సొంత అభిరుచి శిక్షణలూ తోడ్పడ్డాయి.

ప్రధానంగా కందుకూరి వీరేశలింగం (1847-1919) సాహితీ సామాజిక రంగాల్లో సంస్కర్తగా అవతరించిన నేపథ్యంలో ఈ శతాబ్దారంభ కాలంలో తెలుగు సాహిత్యరంగం కలవరపాటుకు గురయింది. ఆకాలంలో మొత్తం భారతదేశాన్ని పాశ్చాత్య భావనలూ సాహిత్యమూ శాస్త్ర విజ్ఞానాభివృద్ధీ ఆవరించాయి. తెలుగు పరిస్థితి అందుకు అపవాదం కాదు. బిషప్ రాబర్ట్ కాల్డ్‌వెల్ రచించిన ద్రవిడ భాషా తులనాత్మక వ్యాకరణం (1855-56), ఛార్లెస్ ఫిలిప్ బ్రౌన్ ప్రచురించిన తెలుగు - ఇంగ్లీషు నిఘంటువు (1852), 1857లో స్థాపితమైన మదరాసు విశ్వవిద్యాలయంవారి పాఠ్య ప్రణాళికా విద్యా విధానాలూ ఆనాటి విద్యార్థులనూ, విద్వాంసులనూ భాషా సాహిత్యరంగాలు రెంటిలోనూ పరివ్యాప్త ప్రభావానికి గురిచేశాయి. తెలుగు సాహిత్య చరిత్రలో కందుకూరి కొత్తపుంతలు తొక్కాడు అనేక సాహితీ ప్రక్రియలను సృష్టించి, అనువదించి పరిచయం చేశాడు తన సంఘ పరిష్కరణ భావాలనూ ముఖ్యంగా స్త్రీ విద్యావసరాన్నీ ప్రచారం చేయటానికీ రకరకాల వచన సాహితీ రూపాలను కల్పించాడు. తన కార్యక్రమాలకు ఉపయోగపడేట్లు పదజాలాన్ని సులభీకరించాడు. భాషాశైలులను సరళతరం చేశాడు. ఆయన విధానాలను

సంప్రదాయవాదులూ సాహితీపరులూ ప్రతిఘటించారు. అయితే ఈ శతాబ్ది ఆరంభానికి ముందే అనేక సాహితీ ధర్మాలకూ సాంఘిక రాజకీయోద్యమాలకూ సంబంధించి అనేక వాదోపవాదాలు చెలరేగిన మాట వాస్తవం

వేదం వేంకటరాయశాస్త్రి (1853-1929) హర్షుడి నాగానంద నాటకాన్ని 1875లో తెలుగు చేసినప్పుడు అందులోని నీచపాత్రలకు గ్రాంథికేతర భాషలో సంభాషణలు రాసి, అది సంస్కృత రూపకాల్లో ప్రాకృతం వాడే సంప్రదాయం వంటి దన్నప్పుడు సాహితీవర్గాల్లో గందరగోళం పుట్టింది సంప్రదాయవాదులు చాలామంది ఇదంతా గ్రామ్యఘోష అని, పతనానికి దారితీస్తుందని నిందించారు. అంతకుముందే తాను రాసిన ప్రహసనాల్లో అటువంటి భాషారూపాలనే కందుకూరి ప్రయోగించినపుడు అంత వ్యతిరేకత రాలేదు. తమ నాయకుడైన వేదం గ్రామ్య రచయితల్లో కలిసిపోవటం పెద్ద నేరమనుకున్నారు. క్షమార్హం కాదని భావించారు. దాదాపు పన్నెండు సంవత్సరాల తరువాత గురజాడ వేంకట అప్పారావు (1861-1915) తన కన్యాశుల్కం రచన అంతటిలోనూ 1897లో అన్ని సంభాషణలనూ మాండలికభాషలోనే రాసినప్పుడు పెద్దయెత్తున గోల పుట్టింది. ఆ నాటకం బాల్య వివాహాలవంటి సంఘ దురాచారాలను ఖండిస్తూ స్వభావంలో, భాషలో, వస్తువులో, పాత్రచిత్రణలో, అభివ్యక్తి వగైరాల్లో పూర్తిగా సంప్రదాయ వ్యతిరేకధోరణిలో సాగింది. 1909లో వచ్చిన పరిష్కృత రూపం సాహితీ స్వరూపాన్ని మార్చివేసింది. ఆ సంవత్సరం అనేక విధాల సాహితీ చరిత్రలో - ప్రధానంగా కవితా విషయంలో - ప్రముఖమయింది. గురజాడ రాసిన నీలగిరి పాటలు, సృష్టించిన నూతన ఛ్చందస్సు ముత్యాల సరాలూ భాషలో, ఛందస్సులో, వస్తువులో సంప్రదాయ సాహిత్యంతో ఏ విషయంలోనూ సమానం కాదు. అంతకుముందు 1900లో కట్టమంచి రామలింగారెడ్డి (1880-1951) ముసలమ్మ మరణం సంప్రదాయ ఛ్చందస్సులోనే ఉన్నా జానపద నేపథ్యంలో విదేశీయమైన ఉత్ప్రేక్షలతో దుఃఖాంత రచనగా ఆనాటిదాకా వచ్చిన ఇతర తెలుగు రచనలతో పోలిస్తే విభేదించింది. ఆ యేడే రాయప్రోలు సుబ్బారావు (1892-1984) స్త్రీలనూ ప్రేమనూ గురించి సాంప్రదాయిక సంప్రదాయేతర భావనలతో సాంప్రదాయిక ఛ్చందస్సుల్లో రాసిన లలిత అనే పద్యకావ్యం చాలా తొందరగా ప్రసిద్ధి సంపాదించింది. చాలాకాలం దాకా రాయప్రోలు గురజాడల్లో నవ్య సాహితీ నిర్మాత ఎవరనేది వివాదాస్పదంగా ఉండేది. రాయప్రోలు నవయుగ ప్రవర్తకుడైనా కాకపోయినా, ఆయన భావకవితా మార్గానికి ఆద్యుడే ఆ సంవత్సరమే అబ్బూరి జలాంజలి కూడా ప్రచురితమయిందిగానీ సాహితీ ప్రపంచంమీద అప్పట్లో దాని ప్రభావం ప్రసరించలేదు. రాయప్రోలు కవితా ప్రక్రియ భావ కవిత్వమనే పేరున సంప్రదాయంమీద అంతో ఇంతో శ్రద్ధా గౌరవాలున్న ఆనాటి యువకవులనాకర్షించింది. దాదాపు 1935 దాకా ఆ ప్రక్రియ తిరుగులేని గౌరవం సంపాదించింది. ఆ పద్ధతిలో విశ్వనాథ సత్యనారాయణ

(1895-1976), దేవులపల్లి కృష్ణశాస్త్రి (1897-1980) వంటి ఉత్తమకవులు పేరుమోశారు. యువకుడైన శ్రీనివాసరావుమీద ఈ ఇద్దరి ప్రభావమూ ప్రగాఢంగా ఉండి, తన సొంత గొంతుకను కనుక్కోవడానికి అతడికి దశాబ్ది కాలం కావలసి వచ్చింది.

ఇంచుమించు శ్రీశ్రీ జన్మసమయం నాటికి ఆంధ్రలోని భాషారంగంకూడా వివాదమయంగా ఉండేది. సమకాలిక రచయితల్లో అత్యధిక సంఖ్యాకులు చిన్నయసూరి (1809-1862) వ్యాకరణానుశాసనాలకు తలఒగ్గి రచిస్తుండగా, గురజాడ వాడుక భాషలో మాండలిక విభేదాలతో గ్రంథ రచన చేశాడు సంప్రదాయ వాదులతని భాష గ్రామ్యమని నిందించారు. గురజాడ మిత్రుడూ ఈ శతాబ్ది భాషావేత్తల్లో సర్వ ప్రథముడూ అయిన గిడుగు వేంకట రామమూర్తి (1862-1940) అది గ్రామ్యం కాదనీ, వర్తమానాంధ్ర భాషారూపమనీ, అన్నిరకాల సాహిత్య వ్యాసంగాల్లోనూ విద్యాబోధనలోనూ ఆ భాషారూపాన్నే వాడాలనీ వాదించాడు. ఆనాటి గ్రంధకర్తల్లో ఇంచుమించు ప్రతి ఒక్కరూ చిన్నయసూరి వ్యాకరణసూత్రాలకు విరుద్ధమైన ప్రయోగాలే చేశారని ఒక్కొక్కరి భాషాదోషాలనూ వ్యాకరణ విరుద్ధ ప్రయోగాలనూ ఎత్తి చూపాడు. అప్పటి బ్రిటిష్ ప్రభుత్వ విద్యాశాఖాధికారులూ విశాఖపట్నంలోని అలనాటి మిసెస్ ఎ.వి.ఎన్ కళాశాల ప్రధానాచార్యుడైన పి.టి శ్రీనివాస అయ్యంగారూ ఆయన వాదాలను సమర్థించారు శ్రీశ్రీ ఆ కళాశాల విద్యార్థిగా ఉండేవాడు. కందుకూరి వీరేశలింగం, వేదం వేంకటరాయశాస్త్రి, తదితర సంప్రదాయవాదులూ గిడుగు వాదాన్ని వ్యతిరేకించారు. బెంగాల్లోని చలిత్ భాషోద్యమంతోనూ నార్వేలోని రిక్స్‌మల్, ల్యాండ్‌మల్ వివాదాలతోనూ గిడుగువాదానికి పోలికలున్నాయి. 1911 నాటికి విద్యాబోధన పరీక్షలు వర్తమాన భాషలో ఉండాలనే గిడుగు వాదనను ప్రభుత్వమంగీకరించింది. ఇందుకు విరుద్ధంగా తీవ్ర ప్రతిఘటన రాష్ట్రవ్యాప్తంగా రాగా, 1914లో ప్రభుత్వం తన ఉత్తర్వులను ఉపసంహరించుకుంది. ఈ భాషా వివాదంలో వేలసంఖ్యలో సాహితీపరులు పాల్గొని వాదప్రతివాదాలు చేసి చివరికి అన్యోన్యం వ్యక్తి దూషణలు కూడా చేసుకొని ఒక మహోద్యమ రూపంలో సంఘర్షించారు. పత్రికల్లో అసంఖ్యాకంగా వ్యాసాలు వెలువడ్డాయి. వేలసంఖ్యలో కరపత్రాలు విడుదలైనాయి. విద్యాస్పర్ధతో రచయితలు అనేక సాహితీ రూపాలను ప్రచురించారు. ఈ భాషా వివాదం పుట్టినప్పుడే శ్రీశ్రీ కూడా పుట్టాడు. తన చుట్టూ ఉన్న ప్రపంచం భాషా సాహిత్య రాజకీయ విభేదాలలో అట్టుడికినట్లుడుకుతున్న సమయంలో అతడి బాల్యమూ విద్యాభ్యాసమూ గడిచాయి. తన ప్రిన్సిపాల్, అభిమాని పురిపండా అప్పలస్వామీ, తాను పెద్దగా గౌరవించిన సెట్టి లక్ష్మీ నరసింహమూ (1879-1941) తదితరులూ ఈ ఆధునిక భాషాసాహిత్య వాదాలకు సమర్థకులు. అతడి చిననాటి లేతమనస్సుమీద వీరి ప్రభావం చెరగని ముద్రవేసి జీవితాంతం కొనసాగింది

శ్రీశ్రీ కళాశాలా విద్యార్థిగా కనిపించిన ప్రతి పుస్తకాన్నీ చదివిగాని వదిలిపెట్టని మనస్థితిలో ఉన్నప్పుడు సాహితీరంగంమీద ఇద్దరు ముగ్గురు ప్రముఖ రచయితలు ప్రకాశించారు. నండూరి సుబ్బారావు (1895-1958) అనే వకీలు యెంకి పాటలనే పేరున జానపద గెయసాహిత్యం సృష్టించాడు సంప్రదాయేతరచ్ఛందస్సులో జానపదుల శృంగార భావాలను వారి భాషలోనే వ్యక్తీకరించటం కవితాలక్షణాలకు పతనావస్థేనని సాంప్రదాయిక ప్రపంచం గర్జించింది. 1922లో సుప్రసిద్ధ జాతీయవాది ఉన్నవ లక్ష్మీనారాయణ (1873-1958) బ్రిటిష్‌వారి జైళ్లలో మగ్గుతూనే ''మాలపల్లి / సంగవిజయం'' అనే పెద్ద నవలను ప్రచురించాడు. ప్రభుత్వం ఆ గ్రంథాన్ని తక్షణమే నిషేధించింది. బ్రిటిష్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా తీరాంధ్ర దేశంలో అల్లూరి సీతారామరాజు సాగించిన సాయుధ సమరమూ, దూరతీరాల్లోని మలబారులో మాప్లాలు లేవదీసిన తిరుగుబాటూ ఈ నవల వల్లనే సంభవించాయని ప్రభుత్వం ఆరోపించింది! (నిజానికి ఆ రెండు ఉద్యమాలూ ఈ నవలా రచనకు ముందే వచ్చి మూగపోయినవి). నవలలోని భాష ఆధునిక వ్యావహారికం. కధావస్తువు బ్రిటిష్ పరిపాలనలో గ్రామీణార్థిక వ్యవస్థ ఎంతగా ధ్వంసమయిపోయిందో కళ్ళకు కట్టినట్లు చేసిన వర్ణన. గ్రంధ రచనకు ప్రోద్బలమిచ్చింది గాంధేయవాదం అయినా గ్రంథాంతంలో అవసరమైతే మార్క్సిస్టు విప్లవ మార్గాన్నయినా స్వీకరిస్తామనే ప్రసంగముంది! అనేకమంది సాహితీప్రియులకు ఏదో విధంగా గ్రంధ సందేశమంది వుంటుందనే విశ్వాసమే దాన్ని నిషేధించటానికి ప్రచండ సాక్ష్యం. మూడో రచయిత ప్రమాదకారిగా అవతరించి సాధువుగా అస్తమించినవాడు. ఆయన పేరు గుడిపాటి వేంకటచలం (1894-1979). అతడు తన రచనల్లో ప్రతిపాదించిన స్త్రీ స్వేచ్ఛ, భారతీయ వనితలకు అవసరమని వాదించిన స్వేచ్ఛా శృంగారమనే భావనలు అంతకుముందు కందుకూరి చేసిన వాదనలతో పోలిస్తే విప్లవాత్మకాలు. తరువాతికాలంలో శ్రీశ్రీ కవిత సాహిత్య చరిత్ర స్వరూప స్వభావాలను మార్చిందని అతడు యోగ్యతాపత్రమిచ్చాడు. అతడు 1924నుంచీ నవలలూ తదితర సాహితీ ప్రక్రియలనూ రచించిన ఉత్తమ వచన గ్రంథ నిర్మాత. అతడు సమాజ రుగ్మతలను గురించి విప్లవాత్మక ధోరణిలో రాసిన గ్రంథాలను ప్రచురించటానికిక్కూడా ఎవరూ సిద్ధపడలేదు. చిట్టచివరకు 1949లో సొంత ముద్రణాలయం ఏర్పాటు చేసుకొనేదాకా అతడు తన గ్రంథాలను ప్రచురించలేకపోయాడు! భాషా సాహిత్య వివాదాలూ ఉద్యమాలూ రకరకాల సంస్థల స్థాపనకు దారితీశాయి. కాకినాడలో 1911లో వెలసిన ఆంధ్ర సాహిత్య పరిషత్తు సంప్రదాయ ప్రయోజన పరిరక్షణార్థమేర్పడింది. భావ కవితా మార్గమనుసరించదలచిన యువకవులు 1919లో తెనాలిలో సాహితీ సమితి అనే పోటీ సంస్థను నెలకొల్పుకున్నారు. తరువాతి కాలంలో శ్రీశ్రీ ఇందులో చేరాడు విశాఖపట్నంలో ఒక కవితా సమితి 1926లో వెలిసింది. వెంటనే శ్రీశ్రీ అందులో సభ్యుడయినాడు. 1933లో బరంపురంలో

నవ్యసాహిత్య పరిషత్తనే మరోసంస్థ ఉద్భవించింది శ్రీశ్రీ అందులో క్రియాశీల సభ్యత్వం పొందాడు. ఈ సంస్థ ప్రతిభ అనే సాహితీ పత్రికను వెలువరించింది. దాని సంపాదకవర్గంలో శ్రీశ్రీ ఒకడైనాడు భావనలో, అభివ్యక్తిలో, ఉద్యమస్వభావంలో ఎక్కడ ఏపాటి ఆధునికత్వమున్నదనుకొన్నా శ్రీశ్రీ తన అనుబంధాన్ని పెంచుకొనేవాడు.

ఒకవైపున భావకవిత్వం రాజ్యం చేస్తుండగా సాహిత్య వివాదాలు కొద్దిపాటి అలజడి పుట్టిస్తుండేవి. అదే సమయంలో అవధాన ప్రదర్శనలూ, ఆశుకవితా ప్రసంగాలూ సాహితీపరుల దృష్టిలో ఆమోద యోగ్యమైన కసరత్తులనిపిస్తుండేవి. దివాకర్ల తిరుపతిశాస్త్రి (1872-1919), తరువాతి కాలంలో అవిభక్త మదరాసు రాష్ట్ర ప్రభుత్వానికి ఆస్థానకవి అయిన చెళ్లపిళ్ల వేంకటశాస్త్రి (1870-1950) కలిసి జంట కవులుగా ధారాశుద్ధినీ, ధారణశక్తినీ ప్రదర్శిస్తూ చేసిన అవధానాలు జనాకర్షకాలయినాయి సంప్రదాయచ్ఛందో రచనలో వారికున్న అధికారం, వారి పాండిత్య వైభవం వేలసంఖ్యలో యువకవులను ఆకర్షించాయిగానీ, శ్రీశ్రీ అవధాన విద్యా ప్రదర్శనలకు దూరంగానే ఉన్నాడు విశ్వనాథ తిరుపతి వేంకట కవుల శిష్యుడయినా అతడి బహుముఖీన ప్రజ్ఞా పాటవాలు కొంతకాలంపాటు ఆధునిక పద్యవచన రచనా ధోరణులవైపు తిరిగినా, సంప్రదాయ సమర్థనలోనే స్థిరపడ్డాయి. అక్కిరాజు ఉమాకాంతం వంటి (1882-1942) మహా విద్వాంసుడు నేటికాలపు కవిత్వమనే తన విమర్శ గ్రంథంలో భావకవులపై చేసిన ఎదురుదాడికి తట్టుకొని దేవులపల్లి బతకగలిగాడు.

సాంస్కృతిక సంప్రదాయాలను ప్రామాణికంగా స్వీకరించి సమకాలిక రచయితలనూ రచనలనూ ఉమాకాంతం నిర్ధూమధామంగా ఖండించగా, అంతకుముందే తన కవిత్వ తత్త్వ విచారంలో పాశ్చాత్య విమర్శ పద్ధతులు ప్రామాణికాలని కట్టమంచి రామలింగారెడ్డి అదేపని చేశాడు. ఈ రెండు గ్రంథాలూ మొత్తంమీద అనేక సాహితీపరుల కళ్లు తెరిపించాయి; వారిలో ఆత్మవిమర్శకు ఎన్నో అవకాశాలు కల్పించాయి. సంక్షిప్తంగా చెప్పాలంటే ఈ శతాబ్దారంభ సమయంనుంచి 1930 దాకా సాహితీ ప్రపంచం ప్రాచ్యపాశ్చాత్య ప్రభావ వైరుధ్యాల మధ్య డోలాయమానస్థితిలో ఉండేది. ఆ సంధికాలం లోనే శ్రీ శ్రీ రచయితగా మొగ్గ తొడిగాడు.

స్వాతంత్ర్య సమరం, సంఘ సంస్కరణ అనే రెంటి కారణంగా సామాజిక రాజకీయ పరిస్థితులు కూడా కల్లోలితమవుతూనే ఉన్నాయి. గాంధీ అహింసా సిద్ధాంతం ప్రభావంలో ఉన్న కొందరు తెలుగు కవులు తమ సమాజంమీద బౌద్ధమత ప్రభావాన్ని స్మరించటం మొదలుపెట్టారు బుద్ధుణ్నీ, బౌద్ధ ధర్మాలనూ ఆదర్శంగా స్వీకరించి ఎన్నో కవితలు, రూపకాలు, నవలలు, చివరకు విమర్శనాత్మక వ్యాసాలుకూడా అసంఖ్యాకంగా వచ్చాయి.

స్వాతంత్ర్య సమరానికి ఆకర్షితులైన మరికొందరు భారతీయుల పురాతన వైభవాన్ని నిరపేక్ష ప్రశస్తులతో ముంచెత్తుతూ చారిత్రక నవలలు మొదలయిన వాటిని సృష్టించారు. బెంగాలునుంచి దిగుమతి అయిన 'భరతమాత' అనే భావన ఆంధ్రమాతగా కూడా పరివర్తించి తెలుగు భాషకూ, ప్రజలకూ సంబంధించిన ఏ విషయమైనా మహిమాన్వితమనే ఆరాధన పద్ధతికి దారితీసింది. దేశభక్తి కవిత సర్వజనాభిమాన పాత్రమయింది. (ప్రేమ, వియోగం, శృంగారం వంటి తమ తీవ్ర వాంఛలకు కాస్సేపు ఆటవిడుపుగా కావచ్చు) భావకవులు కూడా దేశభక్తి కవితలు వెలయించారు శక్తివంచన లేకుండా. ఈ కవితలు రాజకీయంగా ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కావాలనే ఉద్యమానికి ఊపిరిపోశాయి. రాజకీయోద్యమాలు తాత్కాలికంగానైనా సరే కొందరు రచయితలు తమ తమ దృష్టులను తమ సామాజికాభివృద్ధివైపు మళ్లించేట్లు చేయగలిగాయి. ప్రతికులం, వర్గం, వృత్తి తన గతచరిత్రను తవ్వి, గత వైభవాలను పునరుద్ధరించాలనీ ఇతరులతో పోలిస్తే తమ ఆధిక్యం, ప్రాముఖ్యం గొప్పవనీ ప్రచారం చేసుకోవటం మొదలయింది. ఈ కారణంగా అనేక కుల సంఘాలేర్పడి తమకు ప్రత్యేకమైన సాహిత్యాన్ని పట్టుదలతో సృష్టించటం ఆరంభించాయి. తమ పురాతన వైభవాన్ని నిరూపించే ప్రయత్నంలో నిమగ్నమై ప్రజలు తమ ఆర్థిక దుస్థితిని స్మృతి పథంలోకి రానీలేదు కొంతకాలం కానీ ఆ విషయం గుర్తుకురాగానే వర్గాలుగా చీలిన ప్రజలు తమ తమ ఆర్థిక రాజకీయ ప్రయోజనాలను సాధించటానికి పోరాడదలచుకొన్నారు ఆ సందర్భంలో అందుకనుగుణమైన సాహిత్యం కూడా ఉద్భవించింది. ముద్రణ సౌకర్యాల పెరుగుదల, సాంఘిక రాజకీయ హక్కుల విస్తరణ, విద్యావకాశాల పెంపుదల అనేవి అనేక రంగాల్లో సమాజాన్నీ దాని కోరికలనూ మార్చిపారేశాయి. మాతృసంస్థ అయిన అఖిల భారత జాతీయ కాంగ్రెసునుంచి రాజకీయవాదులూ తిరుగుబాటుదారులూ గుంపులుగా విడిపోయి హిందూ మహాసభ, కాంగ్రెసు సోషలిస్టులు, రకరకాల సోషలిస్టు పార్టీలు, కమ్యూనిష్టు పార్టీ వగైరాలు కాలక్రమాన కొత్తగా స్థాపించారు. ఒకవైపు విశాలాంధ్రోద్యమం, మరోవైపు పరస్పర విరుద్ధ రాజకీయ భావనలతో పక్షాల నిర్మాణం, ప్రచారం సంఘర్షిస్తూనే సహజీవనం చేశాయి. ఇతర ప్రాంతాల్లోని రాజకీయ సాహిత్య సిద్ధాంతాచరణాలు ఆంధ్రదేశంలోనూ స్థానం సంపాదించాయి. అవి కొన్ని సమయాల్లో పరస్పర విరోధంతో, మరికొన్నిసార్లు పరస్పర సహాయకారులుగా తమ తమ ముద్రలు వేశాయి. ఇటువంటి కల్లోలిత సమయంలో భిన్నవ్యక్తుల, రచనల ప్రభావంతో శ్రీశ్రీ తన సాంఘిక, రాజకీయ, సాహిత్య భావనలకు రూపమిచ్చాడు.

బాల్యదశ నుంచి శ్రీశ్రీ విశాఖపట్నం, విజయనగరాల మధ్య అటూ ఇటూ ప్రయాణిస్తుండేవాడు. అప్పట్లో సర్వసాధారణంగా సంప్రదాయ విద్యలకు విజయనగరం కేంద్రంగా ఉండేది. అయినా గజపతి రాజుల సమదృష్టి పాండిత్యాలు కారణంగా గిడుగు,

గురజాడల సంప్రదాయ విరుద్ధ భావనలు కూడా అక్కడే మొలకెత్తాయి. సోదరుడు నారాయణబాబు, చాగంటి సోమయాజులు (చా సో.1915-1993) వంటి రచయితలూ, రోణంకి అప్పలస్వామి (1909-1987) వంటి.పండితులూ అతడితో చాలా స్నేహంగా ఉండి సాయపడుతుండేవారు. రోణంకి ఫ్రెంచ్, జర్మన్ భాషా సాహిత్యాలతో మంచి పరిచయమున్న ఆధునిక పండితుడు, ఉత్తమ బోధకుడు. ఆయనే శ్రీశ్రీకి ప్రపంచ భాషా సాహిత్యధోరణుల పరిచయం చేయటమేగాక తన శిష్యుడికోసం ఆ భాషల్లోని కొన్ని మౌలిక రచనలను ఇంగ్లీషులోకి అనువదించి ఇస్తుండేవాడు. శ్రీశ్రీకి ప్రపంచ సాహిత్యాలను గురించిన అవగాహన అంతటికీ ఆయనే బాధ్యుడు కాకపోవచ్చుగాని, అర్థం చేసుకోగల వయస్సులో కొత్త విషయాలను తెలుసుకోవాలనే తపన పుట్టించినవాడు మాత్రం ఔను. యువ విద్యార్థిగా ఉండగానే మారినెట్టి (1876-1944) భవిష్య సందర్శనం, 1916 నాటి త్రిస్తాన్ జారా డాడాయిజం, 1921 నాటి అపెలినాయర్ అధివాస్తవిక సిద్ధాంతం, ఫ్రాయిడ్ చేతనాచేతన సిద్ధాంతం వంటివి శ్రీశ్రీ దృష్టికి వచ్చాయి.

విశాఖపట్నం తిరిగి చేరిన శ్రీశ్రీ తనను పురిపండా పరిచయం చేయగా కలిసిన అబ్బూరి ప్రభావం అతడిమీద నిలిచిపోయింది శాశ్వతంగా. అబ్బూరి ఎంత మహావిద్వాంసుడో నిత్యజీవితంలో అంత సులభుడు. ఆయన సంప్రదాయ పండితుడేగాని దాన్ని ద్వేషించే వ్యక్తితో గూడా అంత హాయిగానూ కాలం దొర్లించగలడు. భారతదేశం మొత్తంమీద ఆకాలంలో అన్నిరంగాల్లోనూ ప్రముఖులనిపించుకొన్న వారందరితోనూ ఆయనకు ప్రత్యక్ష పరిచయముంది. కార్యాలయ సమయం పూర్తయిన తరువాత విశాఖరేవులో పనిచేస్తున్న నిరక్షరాస్య కార్మికులకు విద్యాబోధన చేస్తూ కమ్యూనిస్టు పార్టీ శాఖ నేర్పరచటానికి ప్రయత్నించాడాయన. విద్యార్థులుగా ఉన్న పుచ్చలపల్లి సుందరయ్య, చండ్ర రాజేశ్వరరావులను చేరదీసినవాడు. ఆయనప్పుడు విశ్వవిద్యాలయంలో హీరేన్ ముఖర్జీకి సహోపన్యాసకుడు. లండన్‌లోని అభ్యుదయ రచయితల సంఘంవారు ప్రచురించిన మానిఫెస్టోను భారతదేశానికి రహస్యంగా చేరవేసిన డాక్టర్ హెమూ అధికారితో ఆయనకు సంబంధాలుండేవి. 1932 నాటి కొత్త సంతకాలతో (New Signatures) సహా మేనిఫెస్టోతోబాటు కొంత సాహిత్యాన్ని అబ్బూరి సంపాదించాడు. 1936లో జవాహర్‌లాల్ నెహ్రూ అధ్యక్షతన లక్నోలో జరిగిన అభ్యుదయ రచయితల ప్రథమ మహాసభకు ఆయన ప్రతినిధిగా వెళ్లినవాడు మున్షీ ప్రేమ్‌చంద్ ఆ సభకు చైర్మన్ అయినాడు. బ్రిటిషు ప్రభుత్వం మేనిఫెస్టోను నిషేధించింది. అతడి వామపక్ష భావాలు తనకు సంతృప్తి కలిగించిన మీదట ఆ మేనిఫెస్టో నకలునాయన శ్రీశ్రీ కిచ్చాడు. దాన్ని చదివిన శ్రీశ్రీ దానికో అద్భుత కవితారూపం కల్పించాడు. గ్రంథాలయాధికారిగా ఉన్న అబ్బూరి విశ్వవిద్యాలయంలో తన అధీనంలో ఉన్న ఏపుస్తకాన్నయినా శ్రీశ్రీకి నిస్సందేహంగా చదవనిచ్చాడు. శ్రీశ్రీ కవితా దాహార్తిని అది తీరుస్తుండేది. ప్రపంచ సాహిత్యాన్ని చదివించి

శ్రీశ్రీ కళ్లు తెరిపించిన మొదటి గ్రంథాలయం ఆంధ్ర విశ్వవిద్యాలయానిది. తరవాతవి మదరాసులోని అడయార్, కన్నెమెరా పబ్లిక్ లైబ్రరీలు. శ్రీశ్రీ అబ్బూరి పుత్రుడు వరద రాజేశ్వరరావుకు (1923-1993) మిత్రుడూ అభిమానీ అయి, అతడితో కలిసి కొన్ని పద్యాలు రాశాడు· నటాలి నాట్యబృందంలో కలిసి పనిచేశాడు. అయితే (సృజనాత్మక సాహిత్యం ద్వారా తనకు బాగా పరిచయమైన) కమ్యూనిజాన్ని తన గురువులాగా వదలిపెట్టలేదు అబ్బూరి మానవేంద్రనాథ్ రాయ్‌కి సన్నిహితుడై రాయిష్టుగా పరివర్తన చెందాడు. పురిపండా అప్పలస్వామి శ్రీశ్రీకి హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ (1858-1980), నజ్రుల్ ఇస్లాముల (1899-1916) కవితలతో పరిచయం కలిగించాడు. రబీంద్రనాథ్ ఠాకూరును సమంగా అభిమానించిన అబ్బూరి పురిపండాలు శ్రీశ్రీమీద తమ భావాలను ప్రసరించినందువల్ల శ్రీశ్రీ తరువాతి కాలంలో అంగీకరించినట్లు ఉతడికి 'శబ్దలౌల్యం' సమకూడింది దానికితోడు ఠాకూరువల్ల కొంతకాలం ప్రభావితుడై చాలామంది ఇతర భావకవుల్లాగా దేశభక్తి కవితలు కూడా రాసిన దేవులపల్లి తనను ప్రభావితుణ్ని చేశాడు కాబట్టి అతడికి ఠాగూరుమీద అభిమానం కలిగింది

ఇతర సాహితీ రూపాలతో అంత సమర్థంగానూ ఆటలాడుకున్న విశ్వనాథ దేవులపల్లులు ప్రధానంగా సంప్రదాయ ఛ్ఛందస్సులమీద అధికారం నెరపినవాళ్లు. వీరికన్నా ముందుగానే గురజాడ సంప్రదాయాన్ని ధిక్కరించి సొంత ఛందస్సులు కల్పించినా, శ్రీశ్రీ ఏ కాలక్రమాన్నీ పాటించలేదు కాబట్టి తన సాహితీ జీవితారంభ సమయంలో అతడు గురజాడను అనుసరించలేదు. అతడే చెప్పిన మాటల ప్రకారం తాను తొలి గురువులని భావించిన బసవరాజు అప్పారావు (1894-1933), కవికొండల వేంకటరావు (1892-1969), చింతా దీక్షితులు (1891-1960) అనే వారిద్వారా గురజాడను గుర్తించగలిగాడు ఈ ముగ్గురూ ఛందో వైవిధ్యం గుర్తించి ప్రయోగించటంలో తోడ్పడ్డారు చివరకు గురజాడను అభ్యసించి ఛందోధికార సంపాదనకు మూలసూత్రాలు తెలుసుకున్నానన్నాడు శ్రీశ్రీ. అతడి ప్రభవ (1925) కావ్యం సంప్రదాయ ఛ్ఛందస్సులో ఉంది కానీ సుప్తాస్థికలు (1929) వచన కవితా ప్రయోగాలుకూడా ఉన్న రచన. ఆ రెండు రచనల్లోని భాష, శైలి, పదశిల్పం మరో శ్రీశ్రీ ఆవిర్భవిస్తున్నాడా అనిపించేంత భిన్నంగా ఉన్నాయి. గురజాడను అధ్యయనం చేయటం అతడికి అంతర్జాతీయతా భావాల పరిచయం కల్పించింది. అతడికి ఆదర్శప్రాయులైన భావకవులు మాత్రం సంకుచిత జాతీయాహంకారం దగ్గరే ఆగిపోయారు. అబ్బూరి రోణంకుల పరిచయం ద్వారా సంపాదించిన సమకాలిక ప్రపంచ సాహిత్య ధోరణి పరిజ్ఞానం అతడి మేధా పరిధిని విస్తరించి ఛందస్సులతో అనేక విధాల ప్రయోగాలు చేసే మార్గం చూపింది. తన లక్ష్యసాధనలో అతడికి డాడాయిజం, అధివాస్తవికత వంటివి ఆ సమయంలో ఉపకరించాయి

బి ఏ. ప్యాసయిన శ్రీశ్రీ ఉద్యోగాన్వేషణలో పడ్డాడు. అప్పటి ప్రపంచం ఆర్థిక మాంద్యంలో సతమతమవుతున్నది. ఆ యువహృదయాన్ని అలనాటి ఆకలిరోజులు (hungry thirties) గాయపరిచయాయి - ఆ మచ్చలు మాననే లేదు అతడి జీవితకాలంలో అతడు శారీరకంగా, మానసికంగా అస్థిరుడైనాడు. అంతకాలమూ దారిద్ర్యబాధతో విలవిల్లాడాడు. అయినా అతడి ఆత్మశక్తి క్షీణించలేదు; కవితా దాహం చల్లారలేదు. మూడో దశకంలో అతడు బరంపురంలోని నవ్య సాహిత్య పరిషత్తులోచేరి సుప్రసిద్ధమైన ప్రతిభ సంపాదకవర్గ సభ్యుడయినప్పుడు సాహితీ ప్రపంచంలోని పెద్దా చిన్నా రచయితలతో స్నేహ సంబంధాలేర్పడ్డాయి. అప్పుడే మహాప్రస్థాన గేయ రచనా, వాటిని బహిరంగ సభల్లో పాడటమూ సంభవించాయి. ఆనాటిదాకా శ్రీనివాసరావనిపించు కొన్నవాడు పండితుల, కవుల, సాధారణ ప్రజల అభిమానం సంపాదించి అకస్మాత్తుగా శ్రీశ్రీ అయిపోయాడు. అతడు కొత్తవిషయాలన్నా అంతకు ముందు లేనిదేదయినా సరే ఆకర్షితుడు కావటం మొదలుపెట్టాడు కవిగా, వ్యక్తిగా, విద్యావంతుడుగా తనకో ప్రత్యేకత సాధించటానికి అహరహం కృషిచేయట మారంభించాడు. భాషాఛందస్సుల మీద అధికారం సంపాదించాడు. అనేక విధాల గుర్తింపు పొందాడు. తనకు అర్థమయిన మార్క్సిజం వల్లగాక సాహిత్యం ద్వారా తనకవగతమైన సాంఘికార్థికతత్వ వివేచనద్వారా అతడు ఆంధ్ర కమ్యూనిస్టు పార్టీకి సన్నిహితం కాజొచ్చాడు. తనచుట్టూ ఉన్న ప్రజల్లో తన బాధల దుఃఖాల ప్రతిబింబాలు చూశాడు. తన సాహితీశక్తి సమస్తమూ ధారపోసి ప్రతిస్పందించాడు. అప్పుడప్పుడు రాజకీయ సమావేశాల్లో ఉపన్యసించటమూ ఆరంభించాడు.

## ప్రజల మనిషి

ఈ శతాబ్ది మధ్యకాలంలో కమ్యూనిజంతో కమ్యూనిస్టు పార్టీతో శ్రీశ్రీ సంబంధం మరింత స్పష్టమయింది. నిజాం ఫాసిస్టు పరిపాలనలో 1946-50 మధ్యకాలంలో తెలంగాణా సాయుధ సమరం సాగుతున్నపుడు పీడిత ప్రజానీకాన్ని సమర్థిస్తూ శ్రీశ్రీ ఒక్క అక్షరమైనా రాయలేదు! భద్రమైన ఉద్యోగం కోసం చేసిన ప్రయత్నాల్లో కొన్నినెలలపాటు నైజాం కొలువు దొరికింది. ప్రజలకు తన సానుభూతిని చెప్పకుండా ఆ ఉద్యోగం అడ్డుపడిందంటే, అతిభద్రతా భావానికీ, స్వప్రయోజనానికీ దాసుడై జాగ్రత్త పడ్డాడని నిందించినా తప్పులేదు. అతడికి చాలా సన్నిహితంగా మెలగిన కొందరు రచయితలు నిజామును సమర్థించి పదిరూకలు సంపాదించాలనే ప్రలోభాన్ని అతడు దగ్గరకు రానీలేదంటారు. హైదరాబాదులో అతడున్నది చాలా కొద్దికాలం. నిజాం వ్యతిరేక, రజాకార్ వ్యతిరేక ఉద్యమాల విషయంలో అతడి నిరుత్సాహం గురించి చాలా కథలున్నాయి.

గురజాడ తరువాత తనకు రెండోస్థానమిచ్చి నెత్తిన పెట్టుకొన్న కమ్యూనిస్టు పార్టీని పక్కకునెట్టి శ్రీశ్రీ వామపక్ష కవిగా ఎదగటం మొదలుపెట్టాడని విశ్వసించటానికి కొన్ని సంఘటనలు దారితీస్తాయి. 1943లో స్థాపితమైన ఆంధ్రాభ్యుదయ రచయితల సంఘం (అరసం) వారు తెనాలిలో నిర్వహించిన ప్రథమ మహాసభకు అతడు హాజరుకాలేదు. వాస్తవిక కారణాలుగానీ, ఊహించదగ్గవిగాని అస్పష్టం. 1944లో బెజవాడలో జరిగిన ద్వితీయ మహాసభకు వచ్చాడో రాలేదో ఎవరూ గమనించలేదు. కానీ దేవులపల్లి అధ్యక్షతన 1945-46లో రాజమహేంద్రవరంలో జరిగిన తృతీయ మహాసభలో శ్రీశ్రీ ప్రారంభోపన్యాసం చేశాడు 1947లో క్వాజీ అహమ్మద్ అబ్బాస్ ప్రారంభించగా న్యాయమూర్తి పి.వి.రాజమన్నార్ (1901-78) అధ్యక్షతన జరిగిన మదరాసు మహాసభలో అతడి పాత్ర ఏమో తెలియదు అయితే 1950లో బెజవాడలో జరిగిన అయిదో సాంవత్సరిక సభకు అతడు అధ్యక్షత వహించాడు ఆయా సమయాల్లో హాజరు కావటానికీ కాకపోవటానికీ సంబంధించి రకరకాల కథనాలున్నాయి. వాటిని గురించి తీవ్రంగా పరిశోధించవలసినంత ప్రముఖ విషయాలు కావవి. తానెప్పుడూ కమ్యూనిస్టుగా నిబద్ధత గలవాడినని చెప్పుకుంటాడుగాని అతడి కమ్యూనిస్టు భావాలు రాజకీయ పరిజ్ఞానంమీదగాని మార్క్సిజంలో తనకున్న పాండిత్యంమీదగాని ఆధారపడ్డవికావు. అతడెప్పుడూ సాధారణ ప్రజా సమస్యలకు సానుభూతి చూపినమాట వాస్తవం. అందులో సందేహమక్కరలేదు. 1945లో సినిమారంగంలో ప్రవేశించి డబ్బులు గడించటం మొదలుపెట్టాడు. పదిరూకలు చేసుకున్నప్పుడల్లా అరసంవారి అభ్యుదయ మాసపత్రికకు ఆర్థిక సహాయం చేశాడు. క్రియాశీలంగానో మాటమాత్రంగానో, 1970 దాకా భారత కమ్యూనిస్టు పార్టీతో సంబంధాలు నిలుపుకున్నాడు.

1950 ప్రాంతాల్లో సినీరంగంలో ఊపిరాడని పనుల్లో ఉండికూడా కవితలు చదవటం రాయటం మానలేదు. విభిన్న సాహితీ రూపాలను గురించి కూడా చదువుతుండేవాడు. శాన్‌ఫ్రాన్సిస్కో స్టేట్ కాలేజీలోని కవితాకేంద్రం గురించి, బీట్ కవులగురించి, బీట్నిక్ రచయితల గురించి, ఫ్రెంచి మార్క్సిస్టులమీద ఆధారపడ్డ ర్యాడికాల్ ఉద్యమం గురించి, నిహిలిజం గురించి, శాస్త్రీయ హేతువాదం గురించి, సంయుక్త బాధ్యతల గురించి అధ్యయనం చేశాడు. ఒక దశాబ్దం తరువాత దాన్ జార్జికన్‌కు చెందిన ముసలితరం బ్రిటన్లోని క్రుద్ధ యువత, హాలెండ్‌లోని బాధిత యువకులు, హాలెండ్‌లోని ప్రోవో ఉద్యమం, అమెరికాలోని హిప్పీలూ, జార్జిబ్రాక్ ఎడిత్‌స్విట్‌వెల్లుల క్యూబిజమూ, వోర్టిసిజం, వచన పద్యం, స్వేచ్ఛాపద్యం, బ్రిటిషు రచయిత అమీలోవెల్ బహుధ్వని పూర్వక వచనం పద్యం, అనువర్తిత కవిత - వంటి అనేక సాహితీ రూపాలు అతడి అభిమానం పొందుతూ పోగొట్టుకుంటూ ఉండేవి. ఒక్కమాటను నిస్సందేహంగా చెప్పవచ్చు - ఆధునిక ప్రపంచ లక్షణాలన్నిటితో పరిచయం

సంపాదించి తనకు నచ్చిన ఏ కొత్తధోరణినైనా అనుకరించి, అనుసరించటానికూ్కడా సిద్ధపడ్డ తెలుగు రచయిత అతడొక్కడేనని గురజాడ 1909లో సృష్టించిన కొత్త ఛందస్సు అప్పటికి కవి ప్రపంచంలో ప్రధానాకర్షణ అయింది. అప్పటికి భావకవిగా కర్షక కవిగా ప్రఖ్యాతుడై గ్రాంథిక భాషాభిమానిగా సంప్రదాయ ఛ్ఛందస్సులనే గౌరవించే దువ్వూరి రామిరెడ్డి వచన కవితాధోరణికి తలఒగ్గాడు. శిష్ట్లా ఉమామహేశ్వరరావు (1909-1953), అడవి బాపిరాజు (1895-1952) పోలీఫోనిక్ వచన పద్యాలు రాయాలనే ప్రయత్నాలు మొదలుపెట్టారు కవితారూప ప్రయోగాల్లో తనకన్నా ముందువాడైన శిష్ట్లాను తరువాత శ్రీశ్రీ అధిగమించాడు. శిష్ట్లా తన కవితాధోరణికి పెట్టిన ప్రాహ్లాద కవిత్వమనే పేరెవరికీ నచ్చలేదుగాని, ఆ కవితారూపం చాలామందిని - ముఖ్యంగా శ్రీశ్రీని అలరించింది

ఠాకూర్ కవిత్వమో నిరాలా, సుమిత్రానందన్ పంత్, మహాదేవీ వర్మల ఛాయావాదమో అధిక సంఖ్యాక భావ కవుల నాకర్షిస్తున్న రోజుల్లో, శ్రీశ్రీ యశ్‌పాల్, ఉపేంద్రనాథ్ అస్క్, ప్రేమ్‌చంద్, రాహుల్‌సాంకృత్యాయన్‌ల వంటి హిందీ రచయితలను అభిమానించాడు. సయజ్ అహమ్మద్ సయజ్, సజ్జాద్ జహీర్, కైఫీ ఆజ్మీ, మగ్దూం మొహియుద్దీనులను ప్రశంసించాడు. ఎవ్వరే నూతన ప్రయత్నమారంభించినా అతడు వారిని ప్రోత్సహించి సమర్థించేవాడు అతడు 1943లో వెలువడ్డ నయాగరా కావ్యాన్నీ దాన్ని ప్రచురించిన నవ్య కళాసమితినీ బ్రహ్మాండంగా మెచ్చుకొన్నాడు. తరవాత 1955లో కుందుర్తి ఆంజనేయులు (1922-1982) స్థాపించిన ఫ్రీవర్స్ ఫ్రంటుకు స్వాగతం చెప్పాడు. దిగంబర కవుల కవితలను (1965) సమర్థించటమేగాక ఇంగ్లీషులోకి అనువదించాడు. చివరకు 1970లో విప్లవ రచయితల సంఘం విరసానికి స్థాపకాధ్యక్షుడైనాడు 1946-50 మధ్యకాలంలో భారత కమ్యూనిస్టు పార్టీ ఆంధ్ర మహాసభలు సాగించిన నిజాం వ్యతిరేక సాయుధ సమరానికి అందించని సహాయ సంపదను 1960 ప్రాంతాల్లో శ్రీకాకుళం సాయుధ పోరాటానికి పట్టుదలతో అందించాడు. తరిమెల నాగిరెడ్డితోబాటు ఆంధ్రప్రాంతంలో పర్యటించి ఆ విప్లవకారుల కోసం విరాళాలు సేకరించాడు అంతకుముందే బెంగాల్లోని క్షుధార్త రచయితలూ, జగదీశ్ చతుర్వేది హిందీలో ఆరంభించిన అకవితా వాదోద్యమమూ, మైథిలీలో తలయెత్తిన అనామోద్యమమూ, మరాఠీలోని ఆశేవర్గమూ అతడికి బాగా నచ్చాయి. ఈ విభిన్న సిద్ధాంతాలను అతడెంతవరకు ఆకళించుకోగలిగాడన్నది అతడి రచనలన్నిటినీ జాగ్రత్తగా శోధించిగాని నిర్ణయించలేం. ఈ గ్రంథపరిధి కాపని మించినది. గురజాడను ఖండించి తక్కువచేసే ప్రయత్నాలు జరిగినప్పుడు అతడు విమర్శనాత్మక సాంకేతిక వ్యాసాలురాసి తన గురువును సమర్థించాడు సాహితీ ప్రపంచంలో తానొక మహాశక్తిగా ఎదిగానని విశ్వసించటం మొదలుపెట్టాడు. 1933లోనే తానింతదాకా చారిత్రక శక్తుల ననుసరించాననీ, ఇకముందు తానే ఆ శక్తులను నడిపించబోతున్నాననీ తనతో అన్నట్లు

పురిపండా సాక్ష్యమిచ్చాడు అతడి ఆత్మవిశ్వాసం క్రమాభివృద్ధి చెందింది. అతడి వ్యక్తిత్వం నిరంతరాయంగా ఊర్ధ్వముఖం పట్టింది. అతడి సమస్కంధులు కూడా 1950నుంచీ అతణ్ని మహాకవి అనే ప్రస్తావించారు సర్వ సాధారణంగా, ప్రేమాభిమానాలతో శ్రీశ్రీ అనే పిలిచారు. కారణం చాలా సులభం సాహితీ విషయాల్లో అతడు ప్రశంసనీయమైన పాండిత్యం సంపాదించాడు. చాలా పదునైన భాషలో భావ వ్యక్తీకరణ చేయగలిగాడు. తన బలహీనతలను కూడా నిర్లజ్జగా, నిర్భయంగా, బహిరంగంగా అంగీకరించేవాడు - అందువల్ల తన్ను తానే కించపరచుకున్నట్లయినా సరే. కొత్త భావాలూ నూతన ప్రయోగాలూ ఎవరికున్నా ఎవరు చేసినా ప్రోత్సహించాడు. అతడి ప్రవర్తన చిన్నపిల్లల తీరులో ఉండేది. తానో వయసు పెరిగిన బాలుణ్నని భావించేవాడు. అతడి హాస్య చమత్కారాలు ఆనందదాయకంగా ఉండేవి. అతడు స్నేహితులకేగాక, ముక్కూ మొహం తెలియని వాళ్ళకూడా సాయపడేవాడు. తన దారిద్ర్యాన్నిగానీ కోరికలనుగానీ ఎన్నడూ దాచుకోలేదు. కవిగా, వ్యక్తిగా, సంభాషణ చతురుడుగా ఉన్నత స్థానానికి ఎదిగాడు బహిరంగోపన్యాసాలు అతడి వక్తృత్వ దౌర్బల్యానికే చిహ్నాలయినా, అతడి వైఫల్యాలు కూడా తరవాతి తరం వాళ్లకు సాధారణ విషయాలుగా సహజ పరిణామాలనిపించేవి అలా అతడు జనరంజకత్వం సాధించాడు. అతడి వికృత చేష్టలు కూడా ప్రజలకు నచ్చేవి. గురజాడతోసహా మరే రచయితా తన జీవితకాలంలో ఇంతగా ప్రజారంజకుడు కాలేదు - అభిమానపాత్రుడు కాలేదు

# నాలుగో ప్రకరణం

## శ్రీశ్రీ రచనలు

పదిహేనో శతాబ్దినాటి వెల్లంకి తాతంభట్టు రాసిన సులక్షణసారమనే ఛందోగ్రంథంతో తనకు పరిచయమేర్పడినప్పటినుంచీ - అంటే ఎనిమిదేళ్ల వయస్సు వచ్చినప్పటినుంచీ - తాను పద్యరచన ఆరంభించినట్లు శ్రీశ్రీ చెప్పుకొంటుండేవాడు. తాను పదేళ్లప్రాయంలోనే సుప్రసిద్ధ ఛందశ్శాస్త్ర గ్రంథం అప్పకవీయం చదివాననీ, తన తండ్రి మిత్రుడైన వడ్డే కేశవరావు తనకు దాన్ని బోధించాడనీ అతడి కథనం. తన చిన్ననాటి అనుభవాలనూ, స్మృతులనూ అనంతమనే ధారావాహిక రచనగా వెలువడ్డ ఆత్మకథలో రాసుకున్నాడు ఆమాటలన్నీ అక్షరసత్యాలని అంగీకరించనక్కరలేదుగాని, చాలా చిన్నవయసులోనే అతడు పద్యరచన ప్రారంభించాడనవచ్చు. తాను రాసి పోగొట్టుకున్న కొన్ని పుస్తకాల గురించి అతడు ప్రస్తావించాడు. అవన్నీ ఇప్పుడు దొరకటం కష్టం. వాటిలో మొదటిదైన సావిత్రీ సత్యవంతులనేది 30-40 పేజీల రచన. అందులో వచన భాగం చాలా తక్కువ. అది చాలావరకు మారుమూల ఛందస్సుల్లో సాగిన పద్యనాటిక. రెండోదయిన పరిణయ రహస్యమనే నవలిక చాలా ఇటీవల దొరికింది మూడోది ఆకాలంలో జనరంజకంగా ఉన్న కాలూరాయ్ అనే బెంగాలీ డిటెక్టివ్ నవల చదివి తాను రాసిన గోకులాయ్ అనే అపరాధ పరిశోధక నవల. ఆ వరసలో చిట్టచివరిది దేశభక్తి భూయిష్ఠమైన వీరసింహ విజయసింహులనే కల్పితకథ. ఉన్నత పాఠశాలనుంచి బయట పడకముందే అతడు రాసిన గ్రంథాలివి. వాటిలో రెండోది తప్ప తక్కినవి అంతరించాయి. అప్పట్లో అతడి మనస్థితి ఎలా ఉండేదో సూచించటానికి మాత్రం వాటి ప్రస్తావన పనికి వస్తుంది.

తన జీవితకాలంలో నిర్వహిద్దామని సంకల్పించి నెరవేర్చలేకపోయినవి కొన్ని ఉన్నాయి - సాహిత్యపరంగానూ ఇతరంగానూ. బెండయ్యగారి గది అనే పేరుతో మూడంకాల నాటకం రాద్దామనుకున్నాడు. సదరు ఆలోచన నలభై సంవత్సరాలపాటు అతడి బుర్రలోనే ఉందిగాని వాస్తవరూపం ధరించనే లేదు. అతడి ఉద్దేశమేమో అతడికే అస్పష్టంగా ఉందిగాని, కృష్ణ నాటకాలు రాయాలనే కోరిక ఉండేది. ''సా... సా'' (సాహిత్యం, సామ్యవాదం అనే పదాలకు సంక్షిప్తరూపం) అనే శీర్షికతో ఒక విమర్శగ్రంథం

రాయాలనే అభిలాష ఉండేదటగానీ, అలా చేయలేకపోయానని అతడే అంగీకరించాడు. కొందరు అనిర్దిష్ట వ్యక్తుల స్వభావ లక్షణాలను వర్ణిస్తూ, నూరు గేయాల కావ్యం రాద్దామనుకున్నాడు - ''ఏది నేరం? ఏది శిక్ష?'' అనే పేరు పెట్టి. అదీ జరగలేదు. కొంతవయసు వచ్చిన తరవాత 'హంసతో ఆర్నెల్లు' అనే నవల రాద్దామనిపించింది. ఆ కోరికా తీరలేదు. విశాఖ మండలంలోని అట్టడుగు తరగతుల, మధ్య తరగతుల వారి మాండలిక రూపాలతో నూరుగేయాలు రాద్దామని సంకల్పించాడు అది రూపు కట్టలేదు. సినిమా స్క్రిప్టురూపంలో ఆకలిమంటలనే నవల రాయాలనీ, రుక్మిణీ కల్యాణమనే సినిమా తీయాలనే ఉబలాటపడ్డాడు అలా జరగలేదు ఇంత దీర్ఘకాలంలో ఆయా రచనలెందుకు చేయలేకపోయాడో పరమరహస్యంగా మిగిలిపోయింది 'వైశాఖ్, పాషాణ్' అనే కలంపేర్లు పెట్టుకుందా మనుకొన్నాట్టగాని, వాటినెన్నడూ వాడలేదు అశాంతి అనే పత్రిక పెట్టాలన్న సంకల్పం, ఎం.ఎస్ సి., ఎల్ ఎల్.బి డిగ్రీలు సాధించాలన్న కోరికా నెరవేరలేదు. చింకి గుడ్డల సింహమనే అసంపూర్ణ కావ్యం రాశానన్నాడు అది కనిపించదు 1950 కన్నా ముందుగానే ప్రచురించటమారంభించిన ఆత్మకథ '**అనంతం**' 1980 దాకా నడిచి అక్కడ ఆగిపోయింది తన బలహీనతలనూ వైఫల్యాలనూ మరింత వివరంగా రాద్దామనుకొని కూడా తనచుట్టూ ఉన్న సమాజం సహించలేదేమోనని భయపడ్డాడు అయినా అతడు పేర్కొన్న అనేకానేక దుశ్చర్యలు సభ్య పాఠకులు సహించలేనివే. అతడు ఆశువుగా చెప్పిన అనేకాశ్లీల పద్యాలూ, అతడు చేసిన అసభ్య విమర్శలూ, వెక్కిరింతలూ, చమత్కార సంభాషణలూ, పిచ్చిమాటలూ అనేకం చాలామందికి వ్యక్తిగతంగా తెలిసిన రహస్య రచనలే. ఆ మహారచయితలో వికృతలక్షణాలు ఎన్ని ఉన్నా, అతడి వ్యక్తిగత బలహీనతలూ, సాహిత్య దుర్భావనలూ ఎన్ని తెలిసినా, అతడి జనరంజకత్వం తగ్గలేదు. సాహితీ గౌరవం సన్నగిల్లలేదు. దాపరికంలేని అతడి ప్రవర్తన సహజంగా లభ్యమయ్యే సానుభూతికన్నా ఎక్కువగానే సంపాదించగలిగింది.

సమకాలంలోని పెద్దా చిన్నా కవులకన్నా అతడధిరోహించిన ఉన్నత శిఖరాలు కవితా ప్రపంచంలోవే. నాటికలూ, కథానికలూ, విమర్శవ్యాసాలూ, శతకాలూ, గ్రంథసమీక్షలూ, అసంపూర్ణమైన ఆత్మకథా, అతడి రచనలుగా అనేక సాహితీ ప్రక్రియల్లో ఉన్నాయి తన సొంత రచనలనేగాక సాహితీరంగంలోని చిన్నాపెద్దా రచయితల కావ్యాలనుగూడా అతడు తెలుగునుంచి ఇంగ్లీషులోకి, ఇంగ్లీషు నుంచి తెలుగులోకీ అనువదించాడు. భిన్నకాలాల్లో సాహితీపరులకతడిచ్చిన ఇంటర్వ్యూలు ముక్కుకు సూటిగా, వినోదభరితంగా ఉండి జనరంజకమైనాయి. అవి ఏ సాహిత్య ప్రక్రియకు చెందిన రచనలన్న సంగతి తరవాత. కాలక్రమానుసారంగా అతడి రచనల పట్టికను అనుబంధంలో చూడవచ్చు శ్రీశ్రీ రచనలన్నింటినీ 20 సంపుటాలుగా విరసంవారు ప్రచురించారు.

రచనాకాలానికి ఒక సంవత్సరం తరవాత విశాఖపట్నంలోని కవితా సమితి 1928లో ప్రచురించిన ప్రభవకావ్యం అతడి ప్రముఖ రచనల్లో మొదటిది. అప్పటికతడి వయసు దాదాపు 17 సంవత్సరాలు దేవులపల్లి కృష్ణశాస్త్రి భావకవితా ధోరణిలో సంప్రదాయ ఛ్ఛందస్సులతో ఆధునిక కావ్యభాషాశైలిలో ఆ కావ్యం వెలువడింది. ప్రకృతి, ప్రణయం, ప్రకీర్ణమనే మూడు భాగాలున్నాయందులో. సుదీర్ఘ సమాసాలూ, ధారాశుద్ధీ అతణ్ని ఉత్తమ భావకవుల సరసన నిలబెట్టాయి.

1929లో రాసి, సుప్రసిద్ధ సాహితీ పత్రికకు పంపగా సంపాదకులు ప్రచురణయోగ్యం కాదని తిరుగు టపాలో తిప్పి పంపిన కావ్యం సుప్తాస్థికలు. అందులోని పద్యాలను తరువాతి కాలంలో అదే శీర్షికతో ప్రసారితమైన రేడియో నాటికలో చేర్చాడు. మహాత్మాగాంధీ (1869-1948) మరణానికి క్షోభించిన ప్రజల దుఃఖ భావం అందులోని ఇతివృత్తం వర్ణనభాగం గ్రాంధికాంధ్రంలోనూ ప్రకటన, విషాద కంఠాలరోదన వ్యావహారిక గేయరూపంలోనూ సాగాయి. అస్థికలు మరణానికీ, సంధ్య మృత్యువుకూ ప్రతీకలు. అంధకారం నిరాశకూ నక్షత్రం ప్రేమకూ సంకేతాలు. గాంధీజీ ఇందులో అప్రత్యక్ష పాత్ర. ఆ మహామహుడు అస్తమించినప్పుడు యావత్ ప్రపంచమూ రోదిస్తుంది - 'హిమాలయం మా హృదయభారం, గంగానది మా కన్నీళ్లు' అంటూ మహాత్ముడికైనా మరణం అనివార్యం కావచ్చు. అంతటివా డస్తమిస్తే ప్రపంచం హృదయభారంతో రోదించనూవచ్చు. సుదూర భవిష్యత్తులో రాబోయే ప్రళయాన్ని ఊహించి ముందే గుండెలు బాదుకొంటూ గాంధీజీ అభిమానులందరినీ మనస్తాపంలో పెట్టే ఈ రచన మిడిమిడి జ్ఞానంతో రాసింది. రచనలోని సాహితీ సౌందర్య ప్రభావమెలా ఉన్నా ఇది విపరీత మానసిక ప్రవృత్తిలో ఉన్న వ్యక్తి రాసిన కావ్యమనిపించక మానదు.

## మహాప్రస్థానం

ఆకలి బాధలు అనివార్యంగా ఉన్న 1930 ప్రాంతాల్లో ఆర్థిక మాంద్యం ప్రపంచాన్ని పీడిస్తున్న సమయంలో 1934కూ 1940కీ మధ్యకాలంలో రాసిన కవితలతో మహాప్రస్థానాన్ని గేయసంపుటిగా తన సర్వోత్తమ కావ్యంగా వెలయించాడు. ఆకాలంలో రాసిన గేయాలన్నిటినీ సంపుటిలో చేర్చలేదు ప్రపంచవ్యాప్తంగా మానవజాతి ఎదుర్కొంటున్న బాధలు ప్రధానేతివృత్తంగా ఉండేట్లు గేయాలనమర్చాడిందులో. ప్రస్తుత రూపంలో దాన్ని 1950లో మొదటిసారి ప్రచురించటానికి మచిలీపట్నం వాస్తవ్యుడయిన తన మిత్రుడు నళినీకుమార్ ఆర్థికంగానూ, హార్దికంగానూ సాయపడ్డాడు. చిన్నవయసులో అకాలమరణం పొందిన ఉదయిని పత్రికా సంపాదకుడు కొంపెల్ల జనార్దనరావు కది అంకితం. 'పణ విపణి' అనే సామాన్య కావ్యం రచించిన పుండవల్లి సూర్యనారాయణకు (1915-1976) నళినీకుమారనేది కలం పేరు. అతగాడు ధనవంతుడు. మదరాసులో

ఉండగా శ్రీశ్రీకి అతడితో పరిచయమయింది. ఒకరకంగా వారిద్దరూ సమానశీల వ్యసన పరాయణులు. కొంపెల్ల ఉద్దండ పండితుడు. కావ్య భాషాభిమాని. సంప్రదాయ ప్రియుడు. అయినా సంప్రదాయేతర భావాలను సహించగలవాడు. సాహితీ ప్రచారంమీద తనకున్న వ్యామోహ ప్రభావంతో తనకున్న కొద్దిపాటి వనరులతోనే పత్రికను స్థాపించి, తనముగాక తన పత్రికను ఆదుకోగల ధన సహాయం లభించకపోతే గుండెపోటు తెచ్చుకున్నవాడు. బరంపురంలో అతణ్ని కలిసిన శ్రీశ్రీ, తన ప్రభవను తీవ్రంగా అతడు విమర్శించినా తట్టుకొని స్నేహానుబంధం పెంచుకున్నాడు. గ్రంథానికి మరింత వన్నె తెచ్చిపెట్టింది చలం (గుడిపాటి వెంకటాచలం : 1894-1979) గ్రంథ పరిచయం చేసిన యోగ్యతా పత్రం సాహితీరంగంలో ఆనాటికే చలం సుప్రసిద్ధుడు కాకినాడలో జరిగిన కమ్యూనిస్టు యువకుల మహాసభలో శ్రీశ్రీ చదివిన గేయం సంపుటిలో ఉంది. అడివి బాపిరాజు, శ్రీరంగం నారాయణబాబులు అది విని దాన్ని అనుకరించాలనుకున్నారు. ముద్దుకృష్ణ తన పత్రిక జ్వాలలో ప్రచురించిగాని సంతుష్టుడు కాలేదు జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రి (1914-1968) చదివి వినిపించగా చలం కన్నీళ్లు పెట్టుకొన్న చేదుపాటకూడా సంపుటిలో ఉంది. విశ్వనాథ విని, పులకరించి, లేచి కౌగలించుకొని, నేనే ప్రచురిస్తానని వాగ్దానం చేయటానికి కారణభూతమైన 'కవితా! ఓ కవితా!' అనే కళాఖండం సంపుటిలో ఉంది ఆ సంపుటిని ప్రచురించటానికి చాలాకాలం మునుపే శ్రీశ్రీ సాహితీరంగంలో సుప్రసిద్ధుడయినాడు గ్రంథగతమైన సాహితీ వైభవమే గాక దేవులపల్లి, అడివి బాపిరాజులు బహిరంగ సభల్లో వాటిని ఆలపించటం కూడా ఆ ప్రసిద్ధికి మరో కారణం. శ్రీశ్రీ రచనలంత కవితాత్మకంగానూ, శక్తిమంతంగానూ, మనోరంజకంగానూ చలమిచ్చిన యోగ్యతా పత్రమూ ఉండటం అదనపు ఆకర్షణ. ఈ సంపుటి 1952-1984 మధ్యకాలంలో 20 సార్లు పునర్ముద్రణ భాగ్యం పొంది నేటికీ జనరంజకత్వం కోల్పోలేదు 1984 తరువాత మరి మూడు పునర్ముద్రణాలు వెలువడ్డాయి సాహితీ విద్యార్థుల, పండితుల ధారణలో అనేకానేక గేయ పాదాలు ఇంకా నిలిచి ఉన్నాయి. లండన్‌లోని డాక్టర్ గూటాల కృష్ణమూర్తి విదేశాంధ్ర ప్రచురణాలయం శ్రీశ్రీ సొంత దస్తూరీతో గొంతుతో ఈ గేయాలను అక్షర ధ్వని రూపాల్లో ప్రచురించింది. ఎన్‌సైక్లోపెడియా ఆఫ్ బ్రిటానికా వంటి గ్రంథ సంపుటాలతోబాటు ఈ క్యాసెట్లను అద్దాల బీరువాల్లో దాచి ప్రదర్శించటం సమాజంలో ఉన్నతస్థానానికి నిదర్శనగా మారింది. ఒక కవి తన జీవిత కాలంలో ఇంత మహత్తర గౌరవం పొందటం అరుదు. ఈ సంపుటిలోని కొన్ని గేయాలను స్వరపరచి, సంగీత నాట్యరూపాల్లో మలిచి, సినిమాల్లో చేర్చి ఆదరించారు లోకులు

ఈ మహత్తర సాహితీ రూపాన్ని గురించి కొంత విస్తరంగా చర్చించటం అభిలషణీయం. గ్రంథాంతంలోని అంకితభాగం కాక సంపుటంలో 40 కవితలున్నాయి

మొట్టమొదటి గేయం పేరునే సంపుటికి శీర్షికగా ఉంచాడు. అదొక కవాతు పాట. అది శిష్ట్లా ఉమామహేశ్వరరావు గేయం 'మారో! మారో!' కు పోటీగా రాసింది కాకపోవచ్చు. ఎడ్గార్ అలాన్‌పో రాసిన 'ది బెల్స్' గేయాన్ని చదివి ఆవేశపడి రాసిందది. అందులో ''కదం త్రొక్కుతూ, పదం పాడుతూ, హృదంతరాళం గర్జిస్తూ... దారి పొడుగునా గుండె నెత్తురులు తర్పణ చేస్తూ పదండి ముందుకు! పదండి త్రోసుకు!'' అని 'నెత్తురు మండే, శక్తులు నిండే'' సైనికులకు ఉద్బోధించాడు. ''మరో ప్రపంచపు కణకణమండే త్రేతాగ్ని''ని చూసి ''ఎర్రబావుటా నిగనిగలు'' గమనించి ముందుకుపొండనీ, మరో ప్రపంచం పిలిచిందనీ హెచ్చరించాడు ''హరోం! హరోం హర! హర! హర! హర! హర! హరోం హర!'' అని యుద్ధోత్సాహంతో కదలమన్నారు. త్రేతాగ్నులు, ప్రళయఘోషలు, ఎగిరిపడుతున్న మేరువులు, జల ప్రళయ నాట్యాలు, ధనంజయుడు, అగ్ని కిరీటం, హోమ జ్వాలలవంటి మత సంప్రదాయ ప్రతీకలను లౌకిక ప్రసంగాలుగా మలిచి ప్రయోగించాడు. ఆనాటినుంచీ నేటిదాకా వామపక్ష సభల్లోనేగాక తదితరాల్లోకూడా ఈ కవాతు పాట మారుమోగుతూనే ఉంది. తరువాతి కాలంలో సుప్రసిద్ధ రంగస్థల నటుడు బందా కనకలింగేశ్వరరావు పాడగా ఆపాటను చలనచిత్రీకరించారు.

రెండోగేయం వ్యక్తి నిష్ఠ భావన అనిపించే ''ఐ''. అందులో తానే ఒక భూతమనీ, యజ్ఞోపవీతమని, వైష్ణవ్యగీతమనీ చాటాడు. తాను ''స్మరిస్తే పద్యం, అరిస్తే వాద్యం, అనలవేదిక ముందు అస్ర నైవేద్యం''గా పరిణమిస్తాయన్నాడు. తన మహోద్రేకాలు భవభూతి శ్లోకాలవంటివనీ, పరమేష్ఠి జూకాలవంటివనీ ఘోషించాడు. గేయం చివర తనది అనితర సాధ్యమైన మార్గమని నిర్ద్వంద్వంగా నిరాఘాటంగా ఆత్మస్తుతి చేసుకున్నాడు. అది 'అనర్గళ' మని కూడా ప్రకటించాడు.

మూడోది 'జయభేరి'. ఆరంభంలోని తొమ్మిది పంక్తులనూ అంతంలో మార్చి రాశాడు. మొదట తాను చేసిన పనులను పేర్కొన్నాడు . 'నేను సైతం, ప్రపంచాగ్నికి, సమిధనొక్కటి ఆహుతిచ్చా''నన్నవాడు చివరకు 'నేను సైతం, ప్రపంచాబ్జపు, తెల్లరేకై పల్లవిస్తా'' నన్నాడు. అలాగే విశ్వసృష్టికి అశ్రువొక్కటి ధారపోసిన తాను విశ్వవీణకు తంత్రినై మూర్ఛనలు పోతానన్నాడు భువనఘోషకు వెర్రిగొంతుకలిచ్చి మోసిన తాను భువన భవనపు బావుటానై పైకి లేస్తానన్నాడు ''నాకుహూరుతశీకరాలే, లోకమంతా జల్లులాడే, ఆ ముహూర్తా లాగమిస్తా''యని తన భవిష్యదభ్యుదయాన్ని సూచించాడు. సాహితీ సభల్లోనేగాక రాజకీయ సమావేశాల్లో కూడా గేయం తొలి తొమ్మిదీ, చివరి తొమ్మిది పంక్తులూ నేటికీ ఉదాహృతమవుతున్నాయి.

నాలుగో గేయం ''అభ్యుదయం'. అందులో తనకు ఏవో ఘోషలు వినిపిస్తున్నాయన్నాడు. అవి ద్వితీయ ప్రపంచ సంగ్రామం నాటివి. అప్పుడింకిన

క్రౌవ్వొత్తులనుంచి, తెగిపోయిన విపంచికల నుంచి, మరణించిన యువయోధుల బలివితర్దినుంచి ''నరజాతికి పరివర్తన, నవజీవన శుభసమయం'' ఆసన్నమవుతాయన్న ఆశాభావం వెలిబుచ్చాడు. తరువాతి శీర్షిక 'అవతారం' మొత్తం గేయం పౌరాణిక ప్రతీకలతో నిండి నూతన శకాన్ని ఆరంభించటాన్ని సూచిస్తుంది. యముని మహిషపు లోహ ఘంటికలు, ఉదయ సూర్యుని సప్త హయములు, కనక దుర్గా చండ సింహం, ఇంద్రదేవుని మదపుటేనుగు, నందికేశుడు, ఆదిసూకర వేదవేద్యుడు తమ తమ స్వభావ లక్షణాలను ప్రదర్శించిన తరువాత - ఉత్పాతం జరిగినమీదట - ''పుడిమి తల్లికి, పురుటి నొప్పులు, కొత్త సృష్టిని స్ఫురింపించా''యని నిశ్చయించాడు. ప్రళయానంతరపు సృష్టి భావనకు ఆధునిక వ్యాఖ్యానం చేశాడు 'జ్వాలాతోరణం' ఆ తరువాతి గేయం క్రమంలో. అందులోనూ స్వర్గనరకముల ఛాయాదేహాళి ఉంది. చితాగ్ని కుండముంది. సమాధులున్నాయి. హిరణ్యనేత్రుని పదాఘాతం, క్రుద్ధ వృకోదరు గదాఘాతం, మిహిర వాజితతి, మఘువధనుర్ద్యుతి లేకపోలేదు ఈ పౌరాణిక ప్రతీకలన్నీ 'పుడమికి నేడే పుట్టినరోజట!' అనే చివరి పంక్తిలో నూతన ప్రపంచావిర్భావానికి పూర్వరంగంగా కనిపిస్తాయి.

'నవకవిత'ను అభివర్ణించే తరువాతి గేయం అందుకవసరమైన సంభారాన్ని వివరిస్తుంది. ఆధునిక కవితా రచనకు కావలసిన ఆలంబనోద్దీపనాల పట్టికగా భాసించే ఆ గేయంలో నవకవితా ధర్మాన్నీ వస్తువునూ శ్రీశ్రీ విశదీకరించాడు. గేయ పంక్తులు ఎర్రగా, ఘాటుగా, భయంకరంగా, హృదయ విదారకంగా, నిర్భేదకంగా, వినాశకరంగా, అనర్గళంగా ఉండే వస్తువులను పేర్కొన్న తరువాత చివరకు నవకవిత్వానికి ప్రధానమైన లక్షణాలను వ్యంగ్యంగా నిరూపించాయి సింధూరం, రక్త చందనం, బంధూకం, రుద్రాలికనయన జ్వాలిక, ఘాటెక్కిన గంధక ధూమం, రగులుకొనే రాక్షసిబొగ్గు, రాంబందుల రెక్కల చప్పుడు, హరీంద్రగర్జన, పయోధర ప్రచండ ఘోష, ఖడ్గమృగ విరావం, ఝంఝానిలం మొదలైన లక్షణాలతో ''కదిలేదీ కదిలించేదీ, మారేదీ మార్పించేదీ, పాడేదీ పాడించేదీ, పెనునిద్దర వదిలించేదీ, మునుముందుకు సాగించేదీ, పరిపూర్ణపు బ్రతుకిచ్చేదీ, కావాలోయ్ నవకవనానికి'' అని సులభ సుందర భాషలో విడమర్చి చెప్పాడు. అంతకు ముందున్న చరణాల్లోని గాఢ గంభీరత వీటిలో సుకుమారంగా మారింది అంతకు ముందెవ్వరూ కవితా లక్షణ వర్ణనకు ఇటువంటి సామగ్రి నెన్నుకోలేదు. చివరికింత మృదువుగా కవితాగుణాలను విశదీకరించనూ లేదు ఈ గేయ రచనా కాలానికి విశ్వనాథ దేవులపల్లుల భావకవితా సౌందర్య భావనల ప్రభావం అడుగంటిపోయి, తానే ఆధునిక కవితా మార్గ దర్శకత్వం వహించి పథ నిర్దేశం చేస్తున్నాడని స్పష్టమవుతున్నది. అతడి అభివ్యక్తి విధానంలోని ఆవేశం, ప్రయోగించిన పదజాలం, శబ్ద మాధుర్యం పాఠకులనూ, శ్రోతలనూ ఆకట్టుకొంటాయి. ఆశ్చర్యచకితుల్ని చేస్తాయి. తరవాతి గేయమైన 'సాహసి'లో

తమ తమ మనోభావాలను తమలోనే దాచుకొని సుప్త భుజంగాలవంటి ప్రజల గుండెల్లో మంటలు పుట్టించవద్దంటాడు. అది ప్రమాదకరమంటాడు 'కళారవి' అనే తరువాతి గేయంలో ఎన్ని కష్టనష్టాలూ, కోపతాపాలూ వచ్చినాసరే కవి తన నిర్దిష్ట మార్గంలోనే ప్రయాణించాలనీ ఉద్బోధిస్తాడు. సాధారణ కవులకు హితబోధగా ఆమీదట 'ఋక్కులు' పలికాడు. సృష్టిలో ఏదీ కవితకు అనర్హం కాదన్నాడు కవితాశిల్పం దేనినెలాగయినా మలచగలదంటాడు. ''శోభాలేశం దొరికినా ప్రపంచంలో రసనిర్దేశం చేసి కవితావేశంలో రాయమన్నాడు. ''కాదేదీ కవిత కనర్హం!, ఔనౌను శిల్పమనర్ఘం... ప్రపంచమొక పద్మవ్యూహం, కవిత్వమొక తీరని దాహం'' అని నిర్ధరించాడు. ఇవి వేదమంత్రాలవంటి సూక్తులు కాబట్టి ఋక్కులని పేరుపెట్టాడు. ఈ నాలుగు పంక్తులూ సాహితీ పరుల నాలుకల మీద నిలిచిపోయాయప్పటినుంచీ. ఈవిధంగా ఈగేయ సంపుటిలో తన ఆలోచనా ధోరణినీ కవితాదర్శాన్నీ తత్ప్రయోజనాన్నీ నిరూపించిన తరవాత కవితారాధన ఆరంభించాడు.

''కవితా! ఓ కవితా!'' అనే గేయం నిస్సందేహంగా అతడి గేయాల్లో ఉత్తమోత్తమం. కవితా రూప సాక్షాత్కారంలో అతడు అద్వితీయ ప్రతిభా పాటవాలను ప్రదర్శించాడు సణుగుతూ గొణుగుతూ తన సహజ ధోరణిలోనే నవ్యసాహిత్య పరిషద్వేదికమీద నిలబడి ఈ గేయాన్ని శ్రీశ్రీ చదివినప్పుడు కూడా సభాధ్యక్షుడైన విశ్వనాథ సత్యనారాయణ ఆర్ద్ర నయనాలతో ఆమూలనుంచి ఈ మూలకు నడిచి కౌగలించుకొని ప్రస్తుతించాడంటే ఈ గేయంలోని కవితాగుణాన్ని వేరే వ్యాఖ్యానించనక్కర్లేదు ఎన్నడూ ఎవరినీ - అందులోనూ సాటికవులను - ప్రశంసించే స్వభావంలేని విశ్వనాథ, చిల్లరమల్లర జనం మెప్పులను ఖాతరు చేయని వ్యక్తి. అటువంటివాడు ముగ్ధుడై తానే దీన్ని ప్రచురిస్తానంటూ నీవు పీఠిక రాయమని చలాన్ని కోరుతూ మరో ప్రసిద్ధ కవి చింతా దీక్షితులద్వారా కబురుపెట్టడమే విడ్డూరం ఈ మహారచనలో శ్రీశ్రీ తనది 'అనితర సాధ్యమార్గ'మన్న మాటను దక్కించుకున్నాడు. తరువాత కాలంలో తానే స్వయంగా ఈ గేయాన్ని శ్రీశ్రీ అనువదించాడు. మూలం తనదే అయినా, దాని మూలస్వభావాన్నీ ఆత్మనూ ఆవిష్కరించలేకపోయాడు. అతడి అనువాదాన్ని అనుబంధంలో చూడవచ్చు

కవిత అందని అందమని భావించి చిరదీక్షాశిక్షా తపస్సమీక్షణ చేశానన్నాడు. తనకు చిత్ర విచిత్రశ్యమంతరోచిర్నివహం కనిపించిదన్నాడు. నక్షత్రాంతర్నిబిడ గానం, విప్లవం, యుద్ధం, అన్నీ కవితా చైతన్యంగా విశ్వరూప సాక్షాత్కారం పొందానన్నాడు. కవితను స్మరిస్తే అగ్ని సరస్సున వికసించిన వజ్రం, ఎగిరే లోహశ్యేనం, ఫిరంగిలో జ్వరం ధ్వనించే మృదంగనాదం, జవరాలి మనః ప్రపంచపుటావర్తాలు, రోగార్తుని రక్తనాళ స్పందన, త్రాగుబోతు వ్యక్తావ్యక్తాలాపన, భయంకర బాధల పాటలపల్లవి, ఆకటి చీకటి చిచ్చుల హాహాకారం, ఒకలక్ష నక్షత్రాల మాటలు, శతకోటి సముద్ర తరంగాల మ్రోతలు వినిపించాయన్నాడు.

తన అనుభూతులను విన్నవించాలంటే ''అవి పుంఖాను పుంఖాలుగా, శ్మశానాలవంటి నిఘంటువులదాటి, వ్యాకరణాల సంకెళ్లు విడిచి, ఛందస్సుల సర్ప పరిష్వంగం వదలి వడిగా, వడివడిగా వెలువడినై పరుగిడినై'' అని విశదీకరించాడు. తనకు నాదబ్రహ్మపు పరిచుంబనలో క్షణికమై శాశ్వతమైన దివ్యానుభవం కలిగిందన్నాడు నా రచనలో లోకం ప్రతిఫలించి, నా గీతం గుండెలలో ఘూర్ణిల్లగ నా జాతి జనం పాడుకోవాలనీ, నానుడి నీ గుడి కావాలని, నా గీతం నీకు నైవేద్యం కావాలని కవిత నుద్దేశించి నివేదించాడు తన అభిరుచులను, అభిలాషలను, ఆదర్శాలను, బలహీనతలను సమాహార ద్వంద్వంగా లక్షించి ఈవిధంగా వర్ణించటం తెలుగు సాహిత్య చరిత్రలో అపూర్వం. ఆలంకారికులు చెప్పిన విశ్వశ్రేయో భావనకూ రుషికానివాడు కవికాలేడనే సిద్ధాంతానికీ శ్రీశ్రీ ఈరూపంలో చెప్పిన మహాభాష్యం పాఠకులను అప్రతిభులను చేస్తుంది. కఠోర విమర్శకుడి శిలాసదృశ హృదయాన్ని కూడా కరిగిస్తుంది కవి నామవాచ్యుణ్ని నీరుగారుస్తుంది. సాహితీపరులను దిగ్భ్రాంతులను చేస్తుంది కనీసం వేయి సంవత్సరాల చరిత్ర ఉన్న తెలుగు సాహిత్యంలో కవితను ఇలా నిర్వచించి, ఇంత కవితాత్మకంగా వర్ణించి, ఇంత అద్భుత సృష్టిచేసిన మరోకవి లేనే లేడు. ఇదే అతణ్ణి సాహితీ శిఖరాగ్రాన నిలిపింది

సంపుటిలో తరవాతి గేయం 'ప్రతిజ్ఞ'. అబ్బూరి సమకూర్చిన లండన్ అభ్యుదయ రచయితల మేనిఫెస్టోను చదివి 1937లో కవితారూపంలో శ్రీశ్రీ ఈగేయాన్ని రచించాడు. మేనిఫెస్టోలోని విషయాలు అతడి మనసు మీద చెరగని ముద్ర వేశాయి. అతడు తన స్వభావోచితంగా దాని మూలభావాలను కవితగా మలిచాడు. ఆ సమయంలో అతడే తరవాతి కాలంలో చెప్పినట్లు జాన్ ఎడ్వర్డ్ మాన్‌ఫీల్డ్ (1878-1967) రాసిన నావికుల మాండలికంలోని సాల్ట్‌వాటర్ బలాడ్స్ (1902)తోబాటు అతడే రచించిన 'ఎ కాన్‌స్క్రిప్షన్'' అనే కావ్యమూ, రడ్యార్డ్ కిప్లింగ్ (1865-1936) రాసిన 'బ్యారక్ రూం బలాడ్స్' (1892) అనే గీతాలూ అతడి మనసులో లోతుల్లో మెసలుతున్నాయి. ఫలితంగా ప్రతిజ్ఞ తన గురువునే అలరించింది. ప్రచురితమైన మరుక్షణంనుంచీ సాహితీపరుల మనస్సులనే దోచుకుంది. గేయచ్ఛందస్సు కదిలింఛి కుదిలించి ఊపుతుంది. కర్షకవీరుల కాయంనిండా, కాలువ కట్టే ఘర్మజలానికి, ధర్మజలానికిగాని కార్మిక ధీరుల విలాపాగ్నులకు, విషాదాశ్రువులకుగాని ఖరీదు కట్టే షరాబు లేడని తేల్చాడు. అటువంటి అభాగ్యులంతా, అనాథులంతా, అశాంతులంతా, దీర్ఘ శ్రుతిలో, తీవ్రధ్వనితో, విప్లవశంఖం పూరిస్తారన్నాడు. త్రిలోకాలలో శ్రమైక జీవన సౌందర్యానికి సమానమైనది లేనేలేదని బల్లగుద్ది చెప్పాడు. వ్యధార్త జీవిత యథార్థ దృశ్యం, పునాదిగా ఇక జనించబోయే, భావి వేదముల జీవనాదములు, జగత్తుకంతా చవులిస్తావోయ్ అని ప్రకటించాడు. తాను నవీన రీతిలో రాయబోయే నవీనగీతికి సహస్ర వృత్తుల సమస్తచిహ్నాలూ ప్రాణమన్నాడు. తన భావి రచనలే నవీన వేదవాక్యా లవుతాయన్న ఆత్మవిశ్వాసం ప్రదర్శించాడు. ఈ

ఛందశ్శిల్పాన్ని స్వరపరిచారు పాడారు. నాటకీకరించారు. డ్యాక్టర్ సంపత్ అనే ప్రసిద్ధ నర్తకుడు ఈ గీతం ఆధారంగా నృత్య విధానమొకటి పరికల్పించాడు. ఈ గేయ భావాలకు విలువ ఉన్నంతకాలం, ఈ రచనాశిల్పం శ్రోతలనూ, పాఠకులనూ ఆకట్టుకోగలిగినంత కాలం శ్రీశ్రీ సజీవంగా ఉంటాడు శ్రమ జీవన గౌరవ సౌందర్యాలకు అతడు విలువ కట్టిన విధానం తెలుగు సాహిత్యంలో అపూర్వం.

ఆ తరువాత చిన్న చిన్న గేయాల్లో అట్టడుగు వర్గాల విషాదమయ జీవితాలను వర్ణించాడు అంతకు ముందెన్నడూ వారి దీన గాథలకు కవితలో స్థానం ఉండేదికాదు. 'బాటసారి' గీతంలో దారితప్పిన బాటసారి కళేబరంతో శీతవాయు వాడుకుంటుంటే పల్లెటూళ్లో అతడి తల్లికి వచ్చిన పాడుకలలో పేగు కదలటం ఇతివృత్తం అతడి జీవితాన్ని వేగుచుక్క వెక్కిరించిందేగానీ సానుభూతి చూపలేదు. తరువాతది 'భిక్షు వర్షీయసి'. తనకన్నా శవం నయమనిపించేట్లున్న ముసలిది మరణిస్తే ఆ పాపమెవరిదని వెర్రిగాలి ప్రశ్నించింది. ఎముక ముక్క కొరుక్కుంటున్న కుక్క ఏమీ అనలేదు. ఒక ఈగను పడవేసుకొని తొండ పారిపోయింది. ఎగిరి వచ్చిన ఎంగిలాకు మాత్రం ఇది నా పాపం కాదన్నది. వాడిన భాష, వర్ణించిన దృశ్యం, కథావస్తువూ, ఆ విషాదగాథా గుండెలు కరిగిస్తాయి. ఆమీదట కనిపించే 'ఉన్మాది' తిండిలేక తూముపక్కన ధూళిలో తూలిపోతూ కూడా వెకిలిచూపులు చూస్తున్నాడు, కూనిరాగాలు తీస్తూ అతడికి జరిగిన దురన్యాయం అటుంచి అతడి ప్రవర్తన సభ్యసమాజాన్ని వేళాకోళమాడుతున్నదని కవి దుఃఖించాడు. ఆ తరువాతిది 'చేదుపాట' ఇందులో కవి వేదాంతులనూ, మాయావాదులనూ వెక్కిరిస్తాడు, జగత్తులో సుఖం లేదన్నందుకు. మనమంతా బానిసలమని వెనుక ముందుల్లో దగాపడుతున్నామని కుక్కల్లా, నక్కల్లా, సందుల్లో పందుల్లా బతుకుతున్నామనీ వాపోతాడు. అయినా వేదాంతులన్నట్లే ''బ్రతుకు ఛాయ, చదువు మాయ, కవిత కరక్కాయ సుమా!'' అని జీవఫలం చేదు విషమని బాధపడ్డాడు. ఇదే చలాన్ని నొప్పించిన గేయం వేదాంతులను వ్యంగ్యంగా అధిక్షేపించిన తరువాత ఒక విద్యార్థీ, ఒక సంసారీ ఎటువంటి సమస్యలతో తల్లడిల్లిపోతున్నారో వ్యంగ్యంగా 'సంధ్యా సమస్య'లనే గేయంలో ప్రస్తావిస్తాడు.

ఆ తరువాతి గేయాల్లో తన వ్యక్తి నిష్ఠమైన అనుభూతులవైపు దృష్టి మళ్లించాడు. 'దేనికొరకు' అనే గేయంలో ప్రపంచమంతా నిద్రాణంగా ఉండగా నీవెందుకిలా తపిస్తున్నావని తన్ను తానే ప్రశ్నించుకుంటాడు 'కేక' అనే తరువాతి పాటలో తాను నిద్రకు వెలియై ఒంటరిగా చీకటిగదిలో తన చుట్టూ ఉన్న దౌర్భాగ్యాలను తలచుకొని బాధపడతాడు - ఓ మహర్షిలా 'ఒక రాత్రి' అటువంటిదే కానీ, దానిలోని భావనలు విచిత్రమైనవి బహుళ పంచమి జ్యోత్స్న పొగలాగా వ్యాపించి అతణ్ని భయపెడ్తుంది ఆకాశపుటెడారిలో ఇసుక తుఫాను రేగింది గడుసు దయ్యాలు గాలిలో ఈదుతున్నాయి సాగరం క్షోభిస్తున్నది. కొండ కరి కళేబరంలా కదలదు. ఆకాశపుటెడారిలో జాబిల్లి

కాళ్లు తెగిన ఒంటరి ఒంటెలాగుంది. వెన్నెల విశ్వమంతా నిండి వెలిబూడిదలాగుంది. ఇటువంటి రూపకోత్ప్రేక్షలు తెలుగు సాహితిలో ఇదే మొదటిసారిగా కన్పిస్తాయి. 'ఆకాశదీపం'లో ఉదయం ఆరున్నరకు ఆరిపోయాడో దురదృష్టజీవి. ఆరాత్రికి దీపమూ ఆరిపోయి తారగా మారిపోయింది సామాన్యుడి మరణం ఎవరికీ పట్టదని కవి చిత్రీకరణం 'అవతలిగట్టు' చావు బ్రతుకుల రంగుల నీడల్లోంచి ఆవలి గట్టుకు చేరాలనే తాత్విక ధోరణిని తలపిస్తుంది. 'పరాజితులు'లో స్వప్నం తొణికి, స్వర్గం తొలిగి మానవజాతి దుఃఖమయ ప్రపంచంలో ఉందంటాడు 'ఆః'లో ఒకరి అభివృద్ధికి ఆశ్చర్యపడేవాళ్ళే వారి నాశాన్ని పట్టించుకోరంటాడు. 'ఒక క్షణంలో' అనే గేయంలో మానవులెదుర్కొనే క్షణికానుభూతులను ప్రస్తావిస్తాడు 'నీడలు' అనే గీతంలో పేదవాళ్ల వాడల్నీ, నిర్భాగ్యపు నీడల్నీ గమనించమంటాడు.

'మహాప్రస్థానం'లోని తరవాతి శీర్షికల్లో శ్రీశ్రీ మానవతా భావాలపై దృష్టి మళ్లిస్తాడు - బహుశా తన కవితలో ఆకలీ అగచాట్లూ తప్ప మరేమీ ఉండవనే విమర్శను తట్టుకొనేందుకేమో 'శైశవగీతి' పసిపిల్లల అమాయకత్వాన్నీ, ఆటపాటలనూ వర్ణిస్తుంది. లోకపు భాగ్య విధాతలైన వాళ్లు ప్రకృతి శోభను గమనించాలంటాడు ఏకాంతంగా విచారంగా గతశైశవ రాగమాలిక లాలపించే తన్ను.చూస్తే నవ్వొస్తుందా అని ప్రశ్నిస్తాడు. ఈ పాటను నృత్యనాటికగా పరివర్తన చేశారు తరవాతి కాలంలో 'పేదలు' అనే తరవాతి గీతం బెల్జియన్ కవి ఎమిలీ వెర్హారన్ రాసిన లేస్ పావెర్స్ (Les Pauvres) కు అనువాదమని చెప్పకపోతే అది స్వతంత్ర రచన అనిపిస్తుంది. ఆ తరవాతి 'గంటలు' ఎడ్గార్ అలాన్ పో రచించిన 'ద బెల్స్' కు అనువాదం కాదని శ్రీశ్రీ స్పష్టీకరించాడు. ఈ గీతం కవి భావచిత్రాలను ప్రకటిస్తుంది. 'అద్వైతం' ఆ తరవాతది. అది అతడి రచనల్లో జనరంజకత్వం సంపాదించిన గేయాల్లో ఒకటి దాన్ని నృత్య నాటికగా, ఒక సినిమాలో నృత్యగేయంగా తరవాతి కాలంలో ప్రయోగించారు. ''ఎ.సి.స్విన్‌బర్న్'' తన రచనలలో ముఖ్యంగా ''ఎ మ్యాచ్'' అనే గీతంలో, చూపిన మార్గానికి కృతజ్ఞతతో'' అని గేయాంతంతో కవే రాశాడు. ప్రేమికులు భిన్నవిధాల పేర్కొనే అనుభూతులు కలిసి ఒక సహానుభూతిగా పరిణమించటం గీత పర్యవసానం. శ్రీశ్రీకి స్విన్‌బర్న్ (1837-1909) కవితమీద ఉన్న అభిమాన గౌరవాలను ''స్విన్‌బర్న్ కవికి'' అనే గేయం ప్రదర్శిస్తుంది. షెల్లీ కవనపు హల్లీసకమూ, ఫ్రెంచి గీతుల మంచి రీతులూ మోహినీ గంధర్వగానమూ ఆకవి పాటల్లో ఉన్నాయని శ్రీశ్రీ ప్రశంసించి అతడి 'గళన్మంగళ కళా కాహళహళాహళిలో' తాను కరిగిపోయానంటాడు. ఈ రచనలో శ్రీశ్రీ తనకున్న శబ్ద లౌల్యాన్నీ, అర్థాతిశాయి శబ్ద ప్రయోగ వాంఛనూ దిక్ప్రదర్శనగా చూపాడు.

జర్మన్ కవి బెర్ట్రాండ్ బ్రెఖ్ట్ (1898-1956) ప్రభావానికి లోబడి మార్క్స్ చరిత్రకు చేసిన వ్యాఖ్యానాన్ని కవితారూపంలో పెట్టిన గీతం 'దేశ చరిత్రలు'. తాను

మార్క్సిజాన్ని శ్రద్ధా తాత్పర్యాలతో అధ్యయనం చేయలేదనీ తనకా సిద్ధాంతంలో ఉన్న అవగాహనా, అభిమానమూ కవితల ద్వారానే కలిగాయనీ ఎన్నోసార్లు శ్రీశ్రీ ప్రకటించాడు. చరిత్రగతిలో మానవుడు స్వయంకృతంగా తెచ్చి పెట్టుకున్న పరమ దౌర్భాగ్యాలను వెతికి వెతికి ఈగీతంలో చేర్చాడు కవి. అందుకు ఎంపిక చేసుకున్న ఛందస్సూ, భాషా పరమశత్రువులైన విమర్శకుణ్నయినా వశీకరించుకుంటాయి. నరజాతి సమస్తం పరపీడా పరాయణత్వమనీ, పరస్పరాహరణోద్యోగమనీ, రణరక్త ప్రవాహాసిక్తమనీ, దరిద్రులను కాల్చుకు తినడమనీ కవి తీర్మానించాడు. బలవంతుడిదే రాజ్యమని చరిత్ర నిరూపిస్తుందన్నాడు. గతమంతా రక్తంతోనో, కన్నీళ్లతోనో కలుషమయిందన్నాడు. మహా హంతకులు కాలానికి కత్తుల వంతెన కట్టారన్నాడు. సామ్రాజ్యాలూ కృత్రిమచట్టాలూ ఇతరేతర శక్తులు లేస్తే పేకమేడల్లా కూలిపోయినవన్నాడు ''పరస్పరం సంఘర్షించిన, శక్తులలో చరిత్ర పుట్టెను'' అని సిద్ధాంతీకరించాడు. ఇకమీద పీడించే సాంఘిక ధర్మం సాగదన్నాడు. ఈ రాణీ ప్రేమ పురాణం, ఆముట్టడికైనా ఖర్చులూ వగైరాలు కాక ''ఇతిహాసపు చీకటి కోణం అట్టడుగున పడి కాన్పించని కథలన్నీ కావాలిప్పుడు'' అని నిలదీశాడు. సామాన్యుడి జీవనం, సాహసం తెలియాలన్నాడు. ఏ పరమార్థం సాధించామో ఆత్మశోధన చేసుకోవాలన్నాడు. ఇది అతడి రచనల్లో ఎంతో జనామోదం పొందిన గీతాల్లో ఒకటి. ఈ కవితకు మాచిరాజు దేవీప్రసాద్ (1922-1974) 'రహదార్ల చరిత్ర' అనే పేరడీ రాశాడు. రాకపోకలకు భూమార్గం అనువుగా లేనందువల్లనే హనుమంతుడు ఆకాశవీధిలో లంకానగరానికి చేరవలసి వచ్చిందని భాష్యం చెప్పాడు. ''ఇంకానా! ఇకపై సాగదు'' అనే గీతపంక్తి అన్నిరకాల రాజకీయ సమావేశాల్లో సభల్లో ఇప్పటికీ మారుమోగుతూనే ఉంది.

దేశచరిత్రల తరవాత సంపుటిలో కనిపించే శీర్షిక 'వాడు'. ఇది మామూలు భాషలో ఉన్నా సూటిగా కవిభావాలను వ్యక్తీకరిస్తుంది. ఇందులో మూడు భాగాలున్నాయి. అనేకుల శ్రమను ఒకడు దోచుకొని లాభపడితే, లాభపడేవాణ్నే సమర్థించే కర్మ సిద్ధాంతాన్ని వెక్కిరించేది మొదటిభాగం ఇతరుల బాధను పట్టించుకోని ఆచార పరాయణున్ని దూషించేది రెండోభాగం. జీవనాధారం చూపమనే శ్రామికుణ్నీ హింసించే దుర్మార్గాన్ని ప్రశ్నిస్తుంది మూడోభాగం. ఆ తరువాత 'మిధ్యావాది' అనే శీర్షిక కింద సమాజవాస్తవస్థితిని గుర్తించలేని, దోపిడీదారులనూ పెట్టుబడి దారులనూ సమర్థించే మాయావాదాన్ని ఖండించాడు. దరిమిలా 'వ్యత్యాసం'లో ఉన్నవారికీ, లేనివారికీ మధ్యగల తారతమ్యాలను విమర్శించాడు. సంపుటి చివరి భాగానికి చేరుకుంటుండగా అతడి భాష సులభత్వం సాధించింది చాలావరకు. మీ జీవితం వడ్డించిన విస్తరిలాంటిదని ధనికులను ఎత్తి పొడిచాడు. సంప్రదాయాన్నీ, స్వప్రయోజనాలనూ పరిరక్షించుకోడానికి వారెన్నో దారుణాలు చేస్తున్నారన్నాడు. సామాన్యులకన్నీ సమస్యలే, సందేహాలే అన్నాడు ''మాకు

గోడలు లేవు. గోడలను పడగొట్టడమే మాపని. అలజడి మా జీవితం. ఆందోళన మా ఊపిరి. తిరుగుబాటు మా వేదాంతం'' అని పీడితజనం తరఫున వారి నిర్ణయాలను వివరించాడు. మేం ముందుకు పోతుంటే ప్రపంచం మావెంటే వస్తుందని తేల్చి చెప్పాడు బాధలు లక్ష్యపెట్టనివాళ్లు మాతో, సుఖకాముకులు మీతో, వస్తారని స్పష్టీకరించాడు 'ఆశాదూత'లనే తరవాతి గీతిలో తన అభిప్రాయాలేవిధంగా నాలుగు దిక్కులకు వ్యాపిస్తాయో విపులీకరించాడు. ''మానవుడా!' అనే తరవాతి గేయంలో మానవుడు నిరంతాన్వేషణ పరాయణుడని కీర్తిస్తాడు ''నిజంగానే?' అనే గేయంలో మళ్లీ ఛందోబద్ధ రచనకుద్యమించి, దారుణ ద్వేషాగ్ని పెంచే దానవత్వం నశించి మానవాళికి నిజంగానే మంచికాలం రహిస్తుందా? అనే ప్రశ్న వేసుకుంటాడు. తన ప్రశ్నకు తానే సమాధానం చెప్తున్నట్లు 'గర్జించు రష్యా' అనే తరవాతి గీతంలో పతిత నిర్గతిక ప్రపంచత్రాతగా నీకోసం పరిపక్వంగా ఉన్న ప్రపంచాన్ని రక్షించటానికి రమ్మని సోవియట్ రష్యాను ఆవాహనం చేశాడు. సోవియట్ విమానదళం ద్వితీయ ప్రపంచ సంగ్రామ రంగాన్ని ప్రవేశించిన విషయం తెలిసిరాసిందీ గీతం క్రాపోత్కిన్ రాసిన 'యాన్ అపీల్ టు యూత్' అనే గేయం తనను ఉత్తేజపరచగా ఈ గీతం రాశానని దరిమిలా శ్రీశ్రీయే చెప్పాడు.

ఈ మహాప్రస్థాన సంపుటిలో చిట్టచివరి గీతం 'జగన్నాధుని రథచక్రాలు'. ఇందులో శ్రీశ్రీ దళిత తాడిత పీడిత ప్రజానీకానికి ధైర్యం చెప్పాడు. జగన్నాథ రథచక్రాలు బయల్దేరాయని, సింహాచలం కదిలిందని, హిమాలయం కరిగిందనీ, వింధ్యాచలం పగిలిందనీ పతితులూ, భ్రష్టులూ, బాధాసర్పదష్టులూ అయిన దగాపడిన తమ్ములందరినీ అవి కాపాడుతాయనీ నమ్మబలికాడు ఇక హింసనచణ ధ్వంస రచనా, ధ్వంసనచణ హింసరచనా తప్పవన్నాడు. ఈ సవన ఫలితంగా సమర విజయంతో స్వాతంత్ర్యం, సమభావం, సౌభ్రాత్రం, సౌహార్దం పునాదులుగా శాంతియుతమైన నూతన రాజ్యముద్భవిస్తుందని హామీ ఇచ్చాడు. ఇక్కడితో మహాప్రస్థానం సమాప్తం.

''కొంపెల్ల జనార్దనరావుకోసం'' అని అంకితగేయానికి శీర్షిక పెట్టాడు. సంప్రదాయ కవితలో అంకితాంక పద్యాలు మొదట ఉంటాయి మహాప్రస్థానంలో చివర ఉన్నాయి సామాజిక రాజకీయ సిద్ధాంతాల్లో కృతికర్తకూ భర్తకూ పొంతన లేనేలేదు. కొంపెల్ల పరమ సనాతనవాది. ప్రవర్తనలో ఛాందసుడు కానీ భిన్న ధ్రువాల్లా వాళ్లు పరస్పరం ఆకర్షితులైనారు. శ్రీశ్రీ భావకవితా రూపంలో సంప్రదాయ ఛ్చందస్సులో ప్రచురించిన తొలికావ్యం ప్రభవను మొదట విమర్శించినవాడు కొంపెల్లే. శ్రీశ్రీకి అర్థంమీదకన్నా దీర్ఘ సమాస కల్పనలోనే మోజెక్కువ అని అధిక్షేపించినదీ అతడే. తరువాత వారిద్దరూ అనేక సాహితీ సభల్లో కలిసిమెలిసి తిరిగారు. మద్రాసులో ఇరుగుపొరుగున మిత్రులుగా కాపురమున్నారు. కొంపెల్ల 'ఉదయిని' అనే సాహితీ పత్రికను స్థాపించి ఆరుసంపుటాల కన్నా వెలువరించలేకపోయాడు. సాహిత్యానికి జనాభిమానం సంపాదించాలనే

మహదాశయంతో రాత్రింబవళ్లు కృషి చేశాడు. పత్రికను కొనమని వాడవాడలా బిచ్చమెత్తాడు అతడి శరీరారోగ్యంతోబాటు పత్రిక ఆయుర్దాయం కూడా ధ్వంసమయింది. ఆనాటి ఆధునిక కవులు స్థాపించుకున్న నవ్యసాహిత్య పరిషత్తు తరపున 'ప్రతిభ' అనే సాహితీ పత్రిక వెలువడి ప్రజారంజకమై 'ఉదయిని' పత్రిక మూసివేతకు దారితీసింది. ముద్రణ వ్యయం కొంపెల్ల భరించలేకపోవటంతో ముద్రాపకుడు ఉదయిని ఏడో సంచికను చిత్తుకాగితాల కింద అమ్మిపారేశాడు. గుండెబద్దలై, క్షయవ్యాధి పీడితుడై దరిద్రస్థితికి వచ్చిన కొంపెల్ల ఏనాటికయినా సాహితీ పత్రికలు అమ్ముడుపోవాలని ఆశిస్తూ, అంగలారుస్తూ, దీనస్థితిలో కన్నుమూశాడు. అతడి చివరికోరిక శ్రీశ్రీని కదిలించింది. అంకితంచేసి ఆగీతాన్ని మహాప్రస్థానం చివర అనుబంధంగా ప్రచురించాడు. (సదరు ప్రతిభ సంపాదకవర్గంలో ఒకడైన శ్రీశ్రీ తన పాపాన్ని ఈవిధంగా ప్రక్షాళన చేసుకొన్నాడనవచ్చు). అనాదరణతో అలక్ష్యంతో సాహితీ ప్రపంచం ఒక్కటిన్నీచేసి వేధించి బాధిస్తే వెక్కివెక్కి ఏడుస్తూ 'దొంగలంజకొడుకు లసలే మెసలే ఈ, ధూర్తలోకంలో నిలబడజాలక, తలవంచుకొనే' కొంపెల్ల మహాభినిష్క్రమణం చేశాడని శ్రీశ్రీ ఆరోపించాడు. తామిద్దరూ ఎప్పుడెక్కడ ఎలా కలిసి తిరిగారో 'సాహిత్యమే సమస్తము అనుకొని' ఎలా కష్టాలు పడ్డారో స్మరించాడు కొంపెల్ల మరణిస్తే ఆరేడుగురు తప్ప ఎవరూ దుఃఖించలేదన్నాడు ''నీవేమైపోయినా మా బురఖా మేం తగిలించుకున్నాం!, మా కాళ్లకు డెక్కలు మొలిచాయి మా నెత్తికి కొమ్ములలాగే'నని ఆత్మనింద చేసుకున్నాడు. ''నిన్న వదలిన పోరాటం, నేడు అందుకొనక తప్పు''దని ఉద్ఘోషించాడు. నిన్ను ఆవాహన చేసి కదనశంఖం పూరిస్తున్న నాలో ఆవేశించమని కృతిభర్తను అభ్యర్థించాడు. నిన్న వదలిన పోరాటమనే పంక్తులు ఎవరెవరితో సంఘర్షిస్తున్నా సొంత మాటలుగా వాడుకొనేంతగా ప్రజల నాలుకలమీద నిలిచిపోయాయి

చలం తన 'యోగ్యతాపత్రం'లో ''సులభంగా, సూటిగా చెప్పేసి, ఇంత ధ్యానానికీ, మౌనానికీ, విజయాలకీ, వ్యవధి నివ్వరాదా అని చెలం కోరిక. ఆ పని స్త్రీలూ చెయ్యరు, దేశ నాయకులూ చెయ్యరు, కవులూ చెయ్యరు - ఎంకీ, శ్రీశ్రీ తప్ప. కవిత్వంలోనూ జీవితంలోనూ economy of words and thoughts లేకపోవడం దేశభక్తికన్నా హీనమైన పాపం'' అన్నాడు. ''కృష్ణశాస్త్రి బాధ ప్రపంచానికి బాధ. ప్రపంచపు బాధ అంతా శ్రీశ్రీ బాధ'' అని వ్యాఖ్యానించాడు, వారి కవితా మార్గాలను. ''కొద్దిరోజుల్లో నేడు విర్రవీగే కవులు ప్రతి ఒక్కరూ శ్రీశ్రీ నీడ కింద నుంచుని తమ ఉనికిని సమర్థించుకోవలసిన గతివొస్తుంది'' అని జోస్యం చెప్పాడు ఆ మాట చాలావరకు నిజమయింది. 'నెత్తురూ కన్నీళ్లూ తడిపి కొత్తటానిక్ (Tonic) తయారుచేశాడు శ్రీశ్రీ యీ వృద్ధ ప్రపంచానికి'' అని కూడా చలం చెప్పాడు. ''రాంబందుల రెక్కల చప్పుడు, పయోధర ప్రచండ ఘోషం, ఝుంఝూనిల షడ్జధ్వానం'' విని తట్టుకోగల చావ వుంటే ఈ పుస్తకం తెరవండి'' అని

కూడా హెచ్చరించాడు. ఈ రూపంలో ఇటువంటి గ్రంథ పరిచయంతో మహాప్రస్థానమనే పేరిట మొదటిసారి అచ్చయిన ఈ గేయ సంపుటి తెలుగు సాహిత్యం గర్వించదగ్గ మహాకావ్యం.

## ఇతర కావ్యాలు

1940-1945 మధ్యకాలంలో రాయగా 1966లో మొదటిసారిగా అచ్చయిన మరో శ్రీశ్రీ కవితా సంపుటి 'ఖడ్గసృష్టి'. ఇందులో అతడి అధివాస్తవిక రచన అనువాదాలూ (తరవాతి కాలంలో పూర్తిచేసిన) అసంపూర్ణ కావ్యం 'సదనత్సంశయం' ఉన్నాయి. దీనికి సాహిత్య అకాడమీ పురస్కారమూ రూ 8,000ల సోవియట్ ల్యాండ్ నెహ్రూ బహూకృతీ లభించాయి సంపుటిని సరిగా సంకలనం చేయలేదు రచనలు కాలక్రమానుసారంగా లేవు. ఇది శ్రీశ్రీకి కమ్యూనిజంలో ఉన్న నిబద్ధతకు అద్దంపడ్తుందేగాని, అక్కడక్కడ తప్ప మహాప్రస్థాన గీతాలతో పోలిస్తే దీని కవితాస్థాయి చాలా తక్కువ. ఈ రచనలనాటికి అతడి భాష సులభీకృతమయింది ఛందోధికారం పరాకాష్ఠకు చేరుకొంది. అతడనేక భావాలు బండగా వ్యక్తీకరించాడు. వాటిని విరసం కవులూ వామపక్ష రాజకీయ కార్యకర్తలూ తరచుగా ఉదాహరిస్తుంటారు.'' అహింస ఒక ఆశయమేకాని, ఆయుధం ఎప్పుడూ కా''దని తొలి ఖండిక 'ఖడ్గసృష్టి'లో తెగేసి చెప్పాడు. ''అణవ శక్తి కన్న, మానవశక్తి మిన్న'' అని సూత్రీకరించాడు. 'శరచ్చంద్రిక'' అనే మలిగీతంలో ''అంతమందికీ అన్నీ తెలుసు, అదే మన అజ్ఞానం'' అని ఆక్షేపించాడు. కంచి మేక పాపం ఎప్పుడూ కసాయివాణ్నే నమ్ముకుంటుందని బాధపడ్డాడు. జాబిల్లికి మబ్బుతునక జేబురుమాలని ఉత్ప్రేక్షించాడు 'ఇవాళకంటే రేపే, ఎంతో బాగుంటుందంటాను నేను' అని అభిప్రాయం చెప్పాడు జాబిల్లి సముద్రం మీద చేసిన సంతకాన్ని గాలి చెరిపెయ్యకుండా కాలం కాపలా కాస్తుందని హామీ ఇచ్చాడు 'విషాదాంధ్ర' గీతికలో ''తీర్మానాలూ ఉపన్యాసాలూ చేశాం, ఖద్దరు కేకలూ వేశాం, మోసుకొచ్చాం స్వరాజ్యం మూట, మూట విప్పితే ఏమీలే''దని చప్పరించాడు. 'విశాలాంధ్రలో ప్రజారాజ్యం, మున్నుడి' అనే గీతికలు సాధారణ రచనలు. 'సదసత్సంశయం'లో 'ఈ విశాల జగతినుంచి, ఏమిటినే కోరినాను, ఒక జానెడు సానుభూతి, ఒక దోసెడు తిరుగుబాటు'' అని తనకామన ఏమో వివరించినాడు ''తధ్యం ప్రాణికి మృత్యువు, తప్పదు జీవికి వేదన'' అని స్పష్టం చేశాడు. ''ఔను - అహింసను పోలిన, పరమోధర్మమ్ము లేదు (పరమోధర్మం విరువకు, పరమ - అధర్మం అంటూ)'' అని శ్లేషించాడు ఆ తరవాత 'మహా సంకల్పం'లో ''మానవుడే నా సంగీతం, మానవుడే నా సందేశం'' అని నినదించాడు. ''కో ఈ హఁస్‌రహాహై, కో ఈ రోరహాహై'' అనే హిందీ శీర్షిక పెట్టిన వచన పద్యం ఆ తరవాతది. మానవ సమాజంలో భిన్నమార్గాలుండటం అనంతమన్నాడు. ''గాంధీజీ' అనే గేయంలో 'కురచిపోయిన సామ్రాజ్యాలకు, చిరిగిపోయిన జెండా చిహ్నం' అని కనిపెట్టాడు. 'మంచి

ముత్యాల సరాలు' అనే గీతిలో తాను రంగప్రవేశం చేసినప్పటినుంచీ భావ కవిత్వం మాటుమణిగించదనీ, విప్లవ కవిత ఉద్భవించిందనీ సూచించటానికి కొన్ని పదచిత్రాలు వాడాడు - 'నేను వెళ్ళిన నాటినుంచీ, నీడ లోపలి మేడ దిగదట, కోడిగ్రుడ్డు ప్రమాణకంగా, కృష్ణశాస్త్రిని చదవలేదట, నన్ను తిట్టిన తిట్లతోనే, మల్లెపూవుల మాలకట్టెను, నీకు రాసిన ప్రణయ లేఖలు, పోస్టు చేయుట మానివేసెను' అని మొదటి భావాన్ని ప్రపంచించాడు "ఇదే నా కడసారి సలహా, ఇలా తే నీ మనీపర్సుని, ఆంధ్రపత్రిక కప్పుకొని కా, రడవి కేగిందా రివాల్వర్" అనేది విప్లవకారుల అరణ్యవాసానికి సూచన. "ఏవి తల్లీ!" అనే గేయం F. విలాను రాసిన "The snows of Yester year' కు 'అనుసరణ'. 'ఏవితల్లీ నిరుడు కురిసిన హిమసమూహము' లనే మకుటం తరవాత పేరడీరూపంలో ఎన్నికల ప్రచారానికి పనికి వచ్చింది. గత వైభవ సంకీర్తనం అప్రస్తుతమని దేశభక్తిగీతాలు రాస్తున్న భావకవులకు బోధించే ప్రయత్నమిది. 'సామాన్యుని వేదన' అనేది తరవాతి శీర్షిక. అందులో "నరకం స్వర్గం అన్నవి, ఒక స్థితికే రెండుపేర్లు, ఫోకస్ భేదం అంతే, లోకన్ రెండింటికొకటే"నని నిర్ధరించాడు. 'రుబాయత్'లో రచనా కాలానికి తనకు నచ్చిన విషయాలను వివరించాడు మణి ప్రవాళ ధోరణిలో. శ్రీశ్రీ శాంతిలో అశాంతిని అశాంతిలోనే శాంతినీ, అనుభవించగలడంటూ 'భ్రమరగీత' రాశాడు - శబ్ద విన్యాసంతో 'బొమ్మలాంతరు' అనే గేయంలో 'తన చుట్టూ తాను తిరుగుతూ, సూర్యునిచుట్టూ పరిభ్రమించే భూమిలాగ, ఆశయం చుట్టూ తిరుగుతోంది ఆవేశం" అని ఆవిష్కరించాడు. "ఆఖరిమాట మొదట మాట!"లో తన ఆశయాలను ప్రతీకాత్మకంగా వర్ణించి తానే వివరణలు రాసుకున్నాడు! (సశేషం, బహుశా అని పేర్కొన్న) De-Compositions అనే అధివాస్తవిక కవితలో శబ్ద చిత్రాల ద్వారా తన భావాలను అస్పష్టంచేసి వదిలేశాడు. ఉదాహరణకొకటి . "కాకికేమి తెలుసు psychoanalysis?, ఆటవెలది ద్విపద కత్తగారు, 5,3,2 ఆముక్తమాల్యద; విశ్వదాభిరామ వినురవేమ, దీని భావమేమి తిరుమలేశ?)

"విదూషకుని ఆత్మహత్య"లో "నాందిలో భరతవాక్యం, మృత్యువులో సృష్టి, విదూషకుని ఆత్మహత్య" అని వ్యాఖ్యానించాడు. 'టాం-టాం' పూర్వకవుల పొగడ్తలందిన వాళ్లంతా చేటపెయ్యలనీ, వాజమ్మలనీ ప్రకటిస్తుంది. 'కొంటె కోణాలు' అనేది "ఛందో బందోబస్తులన్నీ, ఛల్! ఫట్ ఫట్‌మని త్రెంచి, damn it! ఏమిత్రా ఇదంటే, Pray! it's poetry అందాం" అని మొదలవుతుంది. "అర్థాన్ని అధ్వానపు అడవిలో వదలి, గద్యాన్ని పద్యానికి పెళ్ళి చేద్దాం, కాదన్న మాదన్న యెవడన్నా ఉంటే, వేమన్న యేమన్నాడో చూడమందాం" అని కొనసాగుతుంది "శ్రీనివాసరావు వ్రాస్తున్నది, మా నిషాద గీతంలో ఉన్నది" అని తెలుస్తుంది. చివరికిదంతా సర్రియలిజమని వివరిస్తుంది "ఎ ఏ ఐ ఒ ఓ ఔ" అనే రచన "గాలం వలె శూలం వలె, వేలాడే కాలం, వేటాడే వ్యాఘ్రం అది, వెంటాడును శీఘ్రం" అని నిర్వచిస్తుంది "అనేకం అయితే ఏకం, అదే వివేకం. వ్యక్తికి

బహు వచనం శక్తి. . ఒంటరితనం.. తుంటరితనం .. అజ్ఞానం చీకటికీ భయానికీ క్రౌర్యానికీ కాణాచి శాస్త్రం కళని చంపబోదు, జనాన్ని భయంతో నింపలేదు... ''వంటి ప్రసంగాలు చేస్తుంది. ''అభిసారిక కడసారి'' సుఖరోగి నుద్దేశించింది. ''ఒకటీ-పదీ''లో ఫస్టోబర్ (ఫస్ట్+అక్టోబర్) వంటి ప్రయోగం కనిపిస్తుంది ''మనః ప్రపంచానికి బాహ్య స్వరూపం భాష'' అని నిర్వచిస్తుంది ''నగరంలో వృషభం'' మనిషికైనా బుద్ధి ఉండాలని వాదిస్తుంది. ''అధివాస్తవికుల ప్రవేశం'' ధారాళమైన పద్యరచన అందులో ''కూర్చొని చేసిన పాపం గుడికట్టినా పోదు. ఛందస్సు (గాయత్రి సాక్షిగా చెబుతున్నాను) ఎటు తిరిగితే అటే ఒరుగుతుంది బహిరంగ రహస్యాలు బయట పెట్టడానికేమున్నాయి?. . కావలసినన్ని ఉపమానాలకి అక్కరలేనన్ని ఉపమేయాలు. .'' వంటి తీర్మానాలున్న రచన 'మాటల మూటలు' అతి వాస్తవిక రచనకు మొట్టమొదటి ప్రయత్నమట, 'ఎన్నాళ్లు ఇంకా'.

ఈ సంపుటిలోని అనువాదాల మూలకర్తలు గురజాడ, పాల్ ఎలువర్డ్ (1895-1952), గువలామీ అపోలినయిర్ (1880-1918), సాల్వదార్ దాలీ (1904), లూయిాన్ మసీన్, జేమ్సు జాయిన్ (1882-1941), ఆంద్రీ బ్రెటన్ (1896-1966), హెన్రీ మిఛా (1899- . . ), క్రిస్టోఫర్ లోగ్, డైలాన్ థామన్ (1914-1953), ఒడిసెన్స్ ఎలిటిన్, అలెగ్జాండర్ పుష్కిన్ (1709-1837), నికలాయ్ నెక్రసోవ్, వి మయకోవిస్కీ (1893-1930) అనేవాళ్లు. ఈ సంపుటిలోని అతివాస్తవిక రచనలమీద చాలా దుమారం లేచింది. సాహితీ పత్రికల్లో అవి ప్రచురితం కాగానే కఠోర విమర్శలూ, వెక్కిరింతలూ వచ్చాయి. అయినా కొందరు అనుకర్తలు బయలుదేరారు సమకాలిక సాహితీ ప్రపంచంలో వచ్చిన ధోరణులనూ ప్రయోగాలనూ చాలావరకు పునస్సృష్టిగానో, అనువాదంగానో, అనుకరణగానో, అనుసరణగానో పాఠకులకు పరిచయం చేసిన తెలుగు కవి శ్రీశ్రీయే.

పిల్లతనపు ప్రసంగాలకూ, విదూషకత్వానికీ శ్రీశ్రీ పెట్టింది పేరు. అది నిజమేనని స్వయంగా ఎన్నోసార్లు ఒప్పుకున్నాడు. దాపరికం లేని ఈ స్వభావమే అతడికి జనాకర్షణ సంపాదించింది. సమకాలంలోని రాజకీయ సామాజిక సాహిత్య పరిస్థితులను ఆక్షేపిస్తూ అతడెన్నో రచనలు చేసి, అది 'కార్టూన్ కవిత్వ'మన్నాడు. సాంప్రదాయికచ్ఛందస్సుల్లోనూ, తద్విరుద్ధమైన వచన కవితగానూ అతడు సృష్టించిన అధిక్షేప సాహిత్యం కూడా ప్రసిద్ధ రచనలంతగా పేరు తెచ్చుకున్నాయి వేళాకోళంలో కూడా అతడన్ని సమయాల్లో సరదాగానే ప్రవర్తించాడని చెప్పలేం 1953లో తెలుగు స్వతంత్రలో అతడి 'ప్రాసక్రీడలు' తొలిసారి వెలుగు చూశాయి. సమకాలిక రాజకీయాలనేగాక కవులను కూడా అందులో ఆక్షేపించాడు. అతణ్ని ఈ మార్గంలో అనుకరించిన వాళ్ళల్లో పెద్దయెత్తున రాజకీయాధిక్షేప రచనలు చేసింది గజ్జెల మల్లారెడ్డి (1922-1997). శ్రీశ్రీ అతణ్ని అభినందించాడు కూడా 1946 నాటి 'సిరి సిరి మువ్వ' సంప్రదాయ ఛందస్సులో రాసిన

పద్యగ్రంథం. ప్రతి పద్యమూ అదే మకుటంగా రాశాడు. ఆనందవాణి, ఢంకా, ఆంధ్రజ్యోతి వంటి సాహితీ పత్రికల్లో వెలువడ్డ తరువాత దానికి గ్రంథరూపమిచ్చాడు. అలాంటిదే ఆరుద్ర, వరదరాజేశ్వరరావులతో కలిసి రాసిన మరో గ్రంథం 'మేమే'. ఆరుద్ర సహరచయితగా సంప్రదాయ ఛ్చందస్సుల్లో వ్యావహారిక భాషలో రాసిన గ్రంథం 'రుక్కుటేశ్వర శతకం' (1943). జలసూత్రం రుక్మిణీనాధశాస్త్రికి అభినందనగా రాసిందిది. ప్రాసక్రీడల్లాగ్గా ఇతర రచనలు బాధాకరమో అగౌరవకారకమో కావు. తక్కినవి సరదాకు రాసినవి. తమాషాగా ఉంటాయి మహా అయితే హాస్యప్రదాలు ఈధోరణిలో తరవాత కాలంలో రాసిన 'లిమరిక్కులు' మాత్రం అసహనంతో తీవ్రభాషలో రాసినవి. తక్కిన చిన్న పుస్తకాలన్నిటినీ ఈ గ్రంథంలో చర్చించటం సాధ్యం కాదు.

శ్రీశ్రీ సదసత్సంశయం నిజానికి 1959లో రాసింది అసంపూర్తిగానే దాన్ని ఖడ్గసృష్టి సంపుటంలో చేర్చాడు. ''సంవేదన'' అనే సాహితీ పత్రికలో 1965 ఏప్రిల్ నుంచి కొనసాగింపు మొదలయింది. 1972లో దానికే సాహిత్య అకాదమీ పురస్కారం లభించింది. తనకూ విరసం వారికీ మధ్య కొంత వివాదానికీ దారితీసింది ఆలస్యంగా నయినా శ్రీశ్రీ ఆ పారితోషకాన్ని స్వీకరించటమే. తన సాహిత్య గుణాలకుగాక రాజకీయ ధోరణులకు చిహ్నంగా ఆ రచన సాహితీపరుల నాకర్షించింది

విరసం వారు ''సంక్షుబ్ద / నక్సల్‌బరీ / విరసం'' దశాబ్దంలో 'మరోప్రస్థాన' మనే గేయ సంపుటిని ప్రచురించారు 1980లో. ఆ సంస్థ శ్రీశ్రీ సంస్థాపకాధ్యక్షుడుగా 1970లో ఉద్భవించింది ఈ పద్య సంపుటిలోని భాషాశైలులు సులభతరాలు. అతడి వచన రచనలకన్నా ఇందులోని వచన కవిత పేలవం. గ్రంథం నిండా రాజీలేని రాజకీయ ప్రసంగాలున్నాయి. అక్కడక్కడ పచ్చి రాజకీయ భావాలను కవితాత్మకంగా, శక్తిమంతంగా పరమశ్రావ్యంగా పరివర్తించిన పాత శ్రీశ్రీ కవితా వైభవం కానిపిస్తుంది. 34 గీతాలున్న ఈ సంపుటిలో నిష్పాక్షిక విమర్శకుడు మెచ్చి ప్రశంసించగల పంక్తులు కొద్ది మాత్రమే. ఒక సుప్రసిద్ధ కవి కవితా శిల్పమనిపించని కేవల విప్లవ నినాదాత్మక రచన అనిపిస్తుంది మొదటిపాట ''యిప్లవం యాడుందిరా, ఆడనే నీకూడుందిరా, నీగూడుందిరా'' అని మొదలవుతుంది. 'తుది పయనం, దాని విజయ'మనే ఒక గీతంలో ''ఊగరా, ఊగరా, ఊగరా ఉరి కొయ్యనే అందుకొని ఊగరా, ఉరికొయ్య అంటుకొని ఊగరా!'' అని తన అనుయాయుల నుద్బోధించాడు. గాంధీజీ నుద్దేశించి, 'ఓ మహాత్మా! ఓ మహర్షీ' అని రాసిన గేయంలో ''నీవు చూపిస్తున్న బాట, యథాస్థితికొక కంచుకోట, హింసతోనే సృష్టిపూస్తది, హింసతోనే మార్పు వస్తది'' అని ఖండితంగా చెప్పాడు. 'దూది పులిమీద పుట్ర' అనే పాటలో ''దొంగనోట్ల దొంగవోట్ల, రాజ్యం ఒక రాజ్యమా? లంచగొండి వెధవలిచ్చు, సాక్ష్యం ఒక సాక్ష్యమా?'' అని ప్రశ్నించాడు. ఇది వామపక్షాల వారి కతడందించిన గొప్ప నినాదమయింది. 'పంచరత్నా' లనే మరోసుదీర్ఘ రచనలో కవిగా

పూర్వ వైభవం చాటుతూ 'అదిగో చూడు చిన్నమ్మి, బతుకుతోంది తన ఒళ్ళమ్మి, ఆమె యింకిన సెలయేరు, ఇంకి పోదామె కన్నీరు'' అంటాడు అందులోనే ''మనిషికి మనిషే పగవాడు, గతమే అతనికి ఉరిత్రాడు'' అని ప్రవచించాడు ఈ సంపుటిలో అతడు రాసిన కొన్ని సినిమా పాటలూ, అలవాటు ప్రకారం అన్యభాషలనుంచి ఆంధ్రీకరించిన అనువాదాలూ ఉన్నాయి. ఉదాహరణకు చిలీ విప్లవకారుడు పాబ్లో నెరుడాగేయాలు కొన్నీ, స్పానిష్ విప్లవకారుడు రిజారే వెలాజో, క్యూబన్ వీరుడు ఛేగువేరా, టర్కిష్ కవి నజీం హైకుంత్, అంగోలా కవి ఆగోస్తీ నోవెతో, చైనాలో ప్రవాస జీవితం గడిపిన మాజీ మంగోలియన్ కవి వాంగ్ జాంగుల రచనలకు అనువాదాలున్నాయి.

## రేడియో నాటికలు

ఇంతకు పూర్వం ప్రస్తావించిన సుప్తాస్థికలతోబాటు శ్రీశ్రీ రాసిన పదకొండు రేడియో నాటికలు శిల్పానికీ, వచన పద్య రచనకూ ప్రసిద్ధాలు ఒంటరిబావి, భూతాల కొలిమి అనేవి సుప్తాస్థికల్లాగా కవితా గుణవంతాలు. గవేషణ, విదూషకుని ఆత్మహత్య, గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు, గుమాస్తా కల, మరో ప్రపంచమనేవి విప్లవభావ ప్రతిపాదికాలు. చతురస్రం, అనంతర యాత్ర, బలి అనేవి స్వప్న రచనలు.

ఒంటరి బావి సగానికి పైగా బావి వర్ణనతోనే నడుస్తుంది. ఆత్మహత్య చేసుకున్న పదేళ్ల అమాయిక బాలికమీది అపవాదు కథావస్తువు. భూతాల కొలిమి హతుడైన ప్రియుడు అంతిమ విశ్రాంతిలో ఉన్న శ్మశానానికి పోతున్న స్త్రీ మనోవేదన ఇతివృత్తంగా ఉన్నది. గవేషణలో యమదూతలు అయిదేళ్లు ముందుగా మానవుణ్ని మరోలోకానికి చేరుస్తారు అక్కడి న్యాయమూర్తి మృతశిశువు శరీరంలో ప్రవేశించమంటే మానవుడలాగే చేస్తాడు. మానవుడి శాశ్వతత్వాన్ని నిరూపించే కథనమిది. విదూషకుని ఆత్మహత్య ఒక నటుడి విషాదగాథ రచయితకున్న ఆత్మహత్యాధోరణికిది ప్రతీక అని కొందరు విమర్శకుల అభిప్రాయం. నిజజీవితంలో అప్పులపాలై విదూషకుడు విషం తాగి చస్తాడు. ఆత్మహత్య చేసుకోబోతూ అతడు రాసిన ఉత్తరం విషాద గంభీరం. అతడి పేరు గడియారం. కన్యాశుల్క మృచ్ఛకటికలనే రెండు మహానాటకాలకు విదూషకుడు ప్రతీక. అతడు ''బతికి చచ్చిపోయాను. చచ్చిబతికిపోయా''ననటంతో నాటిక ముగుస్తుంది గ్రామఫోను రికార్డుల తిరుగుబాటు బానిసల తిరుగుబాటుకు సంకేతం. సూత్రధారుడు రేడియోలో 'తుదిపలుకు' అనే రికార్డు నాటికను వేస్తుంటే నాలుగు రికార్డులు మోగనే మోగవు. ఒకటి తిరుగుబాటు చేస్తుంది డైరక్టరుకు తానే గొంతులు మార్చి మాట్లాడానని సూత్రధారుడు విన్నవించుకొంటాడు - పాత్రలు తిరుగుబాటు చేసినందువల్ల. గుమాస్తా కల నిజానికి మూడు కలలు. శ్రీ జె. కోనేటిరావు పంతులనే గుమాస్తాను రెండు భావాలు

పీడిస్తుంటాయి. ఒకటి అతడి భయం రెండోది అతడి ఆశ. అతడు మొదటి కలలో అమెరికాలో తన సన్మానసభలో మాట్లాడుతుండగా మెలకువ వస్తుంది. రెండోసారి జర్మన్ జలాంతర్గామికి అధిపతిగా విజయం సాధిస్తుండగా మేలుకుంటాడు. మూడోమారు స్వప్నసుందరితో ప్రేమగానం చేస్తుండగా కల చెదిరిపోతుంది. మొదటి కల విజ్ఞానానికి సంకేతమైతే, రెండోది సాహసానికీ, మూడోది సౌందర్యానికీ ప్రతీకలు. ఈ మాటలో ఏ ఒక్కదాన్ని సాధించటమూ అతడికి సాధ్యం కాదు ''అతని నిజమైన జీవితం ఒక స్వప్నం. అతడి స్వప్నం ఎన్నడూ సాధ్యంగాని అబద్ధ'మని కథ ముగుస్తుంది. మరో ప్రపంచం 21వ శతాబ్దిలో మానవుడి స్థితిని ఊహించి రాసిన నాటిక రంగస్థలం యువకవి మెదడు. రంగం సుప్తచైతన్యం. అప్పటిమనిషి ఆకుపచ్చగాజు బంతి లాగుంటాడు అతడి పేరు 'కనుపాప'. అతడు కాలంలో ఎటు కావాలంటే అటు ప్రయాణించగల సామర్థ్యం సంపాదిస్తాడు. అతడికి ఆకలి లేదు. భాష లేదు సూర్యకిరణాలనుంచి గ్రహించిన శక్తే అతడి ఆహారం. ఒక వ్యక్తి నుంచి మరో వ్యక్తికి ఆలోచనలు ప్రసరిస్తాయి నేరుగా. వ్యక్తులు సామూహికంగా ఆలోచిస్తారు - ఒకర్నొకరు అర్థం చేసుకుంటారు. ఆ కనుపాప అనే వ్యక్తి పొరపాటున గతంలోకి ప్రవేశించి సుప్త చైతన్య స్రవంతిలోనే ఉండటం ఇతివృత్తం.

చతురస్రానికి ''1+1=1'' అనే మరోపేరుంది అందులోనూ 21వ శతాబ్దిలోకి భవిష్యత్తులోకి ప్రయాణముంటుంది. ఆ ఊహాత్మక రచనలో కాలాన్నీ మరణాన్నీ జయించటం, మానసిక స్వాతంత్ర్య సాధన, అద్వైత భావన అనేవి కథానాయకుడి విజయాలు చతురస్రంలోని నాలుగు భుజాలూ కథలోని నలుగురు పాత్రలకు సంకేతాలు. ఒక బాహువు 70 సంవత్సరాల వైజ్ఞానికుడు అతడి పేరు జ్ఞానం. రాజ్యమనే రాజకీయ పాత్రకు 50 ఏళ్లు సౌందర్యానికి ప్రతీక అయిన కళ అనే పాత్ర పదేళ్ల పిల్ల సిరి అనే 30 సంవత్సరాల కవి కవిత్వానికి ప్రతీక. సిరి అంటే శ్రీ. ఇది విషమ బాహు చతురస్రం. 1999 డిసెంబరు 3వ తేదీన ఒక మానవుడు చంద్రలోకం నుంచి తెచ్చిన అమృతాన్ని సర్వమానవులకూ ఇంజక్షన్ రూపంలో పంచుతాడు. అందరూ 30 ఏళ్ల వాళ్లవుతారు. విషమబాహువు సమబాహువవుతుంది కథ రెండు రేఖలమీద నడుస్తుంది. ఒక భాగం సంభాషణాత్మకమయితే రెండోది రాజకీయం. చతురస్రం సమబాహువయిన తరవాత కవి కాలనిర్దేశం చేయడు కారణం కాలాన్ని జయించటం ''మానవుణ్ణి నేను సృష్టించలేదు; మానవుడే నన్ను సృష్టించా''డని కాలం గ్రహిస్తుంది. ఇదే సందేశం.

కాలం అంతా ఒకటేగాని అందరికీ ఒకటిగాదనేది 'అనంతర యాత్ర'లోని మూలాంశం. జీవిస్తున్న వారి కాలం వేరు. మరణించిన వారి కాలం వేరు ఈ భావనతో ఒక రైలు ప్రమాదాన్ని శ్రీశ్రీ నాటకీకరించాడు. సరళ, కాంతం అనే యిద్దరు మహిళలు రైల్లో ప్రయాణిస్తున్నారు. వారిద్దరి గడియారాలూ సరిగ్గా ఆరుదగ్గర ఆగిపోతాయి. తోటి

ప్రయాణికుడు రంగారావును వారు టైమెంత అని అడుగుతారు. అతడు గడియారం తీసేలోగా రైలు పడిపోతుంది. ప్రమాదంలో రంగారావు మరణిస్తాడు సూక్ష్మరూపంలో తిరుగుతున్న అతణ్ణి పుట్టబోతున్న శిశువు ప్రశ్నిస్తుంది 'బలి' నాటిక పౌరాణిగాథకు మరోరూపం. పాతాళంలోని నిర్జీవి బలి స్వర్గంలోని చిరంజీవి ఇంద్రుడు బలిని చూసి భయపడి ఇంద్రుడు పారిపోతాడు

ఈ నాటికల్లోని ప్రధాన లక్షణం తన సామాజిక రాజకీయ భావనలనూ సిద్ధాంతాలనూ ప్రచారం చేయటం. పాత్ర చిత్రణలో సహజత్వం కన్నా సాంకేతికత్వం ఎక్కువ, కవితాత్మకత అధికం

## వచన రచనలు

శ్రీశ్రీ వచన రచనల్లో 'చరమరాత్రి' పేరిట ప్రచురితమైన కథాసంపుటి విశిష్టమయింది అందులో కూడా తన భావాలనూ ఆదర్శాలనూ వ్యక్తీకరించటానికి అతడు వాడిన వచనం అక్కరకు మించినంత కవితాత్మకంగా సాగింది తన వచనం 'సింగిల్ పన్నా కవిత్వ'మని అతడే వర్ణించుకున్నాడు సాహితీ పత్రికల్లో భిన్నకాలాల్లో ప్రచురించిన వచన రచనలు 'వారం-వారం' అనే శీర్షికతో ఒక సంపుటిగా వెలువడ్డాయి 1945-1986 మధ్యకాలంలో పత్రికల్లో అప్పుడప్పుడూ ధారావాహికంగా కొనసాగి, అసంపూర్తిగా మిగిలి, అర్ధాంతరంగా ఆగిపోయిన ఆత్మకథ 'అనంతం' ఆకర్షణకరం ''ఆత్మహత్య చేసుకోవడపు అనేక పద్ధతుల్లో ఆత్మ చరిత్ర రాసుకోవడం ఒకటి'' అని అతడే విశదీకరించాడు నిజానికా రచనలో తనకు తాను బహిరంగ విమర్శ చేసుకున్నాడు. దాన్ని రచించి ప్రచురించిన పద్ధతివల్ల అతడు ఏక సమయంలో తనకూ తన జీవిత చరిత్ర రచయితలకూ సేవతోబాటు అపచారం కూడా చేశాడు కాలక్రమ రాహిత్యం, పునరుక్తి, విషయాంతర గమనం వంటివి శ్రద్ధాసక్తులతో చదివే పాఠకుణ్ణి గందరగోళంలో పడవేస్తాయి అదే సమయంలో దాపరికంలేని అతడి స్వభావం ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది సామాజిక రాజకీయ సాహిత్య విషయాల్లో అనేక ప్రశ్నల కతడిచ్చిన సమాధానాలు ''ప్ర.జ'' (ప్ర-శ్నలు, జ-వాబులు) లో దొరుకుతాయి. సంక్షిప్త రూపమైన 'ప్రజ' ఏక పదమైతే జనం; సంక్షిప్త రూపంలో ప్రశ్నోత్తరాలనే బహువచన రూపం

1934-1983 మధ్యకాలంలో 66 గ్రంథాలకు రాసిన పీఠికల్లో తనను తాను పరిచయం చేసుకున్నాడు ఇతర రచయితలను పరిచయం చేశాడు. కొందరు అభిమానులు అతడు రాసిన కొన్ని వ్యాసాలను తమ తమ రచనలకు పీఠికలుగా ప్రకటించుకున్నారు. తనకు మార్గదర్శకుడైన దేవులపల్లి రాసిన ఒక కావ్యానికి శ్రీశ్రీరాసిన పరిచయాన్ని దేవులపల్లి గ్రంథాలన్నిటికీ పీఠికగా అన్ని సంపుటాల్లోనూ ముందు చేర్చారు.

ఆరుద్ర కూనలమ్మ పదాలకూ శేషేంద్ర శర్మ ఋతుఘోషకూ శ్రీశ్రీ గేయరూపంలో పీఠికలు రాశాడు. 1936-1969 మధ్యకాలంలో అతడు రాసిన 20 విమర్శ వ్యాసాలు పేరు తెచ్చుకొన్నాయి. అతడి హాస్య వ్యంగ్య సంభాషణలనూ, చమత్కారాలనూ, చివరికతడు సిద్ధంచేసిన పజిల్స్‌నూ ఒకే సంపుటంగా ప్రచురించారు అతడి వచన రచనల్లో సర్వజనాకర్షణమైనవి అప్పుడప్పుడు నానావిధ ప్రశ్నలకు జవాబులిస్తూ అతడు తనను గురించీ ఇతరులను గురించీ చెప్పిన అభిప్రాయాలు. పరస్పర విరుద్ధ ప్రసంగాలతో ఎంత అరాజకంగా అవి ఉన్నాయో, అతడి వ్యక్తిత్వాన్నీ బుద్ధి నైశిత్యాన్నీ రకరకాల మార్పులతో అవి ప్రదర్శిస్తాయో వచ్చే ప్రకరణంలో పరిశీలిద్దాం

# అయిదో ప్రకరణం

## తనను గురించీ, ఇతరుల గురించీ

శ్రీశ్రీ కేవలం బహిర్ముఖుడు. తీవ్ర విమర్శలకూ పసితనపు మాటలకూ సమంగా ప్రసిద్ధుడు. దాపరికం లేనందువల్లా, అది హాస్య చమత్కార ప్రసంగమనుకొన్నందు వల్లా స్వపర భేదం లేకుండా కఠోర విమర్శలు చేశాడు ఈ వ్యక్తిగత లక్షణాలకు తోడు అనంత మనే శీర్షికతో అతడు రాసిన ఆత్మకథలో సాధారణ పరిస్థితుల్లో ఎవరూ ఊహించలేని ప్రసంగాలు కూడా చేశాడు. పైపెచ్చు అదో ఆత్మహత్యా మార్గమని అలా రాశానని సమర్థించుకున్నాడు! ఒక విధంగా చూస్తే అది అలాంటి ప్రయత్నమే. సమాచారాన్ని సందర్భ శుద్ధి లేకుండా సమకూర్చిన గ్రంథమది. ఒక్కోసారి సంఘటనలు కాలక్రమాను సారంగా ఉంటాయి. కానీ కొన్నిసార్లు అతడింకో అసందర్భ ప్రసంగంలోకి హఠాత్తుగా మారిపోతాడు. అనేక పునరుక్తులుంటాయి గాని అవి అన్ని విధాలా ఒకే రకంగా ఉండవు. రచనకు నాలుగు దశాబ్దాల పైకాలం పట్టింది అకస్మాత్తుగా ఆగిపోయింది. అనుకోకుండా పునరారంభమయింది. చాలావరకు అతడు తన జ్ఞాపకాల మీద ఆధారపడ్డాడు. అయితే ఏదో ఒక విషయం మీద సిద్ధాంత గ్రంథాల్లో లాగా నిదర్శనలు సమకూరుస్తాడు. ఎంతో మందికి ఎన్నో సార్లు భిన్న సమయాల్లో ఇంటర్వ్యూలిచ్చి తన అభిప్రాయాలనూ, తనను గురించీ ఇతరులగురించీ సొంత అంచనాలనూ చెప్పినపుడు కొన్ని పరస్పర విరుద్ధాలుగా కొన్ని పాత భావాలకు సమర్థకాలుగా వెలువడ్డాయి 1995లో 'ప్రజ' అని జనసమూహానికీ సంక్షిప్త సాంకేతికంగా ప్రశ్నలకూ జవాబులకూ ఒకే శీర్షికతో తన భావాలనూ అభిప్రాయాలనూ ప్రకటించాడు. వాటిలో ఇంచుమించు ప్రతి ఒక్కటీ చదివిస్తుందిగాని కొన్ని సార్లు వివాదాస్పదంగా, మరి కొన్నిసార్లు పూర్వాభిప్రాయాలకు సవరణలుగా ఉన్నా విషయస్వీకరణ ముక్కుకు సూటిగానే జరిగింది చాలావరకు నిర్దిష్ట సమయంలో అతడి మనస్థితి ఎలా ఉండేదో ఈ పరిస్థితి సూచిస్తుంది అతడి వ్యక్తిత్వం, స్వభావం, అనిశ్చిత బుద్ధి, స్వవచో విరుద్ధతలు కూడా బయట పడుతుంటాయి. తన బలహీనతలనూ, వ్యత్యాసాలనూ, దురాశలనూ, దురాలోచనలనూ అతడు తీవ్రంగానే ఖండించుకున్నాడు. అలాంటి తన పాపాలన్నిటినీ సంఘం భరించలేదని వివరంగా రాయలేదంటాడు, 'అనంతం'లో. వాటిలో కొన్నింటిని పూర్వ ప్రకరణాల్లో యథాలాపంగా ప్రస్తావించాం కూడా. రోజులు గడిచే కొద్దీ సాహిత్య చరిత్రలో తన స్థానాన్ని గురించి అతడి ఆత్మ

విశ్వాసం ప్రబలమయింది అతడు అహంకరించాడు నా అంతవాడు లేడన్నాడు అయితే అదంతా తన ఆధిక్య భావ లక్షణమని (megalomania) అని ఒప్పుకున్న తరవాత విమర్శకులు నిరుత్తరులై మతిపోయి నీళ్లు కారవలసివచ్చింది అతడి ప్రసంగాలన్నిటినీ విస్పష్టమైన కాలక్రమంలో పెట్టి, వాటి క్రమాభివృద్ధి పరిణామాలను గాని అభిప్రాయాల్లో వచ్చిన మార్పులుగాని ఖండితంగా చెప్పటం కుదరదుగాని, మొత్తం మీద అవి అంతేననక తప్పదు.

తనను గురించి తానేమని చెప్పుకున్నాడో మొదట చూద్దాం. 1933 నాటికే (కేవలం 23 సంవత్సరాల వయసులో ఉన్నప్పుడే) ఈ శతాబ్ది తెలుగు సాహిత్యాభివృద్ధిని 'సొంతం చేసుకున్నా' నన్నాడని చెప్పాం అయితే ఆమాటలన్నది తన మాటల ప్రకారమే విశ్వనాథ దేవులపల్లుల రచనలను 'అనుకరించి రాస్తున్నా'నని అంగీకరించిన సమయంలోనే - 'సొంత గొంతుక' కోసం ప్రయత్నిస్తున్న సమయంలోనే! తెలుగులో చైతన్య స్రవంతి భావనను మొట్టమొదట ప్రవేశ పెట్టింది నేనేనని చెప్పుకున్నాడు. తాను అధివాస్తవిక ధోరణినీ వచన పద్య రచనాదులనూ కేవలం 'సాధన, శోధన'ల కోసమే, ప్రయోగ దృష్టితో మొదలు పెట్టానన్నాడు. తానెప్పుడూ కమ్యూనిష్టు పార్టీ సభ్యుణ్ని కాదనీ కమ్యూనిజం సిద్ధాంతానికి మాత్రం సానుభూతి పరుణ్ననీ వివరించాడు. అయితే మార్క్సిజం తాను విశ్వసించిన ఏకైక వాదమనీ ప్రకటించాడు. విప్లవానికి అంకితమైన తన కలంతో మాత్రమే ఎప్పుడయినా పోరాటం సాగిస్తానన్నాడు. సాహిత్య రంగంలోకి తాను రాజకీయాల ద్వారా ప్రవేశించలేదన్నాడు. క్రోపాట్కిన్ అనుయాయిగా - కాదు శిష్యుడిగా - తన ప్రవర్తనలో కొంత అరాజకత్వం ఉంటుందన్నాడు. నేను నిజానికి కథారచయితను కానన్నాడు. తన కెప్పుడూ కొత్తదనమే కావాలన్నాడు. తన కవిత్వం చాలావరకు ఆత్మానుభవ పూర్వక మన్నాడు. పార్లమెంటరీ ప్రజాస్వామ్యం ప్రయోజన సాధకం కాదన్న విశ్వాసంతోనే విప్లవాన్ని ఆహ్వానిస్తున్నానన్నాడు. సంస్కృతం, ఫ్రెంచి, రష్యన్ భాషల్లో ఆయా భాషల్లోని మహారచనల ఆంగ్లానువాదాలు చదివినందువల్లనే పాండిత్యం సంపాదించానన్నాడు! తన మిత్రుడు కాళూరి నరసింగరావు సంస్కృత సమాస కల్పనలో తాను చేసిన తప్పులను ఎత్తి చూపినపుడు ఆభాషలో తనకున్న అజ్ఞానానికి చిహ్నంగా వాటినలాగే ఉంచుతానన్నాడు అరసీసావిస్కీ తాగిన తరవాత రాసిన కవిత్వం శాశ్వతంగా ఉండి పోతుందన్నాడు. 1930 దాకా తెలుగు కవిత్వం తన్ను నడిపించినా ఆతరువాత తానే నాయకత్వం వహించి దాన్ని నడుపుతున్నానన్నాడు. చివరి రోజుల్లో విప్లవ కవితా ధోరణికి పూర్తిగా అంకితమై కవితా వస్తువుకిచ్చిన ప్రాథమ్యాన్ని శైలి కివ్వలేదు. తన కవిత్వం 70 శాతం ప్రజలకు అందుబాటులో లేనందువల్ల నేను ప్రజాకవిని కానన్నాడు. ప్రజాకవి కానివాడు మహాకవి కావటానికి వీలులేదు కాబట్టి తాను మహాకవి కూడా కాదన్నాడు గురజాడ కొత్తదారి చూపినమాట వాస్తవమేగాని, అది ఇరుకైన డొంక దారి అనీ, దాన్ని తాను నాలుగు వరసల

రహదారిగా మార్చాననీ చెప్పుకున్నాడు. తన ఇంగ్లీషు పరిజ్ఞానం పుస్తకాలకే పరిమితమనీ, అమెరికాలో, ఆస్ట్రేలియాలో, ఇంగ్లండ్‌లో ఆ భాషనెలా ఉచ్చరిస్తారో తనకు తెలీదనీ ఒప్పుకున్నాడు. తనకు హాస్యంమీద (విదూషకత్వం మీద) ఉన్న అభిరుచి వల్లనే పద్యాలనూ అధిక్షేప కవితనూ రాశానని, అదంతా 'కార్టూన్ కవిత' అన్నాడు. తన విదూషక స్వభావమూ, తనకున్న అసంతృప్తి జీవితం మీద ప్రయోగరూపంలో అటువంటి రచనలు చేయించా యని వివరించాడు ఈ తీరున ఆరుద్ర ఇంటింటి పజ్యాలూ, పరాభి పన్-చాంగమూ (పన్-Pun-అనే పదాన్ని విరిచి ఇలా చెప్పాడట) వెలువడ్డాయి అనుకరణశీలంగా.

'అనంతం'లో శ్రీశ్రీ తన దుశ్చర్యలు కొన్నిటిని సిగ్గువిడిచి చెప్పుకున్నాడు అతడు వ్యభిచరించి సుఖరోగాలు తెచ్చుకున్నాడు బాల్యంలోనే మిత్రులతో కలిసి తిరునాళ్లలో ఆడపిల్లలతో అసభ్యంగా ప్రవర్తించాడు. పుణ్యక్షేత్రమైన శ్రీరంగంలో వ్యభిచరించి నందుకు తనను తానే ప్రశంపించుకున్నాడు తనకుద్యోగమిచ్చే ఏవ్యక్తితోనయినా వ్యభిచరిస్తావా అని సొంత భార్యనడిగి ఆమె ఆమోదించిందని గ్రంధస్థంచేశాడు ఒక మారు తాగుబోతనే నేరానికి అరెస్టయి మదరాసు జైల్లో ఒక రాత్రి గడిపాడు. కొంతకాలం పాటు క్రమం తప్పకుండా గిండీ గుర్రప్పందేలకు వెళ్ళాడు - పగలంతా రమ్ముతాగుతూ కాలక్షేపం చేసి. ఒకటికి పదిసార్లు తాను నిరీశ్వరవాదినని ప్రకటించుకొన్నాడు గాని తన కుమారుడి ఉపనయనాన్ని తిరుమలలో శాస్త్రీయంగా నిర్వహించాడు ఢిల్లీలోని కన్నడ సాహిత్య పరిషత్తు 50 వ సమావేశంలో తనకో బహుమతినిస్తే అప్పటికప్పుడు పొట్లాం విప్పి అందులోని మురళీకృష్ణుడి చందన విగ్రహాన్ని కళ్ళకద్దుకున్నాడు ఒక విధంగా అతడు జహంగీరులాగా పరస్పర విరుద్ధ ప్రవర్తనల కాలవాలం.

భిన్న కాలాల్లో అనేక రచయితలు శ్రీశ్రీ వ్యక్తిత్వాన్ని రకరకాల అభిప్రాయాలతో వ్యక్తీకరించాడు. వాటిలో కొన్నిటిని నిశ్శంకగా శ్రీశ్రీయే ప్రచురించాడు. అతడి ప్రభవ కావ్యాన్ని తొలిసారి భారతిలో విమర్శించిన కొంపెల్ల జనార్దనరావు శ్రీశ్రీకి 'అభినవ దండి' అనే బిరుదిచ్చి, అతడికి శబ్దలౌల్యమేగాగని అర్థవంతంగా భాషా ప్రయోగం చేయటం చేతగాదని అధిక్షేపించాడు. బుర్రా శేషగిరిరావు శ్రీశ్రీని ''కవి తృణావర్తు''డన్నాడు ఢంకా పత్రిక శ్రీశ్రీ రేడియోకు అమ్ముడు పోయాడని నిందించింది. రాజకీయ కార్యకర్తల కొరత వల్ల తెన్నేటి విశ్వనాథం తనను ప్రాధేయపడ్డా, మిత్రుడు వడ్డాది సీతారామాంజనేయులు ఎంత రెచ్చగొట్టినా, తాను పిరికితనం కారణంగా సత్యాగ్రహం చేయలేదని అతడే రాసుకున్నాడు. నిజాం వ్యతిరేక, రజాకార్ వ్యతిరేక ఉద్యమం ప్రజలమీద జరుగుతున్న అత్యాచారాలను ఎంత తీవ్రంగా ప్రతిఘటిస్తున్నా ఆత్మ భద్రత కోసం ఆవిషయంలో స్పందించలేదు అక్షరం రాయలేదు. అప్పట్లో అతడు నిజాం

ప్రభుత్వంలో కొలువు చేసుకుంటున్నాడు. అటువంటి ఆత్మరక్షణావసరం లేనప్పుడు తరిమెల నాగిరెడ్డితో కలిసి శ్రీకాకుళంజిల్లాలో పర్యటించాడు నక్సలైట్లు కావలసిన ఆయుధాలు కొనుక్కోడానికి అవసరమైన చందాలు పోగుచేయటానికి అప్పుడుకూడా (తానే వాగ్దానం చేసినట్లు) భీమునిపట్నంలో స్థిరపడి నక్సలైట్లకు సాయమందించలేదు. మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా తమ ఇద్దరి పేరిటా పత్రికల్లో ప్రచురితమైన 'ఉమ్మడి ఉత్తరాన్ని' శ్రీశ్రీ ఫోర్జరీ చేశాడని విశ్వనాథ నిందించాడు శ్రీశ్రీ అది అబద్ధమనీ, అదే నిజమయితే తనను ఉరితీయవచ్చనీ ఎదురుతిరిగాడు. తాను కమ్యూనిస్టు పార్టీని సమర్థిస్తున్నందుకు కంటగించుకొన్న తన అనుయాయులూ సోదర కవులూ ఆరుద్రతో సహా 1955లో నిర్దాక్షిణ్యంగా తనమీద ధ్వజమెత్తినపుడు, శ్రీశ్రీ ఒంటరివాడై నిస్సహాయు డైనాడు. అప్పుడు నార్ల చిరంజీవి ఒక్కడే (1925-1971) మద్దతుగా నిలిచి శ్రీశ్రీని సమర్థించాడు. శ్రీశ్రీ తన గురువని చెప్పుకొన్న అబ్బూరి, 'కవిత'లో రాసిన గేయంల్లో శ్రీశ్రీ కవితను, రాజకీయాలను, వ్యక్తిగత సంబంధాలను వెక్కిరించి వేళాకోళం చేశాడు శ్రీశ్రీ నిర్భయంగా అందరినీ ఎదుర్కొన్నాడు. అతడి శత్రువులందరికీ అడిగినంత స్థలం కేటాయించి ఆంధ్ర పత్రిక శ్రీశ్రీ మీద నిప్పులు చెరిగింది అది 'పెట్టుబడికి, కట్టుకథకు, పుట్టిన విష పుత్రిక ''అని శ్రీశ్రీ తిరిగి తిట్టాడు. తాను సంస్థాపకాధ్యక్షుడైన విరసం అతణ్ని మూడుసార్లు అధ్యక్ష పదవినుంచి తొలగించి రెండుసార్లు పున ప్రతిష్ఠించింది అధ్యక్షుడిగా, సాధారణ సభ్యుడిగా. ఆ సంఘమే అతడు రాజకీయంగా అపరిణతుడనీ, బాధ్యతా నిర్వహణకన్నా ఆత్మ రక్షణ భద్రతలకే ప్రాముఖ్యమిచ్చేవాడనీ, మానవ జాతిలో అతడు అంగుష్ఠ మాత్రుడనీ, అవకాశవాది అనీ, అరాజకవాది అనీ, జాతీయ వాదులనూ పెట్టీ బూర్జువాలనూ అభిమానించేవాడనీ, సోమరిపోతనీ, సనాతనత్వాభిమాని అనీ నిందించింది. అదే సంస్థ అతడు హిమాలయోన్నతవ్యక్తి అని శ్లాఘించి, అతడు చేసిన తప్పులన్నిటినీ క్షమించి అతడి రచనా సర్వస్వాన్ని సంపుటాలుగా ప్రచురించటం విడ్డూర మనిపిస్తుంది. సంతాప సభలో సుప్రసిద్ధ నవలా రచయితా కథానికా కర్తా అయిన రావిశాస్త్రి అతడి తాగుబోతుతనాన్నీ, వ్యభిచారాన్నీ బహిరంగంగా సమర్థించాడు. కాళీపట్నం రామారావు (కారా) మరో ప్రసిద్ధ రచయిత. అతడు శ్రీశ్రీ వ్యక్తిగత ప్రవర్తనతో తమకు సంబంధం లేదనీ మహాకవిగా ఆయన్ను గుర్తిస్తామనీ చెప్పాడు. శ్రీశ్రీకి రాసిన బహిరంగ లేఖలో డాక్టర్ ఎం.వి. రమణారెడ్డి అతడు పిరికివాడనీ, ఆత్మస్తుతి పరాయణుడైన స్వాభిమానధురంధరుడనీ, కీర్తికండూతి బాధితుడనీ దూషించాడు. ఈ శతాబ్దంలో చలంతో సహా ఏతెలుగు రచయితా ఇన్ని రకాల అభియోగాలనూ, వ్యక్తి స్వభావ దూషణలనూ తన జీవితకాలంలోనే ఎదుర్కొని బతికి బట్టకట్టి మహోన్నత సాహితీ వ్యక్తిగా పొగడ్తలందుకోలేదు. శ్రీశ్రీ తనను తాను శిక్షించుకున్నాడు. ఇతరుల దూషణలను సహించాడు. క్షమాపణలు చెప్పుకోలేదు అదే అతడి స్వభావంలోని బలదౌర్బల్యాలకు నిదర్శన.

## ఇతరుల గురించి

శ్రీశ్రీ ఇతర రచయితల గురించీ సంఘటనల గురించీ కొన్నిసార్లు సమర్థిస్తూ మరికొన్నిసార్లు వ్యతిరేకించి, అగౌరవించి, వెక్కిరించిన సందర్భాలను మొదట ప్రస్తావించి ఇతరులతణ్ణి గురించి మరింకేమేమన్నారో పరిశీలిద్దాం. అతడు భిన్నభిప్రాయాలు వెలిబుచ్చినప్పుడల్లా అవి పునరాలోచన ఫలితాలని అన్ని సమయాల్లోనూ చెప్పలేం. ఒక మహారచనను చదివినప్పుడల్లా దాని రచయిత తన గురువనేవాడు అనేక గ్రంథాలు చదివినప్పుడు ఆయా రచయితలను వర్గీకరించి, తన వ్యక్తిగత గౌరవాభిమానాలను తరతమభావాలతో వ్యక్తీకరించి, తన అంచనా ప్రకారం వారే యే కారణాలవల్ల తాను వారికి ప్రసాదించిన గుణగణాలకు అర్హులో వివరించటం అతడి స్వభావం. తన రాగద్వేషాలను తనదైన ప్రత్యేక పద్ధతిలో అభివ్యక్తం చేసే విశేష లక్షణముంది. తన నూతనానుభవాలను పురస్కరించుకొని పాత అభిప్రాయాలను మార్చుకోవటం దోషమనుకోలేదు. తన మనోభావాలను దాచిపెట్టి మాటలు మార్చనూ లేదు (తన నిర్ణయం ఆలోచనా పూర్వకమైనా కాకపోయినా) కొత్తదనాన్ని ఆహ్వానించటంలో, సంప్రదాయాన్ని వ్యతిరేకించటంలో, వామ పక్ష ప్రయోజనాలను వ్యతిరేకిస్తూ ఒక్క అక్షరమైనా రాయక పోవటంలో అతడి దృక్పథంలో ఏమాత్రం మార్పులేదు రచయితల విషయంలో భారతీయులా? విదేశీయులా? తెలుగువాళ్ళా? ఆంధ్రేతరులా? వామపక్షం వాళ్ళా? తద్వ్యతిరేకులా? అనే భేదభావం ఎన్నడూ చూపలేదు.

శ్రీశ్రీ తన ప్రథమ గురువులని చెప్పుకున్న తన తండ్రీ అబ్బూరుల విషయంలో తనకున్న గురుత్వ భావనను సర్వోత్తమంగా భావించాడు. అయినాగాని ఒకసారి తన తండ్రినే జూదగాడని నిందించాడు. కానీ స్వయంగా తనకు మార్క్సిజంతో పరిచయం కల్పించి, తరువాత తన రాజకీయసిద్ధాంతాన్నీ నిబద్ధతనూ వెక్కిరించిన అబ్బూరిని గురించి పల్లెత్తు మాటాడలేదు! ఒక దశాబ్దికాలం విశ్వనాథనూ దేవులపల్లినీ అభిమానించి మనసు పెట్టి అనుకరించాడు. విశ్వనాథ బహిరంగ సభలో తన్ను కౌగిలించుకొని 'కవితా ! ఓకవితా' అనే గేయాన్ని తానే ప్రచురిస్తానని బాసచేశాడు అయినా విశ్వనాథ సనాతనత్వమూ శ్రీశ్రీ సంప్రదాయ వ్యతిరేకతా వారినొకే మార్గంలో నడవనీయలేదు. అయినా ఉభయులూ తమ జీవితాంతం రాగద్వేష మిశ్ర సంబంధాలు కొనసాగనిచ్చారు మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంలో వాటి నిర్వహణను వ్యతిరేకించే విషయంలో వారి వ్యక్తిగత సంబంధాలు తెగిపోయాయి. అంతకు ముందు ప్రత్యేకాంధ్రరాష్ట్ర నిర్మాణం కోరుతూ తన ఆస్థానకవి పదవికి రాజీనామా చేసిన విశ్వనాథ మహాసభలకు హాజరైనాడు శ్రీశ్రీ వ్యతిరేకించి అరెస్టయి హైదరాబాదులోని బోలారం పోలీస్టేషనులో ఒక రాత్రి నిద్ర చేశాడు. అప్పటికే విశ్వనాథ శ్రీశ్రీలు పరస్పర దూషణారోపణలు చేసుకోవటం పూర్తయింది. ఉమ్మడి లేఖలో తన సంతకాన్ని శ్రీశ్రీ ఫోర్జరీ చేశాడని విశ్వనాథ

ఆరోపించాడు ఆ వివాదం అక్కడితో సమసిపోయింది. విశ్వనాథ తన శ్రీ మద్రామాయణ కల్ప వృక్ష రచనను విపరీతంగా అభిమానించాడు. ఒక్కడైనా తానా గ్రంథం చదివానంటే విశ్వనాథ పొంగిపోతాడని శ్రీశ్రీ వెక్కిరించాడు. ఆ శ్రీశ్రీయే విశ్వనాథ తొలి రచనలైన 'కిన్నెరసాని పాటలూ, కోకిలమ్మ పెళ్ళి' మహా కావ్యాలని నేటికీ విశ్వసిస్తున్నానన్నాడు. విశ్వనాథ రామాయణ కల్పవృక్షానికి జ్ఞానపీఠ పురస్కారం లభించినప్పుడు ఆసమయంలో బెజవాడ గోపాలరెడ్డి ఉత్తరప్రదేశ్ గవర్నరుగా ఉండకపోతే ఆపురస్కారం విశ్వనాథకు వచ్చేది కాదని శ్రీశ్రీ అధిక్షేపించాడు విశ్వనాథ తనంతటి మహాకవి వేయేళ్ల క్కూడా పుట్టడంటే, శ్రీశ్రీ నిజానికాయన వెయ్యేళ్ల క్రితమే ఉద్భవించాడని, తెలుగు సాహిత్యానికి జరిగిన మహోపచార మదేనని అన్నాడు. నన్నయ గారున్నంత కాలం విశ్వనాథ కూడా ఉంటాడన్నాడు. అయినా మార్గ ప్రవర్తకులైన తిక్కన, వేమన, గురజాడ లంతటి మహాకవిగా విశ్వనాథ లెక్కకు రాడన్నాడు.

శ్రీశ్రీకి విశ్వనాథ సంస్కృత పాండిత్యం ఈర్ష్య పుట్టించిం దనిపిస్తుంది. సంస్కృతం కూడా రాదనటం కోసం పనిగట్టుకొని శేషేంద్రశర్మను ప్రస్తావించి అతడే విశ్వనాథకన్నా గొప్ప విద్వాంసుడనీ, తన మహాప్రస్థానగేయాలను సంస్కృతంలోకి అను వదించగల సామర్థ్యం అతనికి తప్ప మరెవరికీ లేదని కితాబిచ్చాడు మరోసారి విశ్వనాథ ఇరవయ్యో శతాబ్ది నన్నయభట్టనీ, ఆయన కిన్నెరసాని పాటల నభిమానిస్తానుగాని, రామాయణ కల్ప వృక్షమనే 'గొప్ప తెలుగు నవల'ను (!) కాదనీ ప్రసంగించాడు. రాజకీయ సాహితీ సిద్ధాంతాల్లో శ్రీశ్రీ విశ్వనాథల మధ్య ఎటువంటి పొంతనా లేదు. విశ్వనాథ మొదట భావకవిగా సంప్రదాయబద్ధ కవిత రాసి, తరువాత తద్విరుద్ధమైన దేశీచ్ఛందస్సులో పాటలు రాసి, సంప్రదాయ పునరుద్ధరణ వాదాన్ని అభిమానించి, చిట్టచివరకు గద్య పద్యాల్లో నవ్య కావ్య భాషా సేవలో స్థిర పడ్డాడు. ఒకసారి రామరాజ్య పరిషత్తు అభ్యర్థిగా పార్లమెంటు ఎన్నికల్లో పోటీచేసి ధరావతు కోల్పోయాడు. తన సాహితీ యాత్రలో మతవిశ్వాసాలే దృఢానుబంధం కల్పిస్తాయనే నిర్ణయానికి వచ్చాడు. శ్రీశ్రీ తన సాహితీ జీవితాన్ని వస్తురూపాలు రెంటిలోనూ విశ్వనాథాభిమానిగా అనుయాయిగా దశాబ్దం పాటు నడిపి, పదప్రసిద్ధ ధారాశుద్ధినుంచి అధివాస్తవిక వచన పద్య రచనలో ప్రయోగాలతో కొట్టుమిట్టాడి, కవికొండల బసవరాజు నండూరుల రచనల ద్వారా గురజాడనీ ఆయన అంతర్జాతీయతా వాదాన్నీ గుర్తించి, ఆత్మ సాక్షాత్కారం కోసం అంగలార్చి, ప్రపంచ సాహిత్యాల్లోని అధునాతన ధోరణులనూ అబ్బూరి రోణంకుల ప్రభావంలోపడి నవీన రాజకీయ సిద్ధాంతాలనూ గమనించి, తన స్వతంత్ర భావాలను ఛందోధికారంతో భిన్నధోరణుల్లో వ్యక్తీకరించి, విప్లవాత్మక భావానుభూతిలో ఓలలాడి, మార్క్సిజం మీద అచంచల విశ్వాసముంచి, ఎవరే విధంగా ఏపాటి కొత్తదనం ప్రదర్శించినా స్వాగతించే స్థితిలో స్థిర పడ్డాడు భారత కమ్యూనిస్టు పార్టీ మద్దతుతో స్వతంత్రాభ్యర్థిగా పోటీచేస్తున్న

హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయను సమర్థించి తన పూర్వగురువు ఓటమికి కొంతైనా కారకుడైనాడు ఒకరు మరొకరి కవితా శక్తులను కొన్ని షరతులకు లోబడి ప్రశంసించినా తమతమ రాజకీయ సామాజిక సిద్ధాంతాలవల్ల శ్రీశ్రీ విశ్వనాథలు దూరస్థులయ్యారు.

తనకు మరో మార్గదర్శి అయిన దేవులపల్లిని శ్రీశ్రీ అంత ఘోరంగా విమర్శించలేదు కాకపోతే సరదామాటగా 'సకాలంలో రావటం శాస్త్రీయం, రాకపోవటం కృష్ణశాస్త్రీయం' వంటి చెణుకులు మాత్రం విసురుతుండేవాడు. ఈ భేద దృష్టికి కారణాలు విభిన్నం. తన పద్ధతిలో తానూ పోరాడినవాడే దేవులపల్లి. భావకవితా ధోరణిని ప్రచండ (సంస్కృత) పాండిత్యంతో నిర్దాక్షిణ్యంగా అక్కిరాజు ఉమాకాంతం ఖండించినప్పుడు తననూ సాటి భావకవులందరినీ సమర్థిస్తూ వందల కొద్ది బహిరంగ సాహితీ సభల్లో నిరాఘటంగా ప్రసంగించినవాడు దేవులపల్లి ఒక్కడే అక్కిరాజుతో పోరాడగల గుండె ధైర్యం భావకవితా మార్గ ప్రవర్తకుడైన రాయప్రోలుకుగాని, ఆమాటకు వస్తే ఆకోవకు చెందిన మరో భావకవికిగాని లేకపోయింది యువకుడైన శ్రీశ్రీని ఈ పరాక్రమం ఆకట్టుకొని ఉండవచ్చు. బహిరంగ సభల్లో దేవులపల్లి శ్రీశ్రీ పాటలను గూడా అడవి బాపిరాజులాగానే పాడుతుండేవాడు శ్రీశ్రీ ఇందుకు కృతజ్ఞుడై ఉంటాడు. శ్రీశ్రీ కన్నా కొంచెం ముందుగాచేరి అతడితో సమకాలంలో సినిమారంగంలో పనిచేశాడు దేవులపల్లి వారిద్దరి మధ్యా స్పర్థ ఉన్నదని ఎవరికీ అనిపించలేదు విమర్శనాత్మకంగా, కేవలం సరదాకోసం చిల్లర విషయాల మీద దేవులపల్లి కూడా ఆశువుగా పద్యాలల్లుతుండేవాడు. విశ్వనాథ అలాచేయ లేదు కార్టూన్ కవితలోనూ, ఆశువుగా రహస్య ప్రచారంలో ఉన్న పద్యాల్లోనూ శ్రీశ్రీ అనుకరించాడు దేవులపల్లిని. జీవన విధానాల్లో కూడా వారిద్దరి మధ్యా కొన్ని పోలికలున్నాయి. ఇద్దరూ భిన్న కాలాల్లోనే కావచ్చు ఆలిండియా రేడియోలో పనిచేశారు. విశ్వనాథలా కాకుండా ఈ ఇద్దరూ కుర్రకారుతో కూడా సరదాగా కాలం దొర్లించగలిగిన వాళ్ళే. దేవుల పల్లి ఛందస్సుకు సర్వాధికారి అని శ్రీశ్రీ ప్రశంసించాడు సకాలంలో రాడని దేవులపల్లి నాక్షేపించటంలో కూడా శ్రీశ్రీకి దురుద్దేశంగాని, వెక్కిరించాలనే భావంగాని, ఈర్ష్యా స్పర్థలుగాని లేవు-సరదాతప్ప

శ్రీరంగం నారాయణబాబు శ్రీశ్రీకి పినతండ్రి కొడుకు. బాల్య స్నేహితుడు కూడా. తొలి రోజుల్లో వారి బంధం పరస్పరప్రశంసాత్మకంగా ఉండేది. నారాయణబాబు అధివాస్తవిక ప్రాయోగిక కవిత్వాన్ని శ్రీశ్రీ మెచ్చుకున్నాడు అతడి సంగీతజ్ఞానాన్ని అభిమానించాడు. అబ్బూరి తన కుమారుడు వరద రాజేశ్వరరావుతోబాటు కలిసి అనువదించమని చెహోవ్ ఛెర్రీ ఆర్చిడ్'ను ఈ ఇద్దరికీ అప్పగించేదాకా వారిస్నేహం నిర్మలంగా ఉండేది నారాయణ బాబు అనువాదాన్ని అబ్బూరి తిరస్కరించినపుడు శ్రీశ్రీయే అందుకు కారకుడనే అభియోగం వచ్చింది ''చాలా వరకు అనువదించిందీ, పేర్లు మార్చిందీ వరదే నేను చేసిన సాయం చాలాతక్కువ'' అని శ్రీశ్రీ మొత్తుకున్నా,

శ్రీశ్రీ నిజమే చెప్పాడని వరదా, అబ్బూరీ వంత పలికినా నారాయణ బాబు నమ్మలేదు. నారాయణ బాబు అనువాదం 'శ్రాద్ధయోగ్యంగా' ఉందన్నాడు అబ్బూరి. తనది 'సెకండ్ ట్రాన్స్‌లేషన్' అన్నాడు శ్రీశ్రీ. శ్రీశ్రీ చరమ జీవిత కాలంలోనూ మరణానంతరం కూడా గుసగుసల రూపంలో, అసహిష్ణుకతతోనూ నారాయణబాబు ఇంగ్లీషు పాండిత్యాన్ని గురించీ శ్రీశ్రీ దుర్మార్గం గురించే వారిద్దరికీ బంధువైన ఆరుద్ర చాలా ప్రచారం చేశాడు. స్నేహం చెడ్డ తర్వాత శ్రీశ్రీ కొన్ని ఘోర విమర్శలు చేశాడు నారాయణ బాబును గురించి. ''నారాయణ బాబు కేవలం అనుకరణ శీలి. Derivative poets అంటారే, ఆకోవకు చెందిన వా''డన్నాడు. ''శ్రీరంగం నారాయణబాబు was simply an imitator ఇంకా he was essentially an anarchist, probably an opportunist also" అని నారాయణ బాబు కేవలం అనుకర్త, అరాజక వాది, అవకాశవాది అని దూషించాడన్నమాట. అతడూ ఆరుద్రా అనుకరణ దగ్గరే ఆగిపోయి సొంతగొంతుక సాధించ లేదన్నాడు. ''నారాయణ బాబు శిష్యుకు శిష్యుడూ, ఆరుద్రకు గురువూ'' అన్నాడు. ''బాల గంగాధర తిలక్, బైరాగి, అజంతా వంటి కవులు నారాయణ బాబు అందు కోవడానికి అసాధ్యమైన కవితాశిఖరాలు నందుకున్నా'' రని అన్నాడు.

ఆరుద్ర శ్రీశ్రీకి మేనల్లుడు. ముద్దుల మేనల్లుడనీ చెప్పవచ్చు. తెలంగాణాలో నిజాముకూ రజకార్లకూ వ్యతిరేకంగా కమ్యూనిస్టు పార్టీ సాగించిన సాయుధ సమరాన్ని బ్రహ్మాండంగా ప్రశంసిస్తూ ఆరుద్ర రాసిన 'త్వమేవాహం' అనే ప్రతీకాత్మక కవితకు శ్రీశ్రీ పీఠిక రాశాడు సాహితీ ప్రపంచంలో ఆగ్రంథ ప్రాశస్త్యం ఏ అలజడీ పుట్టించనప్పుడు. తెలుగు స్వతంత్రలో తన పూర్వాభిప్రాయాన్ని పునరుద్ఘాటిస్తూ శ్రీశ్రీ సుదీర్ఘ వ్యాసం రాశాడు బహుశా ఆరుద్ర సినీ రంగప్రవేశంలో కూడా శ్రీశ్రీ సాయపడివుండవచ్చు. అది అబద్ధమని ఇప్పుడు ఖండన వచ్చినా రావచ్చు. కాలం గడిచే కొద్దీ ఒకవైపు సాహితీలోకం వారిద్దరూ గురుశిష్యులని విశ్వసించటం మొదలు పెట్టింది. ఉన్నత స్థాయి కెదుగుతున్న ఆరుద్రకు ఆమాటలంత రుచించినట్లు లేదు. వారిద్దరి మధ్యా కుటుంబ వ్యవహారాల్లో గొడవలేమైనా ఉన్నవో లేవో చెప్పలేం. కాల క్రమాన వారిద్దరూ ఒకరిపట్ల మరొకరికున్న అసంతృప్తిని దాచుకోలేని పరిస్థితి వచ్చింది చిత్త చాంచల్యానికి గురైన శ్రీశ్రీని మదరాసులోని మానసిక వైద్యశాలలో చేర్చటంలో ఆరుద్ర చేసిన సహాయ పరిమితిని గురించీ స్వభావం గురించీ వాద ప్రతివాదాలు కూడా పుట్టాయి. ఒకానొక సమయంలో ఆరుద్ర కవిగా రాణిస్తున్నంత కాలం తానేమీ రాయనక్కరలేదని కూడా శ్రీశ్రీ చెప్పాడు. తరవాతి కాలంలో ''ఆరుద్ర నా expectation ను fulfil చేయలేదు. ఆరుద్ర దారి తప్పి పోయాడు. ఈ రోజుల్లో అందరికంటే ఎక్కువగా అతని శ్రీమతి influence చేస్తున్నట్లున్న'' దన్నాడు. నారాయణబాబు లాగా అనుకరణ దగ్గరే ఆగిపోయాడన్నాడు. మీరు గురుశిష్యులేగదా

అని అడిగితే'' శిష్యుడంటే అతనొప్పుకోడు. రత్నమంటే నే నొప్పుకోను నిజాన్ని పోలిన అబద్ధం చెప్పడంలో, వ్రాయడంలో ఆరుద్ర చాలా ఘటికుడు. అందుకు నా ప్రశంసగా యిచ్చిన బిరుదు ''అసత్య''- అన్నాడు. పురిపండా అప్పలస్వామి మాస్కో-యాత్రకు ఓ సాహిత్య సైంధవుడు (శ్రీశ్రీ) అడ్డు పడ్డాడని పరోక్షంగా ఆరుద్ర ఆరోపించినప్పుడు, ''ఆరుద్ర ఏదీ పేరు పెట్టి స్పష్టంగా అనడు. చాలా డొంక తిరుగుడుగా చెపుతాడు. ఆరుద్ర పెద్ద పరిశోధకుడు, రీసెర్చి వర్కరూ-ఎన్ని ఆధారాలైనా చూపించగలడు మరి. అందుకే నేను ఆరుద్రను రామప్పపంతులు అన్నా'' నన్నాడు శ్రీశ్రీ. విశాఖపట్నంలో శ్రీశ్రీ షష్టిపూర్తి జరిగినప్పుడు, మదరాసులో శ్రీశ్రీ అంతిమయాత్ర జరిగినప్పుడు ఆరుద్ర ప్రవర్తించిన తీరు కనీసం లోకదృష్టిలోనైనా హుందాగా లేదనిపించింది. ఇటువంటి దురదృష్టకర విషయాలింకా చాలా ఉన్నాయిగాని వాటన్నిటినీ ఈచిన్న పుస్తకంలో ప్రస్తావించనూలేం - వాటిని పేర్కొన్నందు వల్ల సాహిత్య మేరువులాంటి శ్రీశ్రీ కున్న ప్రతిష్ఠ తగ్గనూ తగ్గదు, తదితరుల ప్రాభవం పెరగనూ పెరగదు. ఒకటి మటుకు భాయం. చరమ జీవితంలో శ్రీశ్రీ మానసికంగా బాధ పడ్డాడు ఆరుద్ర కారణంగా. తన బహిరంగ శత్రువు లెవరూ శ్రీశ్రీ నింతగా బాధించలేదు

రూప వైవిధ్య ప్రయోగాల్లో శిష్ట్లా తనకన్నా ముందు వాడేనని శ్రీశ్రీ ఒప్పుకున్నాడు. బాలగంగాధర తిలక్ ఉన్నత శిఖరాలధిష్ఠించిన ఉత్తమ కవి అనీ, నారాయణబాబు లాంటి చిన్నకవులెప్పటికీ ఆస్థాయి కెదగ లేరన్నాడు శ్రీశ్రీ. ''కుందుర్తికి దాశరథి సినారేల కంటే **better place** ఇస్తాను. వాళ్ళిద్దరూ నాకు ప్రాచీన కవుల్లానే కన్పిస్తారు. దాశరథి, సినారె **they are more or less classical poets**'' అన్నాడు. ''వచన కవిత్వంలో తనది అన్న విశిష్టత్వం వున్నావా'' డని కూడా అన్నాడు కుందుర్తిని గురించి. సినారె (సింగిరెడ్డి నారాయణ రెడ్డి) ''అంతరాంతరాల్లో భావకవి (పైకి ఎలా కన్పించినా)'' అన్నవాడు తరవాతి కాలంలో ''కిరాణ కొట్టు'' అనే శీర్షిక పెట్టి ''సినారె, బళారె, అన్నిట్లో హుషారె, సినీమా రె, డీమేడ్ సరుక్కి తయారె'' అని ఎద్దేవా చేశాడు. నారాయణ బాబు శిష్ట్లాకు శిష్యుడు ఆరుద్రకు గురువూ అన్నాడు. ఆరుద్ర త్వమేవాహం'' నిప్పులు చిందే నిరాశావాద'' మన్నది తరవాతి మాట. కాళోజీ నారాయణరావు (జననం 1914)'' మనవేమన. మన గొడవంతా అతని గొడవ'' అన్నాడు. సి.ఆర్.రెడ్డి (1880-1951) ''ఆధునిక విమర్శకు మార్గదర్శకుడు. ఎన్నో దురభిప్రాయాలను తూర్పార బట్టిన వా''డని శ్లాఘించాడు. పుట్టపర్తి నారాయణాచార్యులు (1914-1989)'' కవి. పండితుడు. పండితకవి. రాయలసీమ ప్రసాదించిన రత్న'' మని కీర్తించాడు. రాయప్రోలు సుబ్బారావు (1892-1984) ''భావకవిత్వానికి ప్రపితామహుడు. మరిచిపోయిన తెలుగుతనాన్ని మళ్ళీ జ్ఞాపకం చేసినవా''డని అభినందించాడు. బీనాదేవి, ముప్పాళ రంగనాయకమ్మ, వాసిరెడ్డి సీతాదేవి ''నిబద్ధతగలవారు. ఏ రచయితకూ తీసిపో''రన్నాడు.

గుంటూరు శేషేంద్ర శర్మను గురించి భిన్న సమయాల్లో శ్రీశ్రీ విభిన్నాభిప్రాయాలు వ్యక్తపరిచాడు. 'శేషేన్ classical training ఎక్కువ వున్నవాడు. విశ్వనాథకంటే ఎక్కువ సంస్కృతం చదువు కున్నవాడనుకుంటాను. అతడి 'మండే సూర్యుడు' విప్లవ భావాలకు సుముఖం'' అన్నాడొకసారి తన మహా ప్రస్థానాన్ని సంస్కృతీకరించగలవాడత డొక్కడేనని శ్రీవేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి సిఫారసు చేశానన్నాడు. 'శేషేన్ కమ్యూనిజం దిశగా పయనించాలని కోరే వ్యక్తిగాని నిజమైన విప్లవ కారుడు కాదు. అతడు గోడ మీద కోకిల'' అన్నాడింకోమారు. మరోసారి'' శేషేంద్ర శర్మ సంస్కృతంలో ఘటికుడని ఎప్పుడూ ఒప్పుకుంటూనే, కవిగా అతని ఆజానుబాహుత్వాన్ని ఇప్పటికీ శంకిస్తాను. అతడు దాశరథి భుజాలదాకా గూడా రాడు కవిగా ''అని స్తుతినింద చేశాడు. ''శేషేన్ neo-classicalism కూడా కావచ్చు మొత్తంమీద కవిసేన ఒక రియాక్షనరీ ఉద్యమం. సాహిత్యాలలో గాని, రాజకీయాల్లో గాని రియాక్షనరీకున్నది న్యూసెన్సు వాల్యూ మాత్రమే'' నన్నాడు. ఇంకోమారు శేషేన్ ''కవి సేనానాయకుడు. కాని అతని సైన్యం సాల్వేషన్ ఆర్మీలాంటిది చెప్పుకోదగ్గ కవి'' అని అటూ ఇటూ గాకుండా ప్రస్తావించాడు.

తన స్వంత రచనలతోబాటు కొన్ని ప్రసిద్ధ గ్రంథాల మీద కూడా కొన్ని విమర్శలు చేశాడు. తన పేరు ''ఈ శతాబ్దానికి పర్యాయ పదం. కవితా సృష్టికి పరిశోధనా కేంద్ర'' మని ఆత్మస్తుతి చేసుకున్నాడు తన మహాప్రస్థానం ''జన జీవితపు స్టిల్ ఫోటోగ్రఫీ'' అని గొప్పలు చెప్పుకున్నాడు. వేంకట పార్వతీశ్వర కవుల (బాలాంత్రపు వేంకటరావు · 1881-1972, ఓలేటి పార్వతీశం : 1882-1955) ఏకాంత సేవ అనే నవల 'కవితా జలపాత'మన్నాడు. రాయప్రోలు కావ్యం కష్టకమల 'కవిత్వంలో కథానిక' అనిపించింది. నండూరి సుబ్బారావు యెంకి పాటలు ''పాటకజనుల భావ కవిత్వం''గా భాసించింది. ఆవంత్స సోమసుందర్ (జననం 1924) వజ్రాయుధం ''తెలంగాణా పోరాటానికి వ్యాఖ్యానం'' అన్నాడు. తన ఖడ్గసృష్టి ''అధర్మనిధనానికి'' ప్రతీక అని తోచింది. గురజాడ ముత్యాల సరాలు ''భావకవిత్వానికి చూపుడు వేలు''గా కనిపించాయి. అందువల్ల - ''ఆధునిక సాహిత్యాన్ని 'శ్రీశ్రీయుగం' అనమంటున్నా''నని పట్టుబట్టున్నాడు మరికొందరు రచయితల గురించి కూడా తన అభిప్రాయాలు చెప్పాడు. కొన్ని సార్లు వ్యక్తిగత సామర్థ్యాన్ని పురస్కరించు కొని, మరి కొన్నిసార్లు ఇతరులతో పోల్చి లత (తెన్నేటి హేమలత 1932-97) కన్నా ముప్పాళ రంగనాయకమ్మ గొప్ప రచయిత్రి అన్నాడు. వరవరరావు విలువైన'వజ్ర' మని, యండమూరి వీరేంద్రనాథ్ 'వేడి నేడి పెసరట్టు'' అన్నాడు. గజ్జెల మల్లారెడ్డి తాను బహుకాల పరిశ్రమ ద్వారా సంపాదించినంత పేరును కొద్దికాలంలో అధిక్షేపకవిగా సంపాదించాడన్నాడు. ఒక దశలో అతణ్ణి తెగ పొగిడి తనకు కవితారంగంలో వారసుడన్నంతగా పరిగణించి, అతడు విరసం కవులను తీవ్రంగా నిరసించగానే ''తెలుసా, విరసాని కెదురొడ్డి, అబ్బాయ్ డియర్ మల్లారెడ్డి, నువు రాస్తున్న గుడ్డి, విద్వేషపు రాతల

జడ్డి, తనంవల్ల విరుగుతుంది అరసంనడ్డి'' అని ప్రాసక్రీడల్లో పలవరించాడు.'' దిగంబర కవులు నిజమైన కవులు. అయితే వాళ్ల కవితా శక్తుల్ని సరియైన మార్గంలో పెట్టలేక పోతున్నారు. వాళ్లలోని unrest (అశాంతి)ని సరియైన మార్గంలో పెడితే బాగుంటుంది'' అన్నాడు మరోసారి దిగంబర కవుల్లో ''రాజకీయ చైతన్యం కంటే కవితా చైతన్యమే ఎక్కువ'' అన్నాడు. అంతకు ముందోసారి కవిత్వానికి వారే ఆశాజ్యోతులన్నాడు. వారి కవిత్వం దిగంబరమేగాని ఆ కవులు దిగంబరులు కారన్నాడు. సెక్సు ఎప్పుడు అశ్లీలం కాదన్నాడు. అని వారి కవితలను ఆంగ్లీకరించాడు. రారా (రాచమల్లు రామచంద్రారెడ్డి, సంవేదన సంపాదకుడు: 1922-1988) తీవ్ర విమర్శకుడనే మాట పుట్టినప్పుడు, ''రా.రా. రియాక్షనరీ కాదు. ఆయన మార్క్సిస్ట్ విమర్శకుడు. తూచగల తూనిక రాళ్ళు ఆయన దగ్గర ఉన్నాయి'' అని ఓసారీ, ''రాచమల్లు రామచంద్రారెడ్డి చాలా క్రూరుడైన విమర్శకుడు. Unkindest critic విమర్శ అంత క్రూరంగా ఉండాల్సిన అవసరం లేదు'' అనీ మరోసారి అన్నాడు శ్రీశ్రీ నార్ల వెంకటేశ్వరరావు (1908-1985)లు ఆంధ్ర ప్రభలో సహోద్యోగులు. కొంతకాలం ఇరుగు పొరుగున నివశించారు ఒకరు రాయిష్టూ, మరొకరు కమ్యూనిస్టూ అయినందున రాజకీయంగా ఘోర శత్రువులు. కమ్యూనిష్టులను వ్యతిరేకిస్తూ నార్ల రాసే సంపాదకీయాలు ఒకదానికి మరొకటి నకలు మాత్రమేననీ ఆయన కవితలన్నీ తలకిందులు వ్యవహారాలనీ వెక్కిరించాడు-''అటో ఇటో, డిటోడిటో, ఎడిటోరియల్ల నార్ల, ముందు వెల్లకిల, వెనక బోర్ల'' అని

ఆంధ్రేతర రచయితల గురించీ, నాయకులను గురించీ శ్రీశ్రీ చేసిన ప్రసంగాలు భిన్న సమయాల్లో పరస్పర విరుద్ధంగా సందర్భ శుద్ధి లేని పోలికలతో వెలువడ్డాయి గాంధీ యిజాన్ని ఒక రాజకీయ సిద్ధాంతంగాగాని సామాజిక నీతిగాగాని అతడెప్పుడూ గౌరవించలేదు ఆసిద్ధాంతాన్ని వెక్కిరిస్తూ కూడా రాశాడు. అయితే వ్యక్తిగా గాంధీజీని అతడు గౌరవించిన తీరందుకు భిన్నం. ''తన మార్గంలో గాంధీజీ ఒక విప్లవ కారుడు. ఆయన ఈ దేశాన్ని సంఘటితపరిచా''డని మెచ్చుకున్నాడు రబీంద్రనాథ్ ఠాకూర్ నుంచి తన కొక అలవాటు సంక్రమించిందన్నాడు-శబ్ద సౌందర్యం కోసం ఒకసారి, అర్థబోధ కోసం రెండోసారి కవిత్వాన్ని రెండు మారులు చదవటమని, తరవాత తన బుద్ధి మార్చుకున్నాడు ''ఠాకూరు రచనలలో ఆధ్యాత్మికశక్తి సోడానీళ్ళలో బొగ్గుపులుసు వాయువులాగా బుస్సుమని పొంగుతూ వుంటుంది అదే కవిత్వమని భ్రమ పడతారు కొంద'' రని వ్యాఖ్యానించాడు ''ప్రేమ్‌చంద్, శరత్‌బాబులకన్నా Dickens & Maxim Gorky లు గొప్పవారు'' అని ఒకసారి ప్రవచించాడు గాని, ఏవిధంగానో విశదీకరించలేదు. జేమ్స్‌జాయిన్ రాసిన యులైసిన్, మయకోవిస్కీ రచన లెనిన్, గురజాడ రచనలన్నీ తనమీద శాశ్వత ప్రభావం ప్రసరించిన గ్రంథాలన్నాడు పసితనంలో మొపాసాంనూ తరువాత చెహోవునూ మెచ్చానన్నాడు. హరీంద్ర నాథ్ చట్టోపాధ్యాయ 'ఇటీవల

నాకిన్స్పిరేషన్' అన్నాడు. ఛార్లెస్ బాదలాయిర్ (1821-1867), గయ్ దీ మొపాసాం (1850-1893), ఎడ్గార్ అలాన్ పో (1809-1849)లు నాదృష్టిలో ఋషిత్రయమని చెప్పుకున్నాడు. షేక్స్పియర్, షెల్లీ, కాళిదాసు, తిక్కన, శ్రీనాధులను తాను పూర్తిగా అభిమానిస్తున్నానని ప్రకటించాడు. స్విన్ బర్న్ తనకో గురువన్నాడు. మొపాసాంను గొప్ప రచయిత అనే కన్నా మహాకవి అనటం తగునన్నాడు. మళ్లీ తాను షెల్లీ, ఠాకూర్, దేవులపల్లి మంచి కవులన్నాడు. (అలాగే దేవులపల్లి కారణంగా వేదుల, నాయని, నండూరులు కూడా అన్నాడు). నజ్రుల్ ఇస్లాం తనను ఉత్తేజపరిచాడన్నాడు. యౌవనంలో తనకు విశ్వనాథ మహదాకర్షకుడన్నాడు. నేను చెళ్ళపిళ్ళను అబ్బూరి వల్ల గౌరవిస్తున్నాననీ, ఆకారణం వల్లనే శ్రీపాద (కృష్ణమూర్తి) శాస్త్రిని అగౌరవిస్తున్నాననీ చెప్పాడు (అవిభక్త మదరాసు రాష్ట్రంలో ఆస్థానకవి పదవి మొదట చెళ్ళపిళ్ళకే దక్కింది - ఆయనకు కొద్దికాలం గురుత్వం నెరపిన శ్రీపాద (1866-1960) కన్నా ముందుగా). భిన్న సందర్భాల్లో ఇలాంటి అభిప్రాయ ప్రకటనలనేకం చేశాడు శ్రీశ్రీ.

ఒకసారి ఆస్థాన కవి పదవి ఆస్థాన విదూషకుడి ఉద్యోగంలాంటి దన్నాడు. అభ్యుదయ కవిత్వం కేవలం భారత కమ్యూనిస్టు పార్టీ కవిత్వమనీ, విప్లవ కవిత్వం మార్క్సిస్టు కమ్యూనిస్టు పార్టీ కవిత్వమనీ వ్యాఖ్యానించాడు అభ్యుదయ కవిత్వం, భావకవిత్వం మీద తిరుగుబాటుగా ఒకప్పుడు విప్లవాత్మకంగా ఉండేది; విప్లవ కవిత్వం దానికన్నా మరింత అభ్యుదయ పథంలో సాగిందన్నాడు. ఇంకోసారి అరసంవద్దు విరసం వద్దు, లావారసం (లాక్షణిక వాద రచయితల సంఘమని అతడి వ్యాఖ్య) కావాలన్నా డిప్పుడు బహుశా అది నవ్యకావ్యభాషావాదాన్ని ఆక్షేపించటమైనా కావచ్చు. పాత కమ్యూనిస్టులను నిర్దయగా దూషించాడు . ''నిన్నటి కమ్యూనిస్టులు, నేటి మర్యాదస్తులు, ఉదారవాదులు, సంపన్న గృహస్థులు, వ్యాపారైకదృష్టులు, తపోభ్రష్టులు'' అని. విప్లవ కారుల్లో తానొకణ్ణని ఆర్భాటంగా చెప్పుకున్నా అతడు ఇందిరాగాంధీ 20 సూత్రాల ప్రణాళికనూ, ఎన్.టి. రామారావు రాజకీయ రంగ ప్రవేశాన్నీ సమర్థించాడు అత్యవసర పరిస్థితి పరిపాలన శ్రమ జీవులకు మేలు చేసే వామపక్ష నియంతృత్వ మనుకున్నాననీ, ఎన్టీ ఆర్‌నుగాక ప్రజల ప్రభుత్వ వ్యతిరేక భావాలను అభిమానించి తెలుగు దేశం పార్టీని సమర్థించాననీ సంజాయిషీ ఇచ్చుకున్నాడు. తనకు అత్యంత సన్నిహితంగా ఉన్న మిత్రులతో కూడా కష్టాలు తెచ్చిపెట్టిన ఇలాంటి ప్రకటనలు చాలా చేశాడు. కానీ తోచీ తోచగానే నోటికి వచ్చినట్లు వ్యాఖ్యానించటం మానుకోలేదు. అది అతడి స్వభావవిలక్షణత.

సాటి రచయితలు శ్రీశ్రీని గాఢంగానే అభిమానించీ ద్వేషించారు. అతడి సామాజిక రాజకీయ భావాలు నచ్చక పోయినా అతణ్ణి సహించి, మెచ్చి, సాహితీ పురస్కారాలకు సిఫారసు చేశారు. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు విశిష్ట సభ్యుడిగా ఎన్నుకొన్నారు శ్రీశ్రీకి ఆదర్శప్రాయుడైన చింతా దీక్షితులు సుప్రసిద్ధ సాహితీపత్రిక

'కృష్ణాపత్రిక'లో చెళ్ళపిళ్ల మరణానంతరం వ్యాసంరాస్తూ అవిభక్త మదరాసు ప్రభుత్వం ఆస్థానకవి పదవిలో శ్రీశ్రీని ప్రతిష్ఠించాలని వాదించాడు. మదరాసు రాష్ట్రంలోని శాసన మండలి సభ్యత్వం అతడికి లభించింది.

ఢిల్లీలో సాహిత్య అకాదమీ నిర్వహించిన లెనిన్ శతజయంత్యుత్సవాల్లో పాల్గొనడానికి శ్రీశ్రీ తోబాటు కొడవటిగంటి కుటుంబరావును కూడా ఆహ్వానించారు. ఆసమయంలో తన 'కవితా!' గేయానికి తానే చేసిన ఆంగ్లాను వాదాన్ని జ్ఞాన పీఠ కార్యదర్శి శ్రీ జైనుకు శ్రీశ్రీ చదివి వినిపించాడు-విరామసమయంలో. ''అనువాదమే ఇంతగా ఆకట్టుకొంటుంటే మూలం మరెంత సౌందర్యవంతమో కదా!'' అని జైన్ ప్రశంసించాడని కూడా చెప్పాడంటాడు కొడవటిగంటి. మహా పండితుడు ఘట్టమరాజు 1982 జ్ఞాన పీఠ పురస్కారం మరోనలభై రోజుల పాటు జీవించి వుంటే శ్రీశ్రీ అందుకొనేవాడని సాక్ష్య మిచ్చాడు ఇదంతా పూర్తిగా నిజం కాకపోయినా, పురస్కారానికి అర్హతగల అభ్యర్థుల్లో శ్రీశ్రీ ఒకడై ఉండవచ్చు.

శ్రీశ్రీకి లభించిన పొగడ్తలన్నిటిలో రెండు మూడు విశిష్టమైనవి. పురిపండా జోస్యం చెప్పినట్లే అభ్యుదయ కవితకు శ్రీశ్రీ సార్వకాలిక నాయకుడు. ఆంధ్రజ్యోతి (దిన పత్రిక) సంపాదకుడూ మాననీయ విమర్శకుడూ అయిన నండూరి రామ మోహనరావు ''శ్రీశ్రీ ఒక అపకారం చేయకపోలేదు. తన తరువాత మరోలా రాయటానికి వీలు లేకుండా చేశా''డని అభినందించాడు ''శ్రీశ్రీ వచ్చి ప్రతివాడి చేతా కవిత్వం రాయిస్తున్నా''డని విశ్వనాథ ఆక్రోశించటం వీటన్నిటిలోనూ దొడ్డది. అది పచ్చి నిజం. వందల వేల సంఖ్యలో చిన్నా పెద్దా రచయితలు అతణ్ని అనుకరించాలనీ, అనుసరించాలనీ, కాపీ కొట్టాలనీ, అతడి మాటలే వీలయినంత ఎక్కువగా అరువు తెచ్చుకోవాలనీ ఉబలాట పడుతున్నందున అతడి మార్గదర్శ కత్వానికి తిరుగులేదు. చిట్టచివరకు కొడవటిగంటి మాటలలో ఈ ప్రకరణాన్ని ముగించటం మంచిది. ''రీడర్స్‌తో శ్రీశ్రీ కున్న emotional attachment చాలా గొప్పది. అతని కవిత్వంలాగా అదీ అనితర సాధ్యమే''.

# ఆరో ప్రకరణం

## వ్యక్తిగా శ్రీశ్రీ

''కొవ్వొత్తిని రెండువైపులా ముట్టించాను
అది శ్రీశ్రీలా వెలిగింది'' - పురిపండా (ఇన్‌ఖిలాబ్‌లో)

శ్రీశ్రీతో ఏ కొంతకాలమైనా వ్యక్తిగత పరిచయం గల వారెవరైనా అతడు వయసొచ్చిన పసివాడనీ, అమాయకుడైనా చురుకైనవాడనీ, అహంకారి అయినా తలవంచుతుంటాడనీ, విచారణశీలి అయినా తప్పించుక తిరుగుతాడనీ, ఆకర్షకుడైనా ఏడిపించనూగలడనీ అంగీకరిస్తారు కొన్ని అభిప్రాయాల విషయంలో అతడు జగమొండి. సరదా పడ్డప్పుడు అతణ్ని అదుపు చేయటం కష్టం. విపరీతాలోచనా ధోరణిలో ఉన్నప్పుడు అతడు క్రమశిక్షణకు లొంగడు దాపరికం లేకపోవటం, ఆలోచనలోనూ స్వభావంలోనూ చాటూమరుగూ లేకపోవటం విస్పష్టం. మాటల్లో మాత్రమే అతడు భయంకరుడు. మరో విధంగా పోరాడలేడు. వాస్తవ జీవితంలో అతడు సమస్త సాంప్రదాయిక పద్ధతులకూ కట్టుబడ్డాడు. కానీ తన విప్లవ భావాలతో వాటి నెప్పుడూ వ్యతిరేకిస్తుండేవాడు. ఒక్కోసారి అతడి ప్రవర్తన అనూహ్యం. కానీ మరుక్షణంలో చాలా మెత్తబడి నిర్వేదంలో పడతాడు. అతడి జీవితంలోని విరుద్ధలక్షణా లన్నిటికీ అతడి జీవితంలోనుంచే కారణాలను కనిపెట్టవచ్చు. నిర్దిష్ట సమయంలో అతడి పరిసరాలూ అతడి ఆర్థిక సమస్యలూ కావచ్చువి.

చాలా చిన్న వయస్సులో - ఏణ్నర్థం పసివాడుగా ఉండగా-తల్లి గతించింది. తండ్రి దగ్గరే పెరుగుతున్నా, మారుదల్లి ఎంతో దయాభిమానాలు ప్రదర్శించినా, మాతృ వియోగ మతణ్ని బాధించే ఉంటుంది శ్రీరంగం వారికి అతడు దత్తుడయినా జనక తండ్రి పూడిపెద్ది కుటుంబంలోనే పెరిగాడు. బాల్యంలో తండ్రి అతడి అవస్థలు గ్రహించి చాలా ముద్దు చేశాడు. అతిసంరక్షిత వాతావరణంలో పెరిగాడు. అందువల్ల తనకు అందుబాటులో ఉన్న ప్రతి వ్యక్తితోనూ ఏదో విధంగా బంధం పెంచుకొనేవాడు. శ్రీశ్రీకి మారుదల్లితో ఉన్న ఆత్మీయతా భావమే తన మొదటి మంచి రచన ప్రభువను కృతజ్ఞతా పూర్వకంగా అంకితం చేయించింది. పినతండ్రి కొడుకు నారాయణబాబుతోనూ మేనల్లుడు ఆరుద్రతోనూ చాలా పిన్న వయసులోనే విపరీత స్నేహ బంధాన్ని పెంచటానికి

ఆత్మీయతాభిమానమే దారితీసింది అందువల్లనే ఒకరి తరువాత మరొకరుగా ఆ ఇద్దరూ ఏదోకారణంతో తనకు దూరమై అలక్ష్యంచేసినా, విరోధభావం వహించినా అతడి గుండె బద్దలయింది వారి మీదగల గాఢ ప్రేమానుబంధం కాలక్రమాన విపరీత ద్వేషభావంగా పరిణమించింది అతడు వారిద్దరినీ క్షమించ లేకపోవటానికీ వారిమీద నిర్దాక్షిణ్య విమర్శలు గుప్పించటానికీ అదే కారణమనీ వివరించవచ్చు.

శ్రీశ్రీ తన బాల్యస్నేహితుల్లో ఏ ఒక్కరినీ తనకు అఖండకీర్తి ప్రతిష్ఠలు వచ్చిన తరవాతగాని, ఐశ్వర్య వంతుడయినప్పుడు గాని మరిచిపోలేదు. ఈ బాల మేధావిని గుర్తించి, అతడి పద్యాలను తన సొంత సాహితీ పత్రికలో ప్రచురించిన వాడు పురిపండా అప్పలస్వామి శ్రీశ్రీని తనతో బాటు లండన్ తీసుకువెళ్ళి శ్రీశ్రీ సొంత గొంతుతో దస్తూరితో మహాప్రస్థాన గేయాలను రికార్డు చేయించి గూటాల కృష్ణమూర్తి చేత ప్రచురింపజేసిన వాడు కూడా ఆ పురిపండాయే శ్రీశ్రీ తన కృతజ్ఞతా భావానికి నిదర్శనగా పురిపండా పద్యాలను ఆంగ్లంలోకి అనువదించాడు. తన రాజకీయాభిప్రాయాలు పూర్తిగా విరుద్ధమైనా, జీవితాంతం మిత్రుడుగా, అభిమానిగా నిలిచాడు. పురిపండా జీవితాంతం గాంధేయుడుగా, కాంగ్రెసువాదిగా ఉన్నాడు. శ్రీశ్రీ మార్క్సిజం, సోషలిజమన్నమాటలు విన్నప్పటి నుంచీ బతికినంతకాలం తద్విరుద్ధ భావనలతోనే గడిపాడు. ఈరాజకీయ విభేదాలు వారి వ్యక్తిగత సంబంధాలకేనాడూ అడ్డంకి కాలేదు. పురిపండాకు ఏ వ్యసనమూలేదు వ్యసన పరుల నతడెన్నడూ క్షమించలేదు. శ్రీశ్రీకి లేని వ్యసనం లేదు. విద్రోహకవి నజ్రుల్ ఇస్లామునూ సంప్రదాయ వ్యతిరేక భావాలున్న గాయక కవి హరీంద్రనాథ్ చట్టో పాధ్యాయనూ, చివరికి విశాఖపట్నంలో కమ్యూనిస్టు పార్టీశాఖను నిర్మిస్తున్న అబ్బూరినీ శ్రీశ్రీకి పరిచయం చేసినవాడు పురిపండాయే. యౌవన ప్రాదుర్భావ సమయంలో, సులభంగా కొత్త విషయాలను అభిమానించే దశలో ఉన్న శ్రీశ్రీకి, గాంధేయవాదంలో నిబద్ధతగల తాను, ఇటువంటి వ్యక్తుల పరిచయం కల్పించి అతడి జీవన విధానమే మారిపోయే అవకాశం కల్పించినందుకు పురిపండా ఎన్నడూ పశ్చాత్తాపపడలేదు. భావకవితాంబరవీధీ విహారిగా ఉన్న పురిపండాను తన వచన పద్య భూమార్గానికి మళ్ళించి పురాణ గాథలను ఆధునిక భాషలో చెప్పే స్థితికి తెచ్చింది శ్రీశ్రీయే. పురిపండా కవిగా కాక, జీవద్భాషలో వచన మహాభారత రచయితగానే ఎక్కువ పేరు సంపాదించాడు. పరస్పర సహనాభిమానగౌరవాలు వారిద్దరినీ బంధించి ఉంచాయి. పూర్వ ప్రకరణంలో పేర్కొన్నట్లు సమకాలిక రచయితలను గురించి కొన్ని కఠోర విమర్శలు చేసిన శ్రీశ్రీ, పురిపండాను గాని అబ్బూరినిగాని పల్లెత్తు మాట అనలేదు శ్రీశ్రీ తన బాల్య స్నేహితులను, చిననాటి అభిమానులను, చిన్న వయసులో తాను విహరించిన ప్రదేశాలను అఖండ ప్రేమాభిమానాలతో స్మరిస్తుండేవాడు. 'అనంతం'లో అతడు పేర్కొన్న అభిమాన పూర్వక బాల్య స్మృతులు అతడి మనస్థితికి నిదర్శనాలు; స్వభావానికి దృష్టాంతాలు. ఈ

నేపథ్యంలో నారాయణబాబు, ఆరుద్రలను (తన జీవిత చరమ సంధ్యలో ఒకే ఒకసారి రోణంకినీ) అంత ఘోరంగా విమర్శించటాన్ని పరిశీలిస్తే అది తనను మోసగించారనో, కించపరిచారనో, తనమీద దొంగదెబ్బలు తీశారనో విశ్వసించినందుకు ఫలితమనిపిస్తుంది అది ద్వేష భావంతో కన్నా ప్రతిచర్యగానో, దెబ్బకు దెబ్బగా చేసిన ఎదురు దాడిగానో, ఎత్తి పొడుపుగానో చెప్పదగింది.

శ్రీశ్రీ తన బాల్యాన్ని మధుర స్మృతిగా పరిగణించాడు. తండ్రి పూర్ణ స్వాతంత్ర్యమిచ్చి పిచ్చిగీతలతో గోడలు చెరప నిచ్చాడు. ఉపాధ్యాయుడు కాబట్టి నల్లబల్లనూ స్పాంజి డస్టరునూ పుత్రరత్నానికిచ్చి అభిప్రాయ ప్రకటనకు అవకాశమిచ్చాడు. ఇంత చక్కని విధానాన్ని చాలామంది తల్లిదండ్రులు పాటించలేరు. సహోపాధ్యాయుడి పిల్లవాడికి ఇతరులు తోడ్పడి ఆటపాటల ద్వారా అనేక విషయాలు బోధించారు. ఆపద్ధతిలోనే అతడికి ఛందశ్శాస్త్రంలోని ప్రాథమిక లక్షణాలు పట్టుబడ్డాయి. బాల మేధావి ఛందస్సుతో ఆడుకోవటం మొదలుపెట్టి ఎనిమిదేళ్ల పసితనం లోనే కవితా దృష్టి అలవరుచుకున్నాడు యువనటులలో కలిసి మెలిసి తిరగటానికీ బడి నాటకాల్లో చిల్లర వేషాలు కట్టడానికీ అవకాశం లభించింది శ్రీశ్రీకి. ఆతరంలో అలాంటి సమాజం యువకుడైనా, వృద్ధుడైనా నటుడైన వాణ్ని పంక్తి బాహ్యుడుగా అస్పృశ్యుడుగా పరిగణించేది గాంధీజీ అరెస్టుకు నిరసనగా ఇతర విద్యార్థులతో కలిసి శ్రీశ్రీ సమ్మెలో పాల్గొన్నందుకు ప్రథమ కోపంతో తండ్రి రెండు చేతుల మీదా బెత్తం దెబ్బలు వడ్డించినా, సాయంత్రానికి చల్లబడి ఒక రూపాయి బిళ్ళను బహూకరించాడు ఈ శతాబ్ది రెండో దశాబ్దిలో అది అసాధారణమైన విలువగల బహూకృతి. కేతవరపు వేంకట శాస్త్రి ఇంటికి సంస్కృతంలో ప్రాథమిక జ్ఞానం సంపాదించమని పంపి కూడా శబ్దమంజరి పూర్తికాగానే చదువు మానుకున్న శ్రీశ్రీని తండ్రి క్షమించాడు. శ్రీశ్రీ అనంతంలో తన సంస్కృత విద్య అక్కడితో ముగిసిందని రాసుకున్నాడు గాని అది వినయం కోసమో పండితులు తన తప్పు లెన్నకుండా ఆత్మరక్షణ చర్యగానో రాసిన రాత అనిపిస్తుంది. సుదీర్ఘ సంస్కృత సమాన కల్పన చేయగలిగిన వాడి భాషా జ్ఞాన పాటవాలను అంత తక్కువ చేసి చెప్పినా నమ్మటం కష్టం. సంస్కృత వ్యాకరణ రహస్యాలు అతడికి తెలియవన్నా తప్పులేదు. అయితే అనేక మహారచయితలకు ఆ దౌర్భాగ్యం సర్వసాధారణం.

కేరమ్సు, చదరంగం, ఫుట్‌బాల్ వగైరా ఆటలాడి చిల్లర మల్లర పతకాలనూ, పురస్కారాలనూ సంపాదించాడు శ్రీశ్రీ - స్థానికంగా. వాటిని కూడా పూట తిండి కోసం అమ్ముకోవలసి వచ్చింది. మూడో దశకంలో, ఆర్థిక మాంద్య కాలంలో వాటిని పోగొట్టు కోవటం కన్నా, వాటిని రొక్కంగా మార్చుకోవలసి రావటమే అతణ్ని ఎక్కువగా బాధించింది. అది ఒకరకం 'వ్యభిచార' మని చెప్పి దుఃఖించాడు! ఆ మానసిక క్షోభ అతణ్ని జీవితాంతం వెన్నాడింది. ఉన్నత పాఠశాలా విద్యార్థిగా ఉన్నప్పుడే అతడు పుస్తకాల

పురుగు. అతడి విద్యాదాహం కనిపించిన, దొరికిన ప్రతిగ్రంథాన్నీ చదివించింది. ఆకాలంలోనే తనకు నచ్చిన సాహిత్యాన్ని అనువదించటమో, అనుకరించటమో అలవాటయింది. ఈ అలవాటే ఉత్తర జీవితంలో సినిమారంగంలో రాణించటానికి అతడికి తోడ్పడింది. కళాశాలా విద్యార్థిగా ఉండగానే హరీంద్రనాథ్ చట్టోపాధ్యాయ వంటి ఇతరుల రచనలను ఆంధ్రీకరించాడు. అదేసమయంలో వ్యావహారిక భాషాభిమానిగా జీవితాంతం పోరాడిన పురిపండా వల్ల భాషా సంస్కరణకు ఆదిపురుషుడైన గిడుగు వేంకట రామమూర్తి (1862-1940) అభిమానిగా మారాడు శ్రీశ్రీ. అందుకు సహకరించింది ప్రిన్సిపాల్ పి.టీ. శ్రీనివాస అయ్యంగార్, రచయితా చమత్కారీ అయిన సెట్టి లక్ష్మీనరసింహం గారలతో ఏర్పడ్డ ప్రత్యక్ష పరిచయం. 'సెట్టి మాస్టారు'తో ఏర్పడ్డ అనుబంధం అతడి సహజ హాస్యస్వభావాన్ని పెంచి పోషించింది చివరి రోజుల్లో శ్రీశ్రీ సరదా కోసం రాసిన బూతు పద్యాలకు ఆ అనుబంధమే ఆలంబన విభావమని భావించవచ్చు.

శ్రీశ్రీ మదరాసులో ఉన్న రోజుల్లో పరస్పర విరుద్ధ స్వభావశీలులైన అనేక రచయితలతో విద్వాంసులలో పరిచయమేర్పడింది ఒకవైపు పరమ చమత్కారీ అధిక్షేపక చక్రవర్తీ అయిన జలసూత్రం రుక్మిణీనాథశాస్త్రీ, మరోవైపు పరమచ్ఛాందసుడూ, సంప్రదాయ పండితుడూ అయిన కొంపెల్ల జనార్ధనరావూ ఒకే విధమైన వ్యక్తిగతాకర్షణకు గురిచేశారు శ్రీశ్రీని. తెలుగు చరిత్రకారుల్లో లిపిశాస్త్రజ్ఞుల్లో అగ్రగణ్యుడు అయిన మల్లంపల్లి సోమశేఖరశర్మా, తెలుగు జానపద సాహితీ సృష్టి కర్త నండూరి సుబ్బారావూ పరిచితులైనారు. ఇతరులనేకులు అభిమాన పాత్రులైనారు. సాహిత్యాభిరుచి అతణ్ని నిద్ర పోనీలేదు. కానీ తనకు నచ్చనే నచ్చని జంతు శాస్త్రంలో విద్యార్థిగా ఉండి చదవక తప్పలేదు. అందుకనే తన ఆత్మకథలో ఆత్మదూషణ చేసుకుంటూ తాను 'కప్పల మాష్టారు'గా పనిచేయవలసి వచ్చిందని రాసుకున్నాడు. మదరాసు నుంచి ఇంటికి తిరిగి వచ్చి కుటుంబం పరమ దరిద్రావస్థలో ఉందని తెలుసుకున్నాడు. ఇల్లమ్ముకోవలసి వచ్చింది. తిండిగింజల కోసం ఉన్నత పాఠశాలా విద్యార్థులకు ఇంగ్లీషు వ్యాకరణం బోధించక తప్పలేదు. దానికి తోడు పోషించవలసిన భార్య ఉంది. పదవీ విరమణ చేసిన ముసలి తండ్రి ఉన్నాడు జనకతల్లి ఏనాడో కన్ను మూసింది తాను తప్పటడుగులు వేస్తుండగానే. పెంపుడుతల్లిగా వ్యవహరించిన సవతి తల్లి కూడా భౌతిక ప్రపంచం వదిలి వెళ్ళింది. శ్రీశ్రీ లాంటి భావుక వ్యక్తి కివన్నీ గట్టి దెబ్బలు. అనుక్షణ ప్రమాదకరమైన దారిద్ర్యం భయపెట్టుతుండేది. యుద్ధవిధ్వస్త ప్రపంచాన్ని కట్టి కుదుపుతున్న ఆర్థిక మాంద్యం, రాజకీయ సంక్షోభంలో ఉన్న వలసరాజ్యాధిపత్యం, అది అస్త వ్యస్తం చేస్తున్న జీవనవ్యయ విధానం, వాటికి తోడుగా ఒకే వ్యక్తి శారీరక శ్రమవల్లగాక ఉద్యోగ వృత్తుల ద్వారా సంపాదించి పెడితే మొత్తం కుటుంబ సభ్యులందరూ సుఖభోగా లనుభవించాలనే మధ్య తరగతి వారి సహజ ప్రవృత్తి

శ్రీశ్రీని అతలాకుతలం చేసి అరాజకత్వంలోకీ గందరగోళంలోకీ దించాయి తన దగ్గర ఉన్న సొమ్మును వీలయినంత అల్ప వ్యవధిలో వెచ్చించటమే అతడికి వెన్నతో బెట్టిన విద్య. అలాంటి వ్యక్తికి ఆ సమయంలో పైసా గడించటమే గగనంగా ఉంది. కేవలం బతకటానికి అతడికో ఉద్యోగం అవసరం రెండు కారణాలవల్ల అది అతడికి మనస్తృప్తినివ్వలేదు. అతడు అంతరాంతరాల్లో సేవావృత్తిని ద్వేషించేవాడు అతడి మనస్సు జీవన సత్యాలతో రాజీ పడలేకపోతుండేది పైపెచ్చు అతడు పగటి కలలు కనేవాడు - కవిగానో, రచయితగానో సంపాదించి బతకాలని. ఆవిధంగా సాహితీ రంగంలోని తన మేధాసంపదకు ఎక్కడి నుంచైనా కనక వర్షం కురుస్తుందన్న భ్రాంతిలో ఉండేవాడు అతడు చేసిన తప్పులన్నిటి కన్నా అదే పెద్దతప్పు అదే అతణ్ని జీవితాంతం వేధించి బాధించింది. ఎన్ని ఎదురు దెబ్బలు తగిలినా భారత దేశ పరిస్థితుల్లో అలా జీవించటం అసాధ్యమని అతడు గ్రహించనేలేదు. ఎవరో ఒక మహారాజు అభిమానించి తనను ఆస్థాన కవి పదవిలో నిలిపినా, అతడి స్వభావాదర్శాలు అందులో నిలకడగా ఉండనిచ్చేవి కాదు అతడు దూరదృష్టిలేని ఆశావాది. తన చుట్టూ ఉన్న ప్రపంచం అనుభవిస్తూన్న దుస్థితులన్నిటినీ కళ్ళతో చూస్తూ కూడా ఒక కవి ధన సంపాదన చేసి సుఖజీవితం గడపలేడని అర్థం చేసుకోలేదు. రచన అనేది అప్పుడప్పుడు చేసే పరిశ్రమేగాని ధనార్జన మార్గం కాదు. మదరాసు, ఢిల్లీ, లక్నో, స్వస్థలం విశాఖ పట్నం-వీటిల్లో ఎక్కడ ఉద్యోగం సంపాదించినా పదవీచ్యుతి పొందేదాకా అతడు విశ్రమించలేదు. తరవాత ఉద్యోగం పోయిందని బాధపడేవాడు. లక్నో స్కంధావారంలో ఎవరో అతడికి మద్యపానం అభ్యస్తం చేశారు. అనేక పర్యాయాలు అదే సర్వోత్తమౌషధమని అతడు ప్రమాణ పూర్వకంగా చెప్పాడు!

శక్తిమంతమైన భాషలో అభిప్రాయ వ్యక్తీకరణ చేయగల సామర్థ్యం తప్ప ధన సంపాదనకు పనికి వస్తుందన్న మరోశక్తి అతడికి లేదు. వందల సార్లు చిల్లర డబ్బుల కోసం అతడేదో రాసి ఇచ్చేవాడు. ఆకాస్త సొమ్మూ ఖర్చుపడేదాకా తానో మహారాజుననుకొనే వాడు బాధలను మౌనంగా సహించటం, కుళాయి నీళ్లతో ఆకలి చంపుకొని నేల మీద పొర్లాడటం, మరే స్నేహితుడైనా స్వచ్ఛందంగా తటస్థపడి, ఓదార్చి, సాయమందించే దాకా బతుకు పోరాటం సాగించటం అలవాటు చేసుకున్నాడు. మరుక్షణంలో తన పరిస్థితి ఎలా ఉంటుందో ఆలోచించకుండా నిర్దిష్ట సమయంలో తన దగ్గరున్న ఆఖరు పైసాదాకా మరొక అభాగ్యుడికి పంచటమనే విపరీత లక్షణం అతడికి పట్టువడ్డది. అదేమంటే తన మీదతానే జాలి చూపుతూ అది 'బిచ్చగాడికున్న మహదవ కాశ'మని, దరిద్రుడే ఇతరుల దారిద్ర్యాన్ని అర్థం చేసుకోగలడని వ్యాఖ్యానించి అదో చమత్కారమను కొనేవాడు! ఈ విధానమే అసంఖ్యాక స్నేహితులూ, పరిచయస్థులూ, చివరికి దారినపోయే దానయ్యలు కూడా అభిమానించటానికి కారణ మయింది. చార్లీ చాప్లిన్ పాత్రలకు ప్రతిబింబంలాగా ఆత్మవ్యథల నుంచి హాస్యం ప్రసాదించటాన్ని అభ్యస్తం చేసుకున్నాడు! ఏమాత్రం

సిగ్గూలజ్జా లేకుండా ఎవరినయినా అప్పు అడిగి, ఆసమయంలో తానడిగిన దాని కన్నా ఒక్క పైసా అధికంగా స్వీకరించననే తన నియమాన్ని తప్పకుండా పాటించేవాడు - అడిగిన దానికి వేయింత లిస్తానని ఏ శ్రీయోభిలాషి అయినా స్వచ్ఛందంగా ముందుకు వచ్చినాసరే! బాధలు పడ్డాడేగాని నిజాం ప్రలోభాలకు లోబడి ఆ నియంతను ప్రస్తుతించలేదు. ఆ కష్టకాలంలో తనతో తాను రాజీపడి అతడు చేసిందల్లా నిజాం వ్యతిరేక సాయుధ సమరాన్ని వ్యతిరేకిస్తూ ఏమి రాయకపోవటమే. అతడప్పుడు చాలా దీనస్థితిలో ఉన్నాడు. చివరకు ఆ ఉద్యోగంకూడా పోగొట్టుకున్నాడు.

సినిమారంగంలో ప్రవేశించిన తరువాత సొమ్ము చేసుకోవటం మొదలయింది. ఓయిల్లు కొన్నాడు. ఓకారు కొన్నాడు. అలా అంతో ఇంతో గడిస్తున్నంత కాలంలో అభ్యుదయ రచయితల సంఘంవారి అభ్యుదయ పత్రికకు ఆర్థికసహాయం చేశాడు. మిత్రులకు సాయ పడ్డాడు తన పుస్తకాలు ప్రచురించుకొన్నాడు. తిరుగా జీవన చరమ సంధ్యలో ఆర్థిక బాధలు వచ్చి, శరీరారోగ్యం సన్నగిల్లిన సమయంలో అప్పులు తీర్చనందుకు ఇల్లు వేలానికి వచ్చింది. సంపాదనకు మించి వ్యయంచేశాడు ఫలితం అనుభవించక తప్పదు అప్పుడతడి మిత్రులూ, అభిమానులూ చందాలు పోగుచేసి, వ్యాజ్యాలాడి, అతణ్ని ఊబిలోంచి బయటికి లాగారు భారతదేశంలో సాయుధ సమరం విజయం పొందటం చూడటానికి బతికి ఉన్నానని, తను మనః ప్రాణాలతో తాను నక్సల్ బరీ ఉద్యమానికి అంకితమై పోయానని ప్రకటనలు గుప్పిస్తున్న సమయంలో ఇది జరిగింది. తరిమెల నాగిరెడ్డితో కలిసి శ్రీకాకుళంజిల్లాలో విస్తృతంగా పర్యటించిన రోజుల్లో ఇది జరిగింది. అయితే అతణ్ని కాపాడింది పార్టీకాదు సినిమారంగంలోని అతడి అభిమానులే. వాళ్లనే అతడు పెట్టుబడిదారులనీ, పెట్టీ బూర్జువాలనీ, వాళ్లంటే తన కసహ్యమనీ పదే పదే దూషించినా సహించారు. అతడి వ్యక్తిగత జనాకర్షణశక్తి ఎంతటిదో, తిట్టినా అతణ్ని ప్రేమించి అభిమానించిన వాళ్లే నిరూపించారు. 1930 ప్రాంతాల్లో శ్రీశ్రీ మహాప్రస్థాన గేయాలు రాస్తున్న కాలంలో మార్క్సిజం అనేమాట నిషిద్ధం. సోషలిజమనేది కూడా ప్రమాదక పదం ప్రపంచ వ్యాప్తంగా ఆమాటలకున్న అర్థాలు మారిపోయి, కాలక్రమాన వాటి వాడుక ఫ్యాషనైపోయి, సంపన్న కుటుంబాల వారు శ్రీశ్రీ కవితా సంపుటాలను అద్దాల బీరువాల్లో పెట్టి ప్రదర్శించేకాలం వచ్చింది. శ్రీశ్రీ ఇలా అన్నాడని చెప్పటమూ నిత్యకృత్య మయిపోయింది. అతడికి వ్యతిరేకంగా పల్లెత్తు మాట మాట్లాడటానికి జంకే కాలం వచ్చింది ప్రజాభిమానం వల్ల ఇది ఏవర్గానికి చెందిన యువత ముందయినా మహాప్రమాదకరమయింది వెనకాముందూ చూడకుండా ఏవ్యక్తి ఏకొత్త ఆలోచన చెప్పినా, ఏరూపంలో కొత్త భావాలతో కవితరాసినా, తనకు నచ్చినా నచ్చక పోయినా శ్రీశ్రీ నిర్ద్వంద్వంగా స్వాగతించటమే ఇందుకు ప్రధాన కారణం. ఈ విషయంలో అతడి సహనం వర్ణనాతీతం. అతడు మేధావులతో కలిసి పోయేవాడు. సామాన్య ప్రజల్లో ఇమిడి పోయేవాడు తననూ తన కవితనూ గుర్తించిన ఎవరితోనైనా అంతే.

సాహితీరంగంలోని అతడి విరోధులు కూడా ఈరహస్యం గుర్తించి సరిపెట్టుకోవలసి వచ్చింది. అదే అతడి వ్యక్తిత్వం

తన మానసిక పరిస్థితి మీదా, విషయంమీదా ఆధారపడి అప్పటి కప్పుడు తోచిన మాట తోచినట్లు బహిరంగ పరిచేవాడు శ్రీశ్రీ. అందులో కొన్ని పరస్పర విరుద్ధాలు వాటన్నిటికీ ఏదో సమర్ధనలు చెప్పేవాడు. అలాసాధ్యం కాకపోతే పసిపిల్లవాడి లాగా అజ్ఞాన కృతమనేవాడు. కొన్నిసార్లు తన హాస్య ప్రియత్వానికో విదూషకత్వానికో వాటిని అనుసంధించేవాడు. కానీ నిజానికతడు కేవలం హాస్యగాడుకాడు. భాసుడి అవిమారక నాటకంలోని విదూషక లక్షణాలతో శ్రీశ్రీ గుణాలకు సరిపెట్ట వచ్చు

''గోష్ఠీషు హాస్య స్సమరేషు యోధః
శోకే గురు స్సాహసికః పరేషు
మహోత్సవే మే హృది కింప్రలాపై
ర్ద్విధా విభక్తం ఖలు మే శరీరమ్''

అవిమారకుడు తన ఆస్థాన విదూషకుణ్ని గురించి అన్న మాటలివి. సమావేశాల్లో హాస్య చతురుడూ, యుద్ధ సమయంలో వీరుడూ, దుఃఖంలో ఉన్నప్పుడు గురువూ, ఎదుర్కొనేటప్పుడు సాహసీ అని విదూషకుణ్ని ప్రశంసిస్తాడు. సంతోషసమయాల్లో తన శరీరంలో అతడర్ధభాగమంటాడు అవిమారకుడు. శ్రీశ్రీ సంభాషణ చతురుడు 1955 ఎన్నికల సమయంలో తన పూర్వ సహచరులూ వారి రాజకీయ సమర్ధకులూ తన మీద విరుచుకపడ్డప్పుడు అతడి విదూషకత్వంలోని దళవాయి శూరత్వం బయట పడింది, నార్ల చిరంజీవి దుముదారు దొరగా. ఆ పోరాటం మాటలతో మాత్రమే జరిగినా, అది భయంకర యుద్ధం. అతడా యుద్ధంలో పరాజితుడైనాడు; కానీ ప్రఖ్యాతి సంపాదించాడు. కష్టాల్లో ఉన్న ఎందరో స్నే హితులను ఓదార్చాడు. తన్ను తానూ ఓదార్చుకొనేవాడు. అతడు జంకలేదు వెక్కిరింతలు మాననూలేదు.

రోజు రోజుకూ వార్ధక్యం మీద పడుతున్నప్పుడు శ్రీశ్రీ కోపతాపాలు పెచ్చరిల్లాయి. ఒకప్పుడు తన దయా విశేషంవల్ల జీవన సోపానాలను ఒక్కటొక్కటిగా అధిరోహించి జీవన సమరంలో విజయులమని(!) భావించిన పూర్వానుచరులు ఒక క్రమం ప్రకారం తనను నిందిస్తున్నప్పుడు, ధనసంపాదన దృష్టితో చూస్తే తనకన్నా సుఖ శాంతులతో జీవిస్తున్న వాళ్లు తనను తక్కువ చేసి హేళన చేసినప్పుడు శ్రీశ్రీ వీరభద్రుడయినాడు, వాళ్లను ప్రతిఘటించటానికి. అది కళాత్మక మార్గమని కవితారూపంలో దూషించినప్పుడు శ్రీశ్రీకి ఛందస్సు మీద సామంతం సన్నగిల్లింది భాషా పాటవం దెబ్బతిన్నది. ఆసమయంలో అక్కడక్కడ మాత్రం అతడి పూర్వశక్తులు కనిపించేవి. అప్పుడప్పుడు మాత్రం అతడి మేధాశక్తి బయట పడేది ఈ మార్పుకు కనీసం రెండు విస్పష్టకారణా లగుపిస్తాయి.

విరసానికి స్థాపకాధ్యక్షుడైన తరవాత (రాజకీయ) వివాద బంధుర మయింది అతడి కవితా ధోరణి. విరసంలోని అతడి తోటి రచయితల కున్న విస్పష్ట సిద్ధాంత నిబద్ధత గాని, సాయుధ సమర విషయంలో వారికున్నంత అచంచల విశ్వాసంగాని శ్రీశ్రీకి లేవు. అతడి మార్క్సిస్టు పరిజ్ఞానం పైమెరుగు మాత్రం. సాయుధసమరం ద్వారా రాజకీయాధికారం సంపాదించటమనేది నినాద మాత్రం. ఆ సంస్థ అతణ్ని సొంత ఆస్తిగా స్వాయత్తం చేసుకొంది. అతడి ఆలోచనా స్వాతంత్ర్యం పరిమిత మయింది. కవిత్వంలో కూడా అతడు నిర్దిష్ట కఠోర నిబంధనలు పాటించ వలసి వచ్చింది అందాకా అతడెన్నడూ ఏరకం కట్టు బాటుకూ కట్టుబడ్డ పాపాన పోయినవాడు కాదు ఈ పరిస్థితి అతడి కవితా ప్రవాహాన్ని సహజంగానే నిరోధించింది శైలిని కట్టి పడేసింది కవితా నిర్మాణంలోనూ, పద ప్రయోగంలోనూ అతడికున్న అలవాట్లను మరోదారి పట్టించవలసి వచ్చింది. ఇది రెండో కారణం. తన భావాలూ ఆదర్శాలూ నిరక్షరాస్య ప్రజానీకానికి కూడా చేరాలంటే తనకన్నాళ్ళుగా అలవాటయిన భాషా శైలులు చాలా సులభం కావలసి వుందని తానూ గుర్తించాడు. తన కన్నా వయసులో చిన్న వాళ్లయిన ఇతర రచయితలు పొందుతున్న ప్రజాదరణను గమనించిన తరువాత తన మనస్సును మార్చుకోవలసి వచ్చింది కూడా. అందువల్లనే తన కవిత్వాన్ని నూటికి డెబ్బయి మంది ప్రజలు చదవటం లేదనే నమ్మకం కలిగిందని ఒక ఇంటర్వ్యూలో వ్యక్తీకరించాడు. అందుకే తాను సామాన్య ప్రజల భాషలో జానపదగేయాల బాణీలో రాయాలను కొంటున్నానని ప్రకటించాడు. ఈ కొత్త మార్గంలో అతడి ప్రయోగాలు ఫలించలేదు తన పాటలతో కవితలతో అభాగ్య జీవుల నుద్రేక పరుస్తున్న గద్దర్, వంగపండులు తనకన్నా ఉత్తమ కవులని ఒప్పుకొన్నాడు మనసులో వచ్చిన ఈమార్పు రూపంలో, వస్తు విన్యాసంలో అతడి అనంతరకాల కవితలో మార్పులు తెచ్చింది తన రచనా శిల్పానికీ, కళామయ ధోరణికీ కావాలని బహుశా ప్రయత్న పూర్వకంగా స్వస్తి చెప్పాడు అతడి చుట్టూ ఉండే యునకవు లతణ్ని 'మహాకవి' అనితప్ప ప్రస్తావించలేదు; 'మార్గదర్శకు'డని తప్ప వ్యవహరించలేదు కాలక్రమాన ఈ పొగడ్తలు, ఈ నిరంతర ప్రశంసలు అతడి అంతరాంతరాల్లో గూడుకట్టు కొని వేళ్లు తన్ని నిలిచి పోయాయి. నేను గురజాడ మార్గాన్ని అభివృద్ధికి తెచ్చాననీ, నేనే యుగకర్తననీ ఆత్మస్తుతి చేసుకోవటం ఆరంభించాడు! అంతకు కొన్ని దశాబ్దాల క్రితం తాను గురువని భావించి ప్రశంసించిన రోణంకి అప్పలస్వామి ఇది సహించక విమర్శించాడు. తనకు మౌలిక పాశ్చాత్య కవితా విశేషాలను తన యౌవనకాలంలో పరిచయం చేసినవాడు ఆరోణంకే. శ్రీశ్రీ అసహనాన్నీ ఆత్మస్తవాన్నీ రోణంకి ఖండించాడు శ్రీశ్రీ సమాధానం అహంకృతంగా అసహన భూయిష్ఠంగా వెలువడింది పదవీ విరమణచేసిన పాతబడి పంతులు బడిపిల్లలకు పాఠాలు చెప్పుకుంటూ చరమ జీవితం గడపటం మంచిదని సలహా ఇచ్చాడు. తక్కిన ప్రపంచానికి సాహితీ విషయ చర్చలనూ నిర్ణయాలనూ విడిచి పెట్టడం మేలన్నాడు ఆనాటి

కొకవిధంగా శ్రీశ్రీ సాహితీయాత్ర ముగింపు దశలో ఉంది. తనంతటి మహా సాహితీ మూర్తి చిల్లర వివాదాలను పట్టించుకొని విమర్శలకు అతీతంగా ప్రవర్తించాలని గుర్తించలేదు.

తన జీవిత చరమ సంధ్యలో అతణ్ని బాధించి అసహనంలో ముంచిన కారణాలు మరికొన్ని లేక పోలేదు అతడు వయసు మళ్ళి శారీరకంగా దుర్బలుడవుతున్నాడు. కానీ ఈ సహజ పరిణామాన్ని అతడు ఆహ్వానించి జీవితంతో రాజీపడలేక పోతున్నాడు. తన కన్నా ముప్పయ్యేళ్లు చిన్నదైన రెండో భార్య సహజంగానే భవిష్య జ్జీవితం గురించి భయపడటం మొదలయింది. తన, తన పిల్లల భద్రతకోసం గట్టి ఏర్పాట్లు చేయమని ఒత్తిడి చేస్తే, శ్రీశ్రీ ఆమెకు సంతృప్తి కరంగా ఆస్తి పాస్తులివ్వగల స్థితిలో లేడు. ఆమెకు ధైర్యం చెప్పగలస్థితిలో లేడు. ఏకుటుంబంలోనయినా ఇది సహజ పరిణామం. తానున్న పరిస్థితుల్లో తన జీవన విధానం ఈ ఒత్తిడిని భరించటం అతడికి కష్టమయింది

మరో విచిత్ర పరిణామం సాహితీ రంగంలో మొదలయింది అది హాస్య స్ఫోరకమనిపించవచ్చు గాని, శ్రీశ్రీకి అలా తోచినట్లు లేదు. కోపం తెప్పించింది అది అతడి 'వారసు'డెవరన్న ప్రశ్న! భారత రాజకీయ రంగంలో నెహ్రూతరవాత, ఇందిరాగాంధీ తరవాత మన ఏలిక ఎవ్వరనే చర్చ మొదలయినట్లు, తెలుగు సాహితీ రంగంలో శ్రీశ్రీ తరువాత మహాకవి పీఠమెక్కదగిన కవి ఎవ్వరనేచర్చ మొదలయింది ! చాలామంది పేర్లు వినిపించి, కొంత చర్చ తరవాత సద్దుమణగటం జరిగింది. తనకు ఫలానావ్యక్తి సాహితీ రంగంలో వారసుడని శ్రీశ్రీ స్వయంగా చెప్పినట్లూ రాసినట్లూ సాక్ష్యాలు ప్రదర్శించటం ఆరంభమయింది ! ఇది కూడా సహజంగా శ్రీశ్రీని చిక్కుల్లో పెట్టింది. కారణం ఏదోసందర్భంలో సమయంలో ఫలానా వ్యక్తి తన వారసుడని, శ్రీశ్రీ తరవాత చాలాసార్లు నాలిక కొరుక్కున్న మాట వాస్తవం. ఎప్పుడెందు కేమన్నాడో సంజాయిషీ ఇచ్చుకోవటమూ సాధ్యపడని విషయమే. తన తరవాత ఏర్పడే శూన్యంలో ఎవరికి పట్టాభిషేకం చేయాలో ఖండితంగా చెప్పగల పరిస్థితి లేదు. సాహితీరంగం ఏ ఒక్కడి సొంత ఆస్తీ కాదన్న సంగతీ అతడికి తెలుసు అది తనకు సొంతం కాదు అందువల్ల తన వారసుడని తేల్చి తన కిరీటాన్ని ఎవరో ఒకరి నెత్తిన బెట్టే మార్గమూలేదు. ఎవరెవరు యువరాజు పదవిలో ఎంత కాలం ఎప్పటినుంచి ఉండి గద్దెదిగారో పేర్కొనటం, చర్చించటం అవసరం కాదు; అభిలషణీయమూ కాదు. వారసులమని చెప్పుకున్న వారిలో చాలామంది ఇంకా సజీవులే కాబట్టి ఏ ఒక్కరి పేరు చెప్పినా తదితరులు దండయాత్ర చేసే ప్రమాదముంది. ఈకాలంలోని సాహితీపరుల మనసుల్లో సాహితీచక్రవర్తిత్వ మనే ఏకచ్ఛత్రాధిపత్య మున్నదనే అచంచలవిశ్వాసం కలగటమే విడ్డూరం. ఈ చర్చ ఒక్క విషయాన్ని నిరూపిస్తుంది - శ్రీశ్రీ ఈ శతాబ్దంలో సర్వోన్నతుడైన తెలుగు కవి అనే భావం చాలామందిలో ఉందని అంత కన్నా ఈ చర్చకు ప్రయోజనం గానీ, ఫలితంగానీ లేదు.

శ్రీశ్రీకి కొన్ని గాఢ విశ్వాసాలున్నాయి. అవి అతడి జీవితకాలంలో మారనేలేదు. తన తరువాతి తరతరాల కవులందరికీ తానే పథనిర్దేశకుణ్ణనీ, అందువల్ల తాను తనకూ తన కవిత్వానికీ తప్ప మరిదేనికీ బద్ధపడనక్కర లేదనీ అతడి పట్టుదల. తన బాల్యం నుంచీ అతడు ప్రత్యేకాంధ్ర రాష్ట్రం కోసం వచ్చిన రాజకీయోద్యమానికి సాక్షిభూతుడు అతడు 1910 లో జన్మిస్తే, ఆ ఉద్యమం 1913 నాటి బాపట్ల మహాసభలో పుట్టింది. తానూ దానితో పాటే పెరిగాడు కమ్యూనిస్టునేత పుచ్చలపల్లి సుందరయ్య విశాలాంధ్ర కోసం నినదించినప్పుడు తాను ఎగిరి గంతేశాడు. 1956లో సువిస్తృతమైన ఆంధ్రప్రదేశ్ అవతరించినప్పుడు తాను మదరాసులో ఉన్నా తన చిరకాల వాంఛ నెరవేరిందని శ్రీశ్రీ హర్షానందాలు పొందాడు కానీ తాను సృష్టించిన విరసమే ప్రత్యేక తెలంగాణా కావాలని కోరినప్పుడు, భరించలేక ఆసంస్థకు రాజీనామా చేశాడు. అయితే తాను వామ పక్షీయుడనని విశ్వసిస్తున్నందువల్ల, వామ పక్ష వ్యతిరేకతతో ఎప్పుడూ అక్షరం ముక్క రాయని శ్రీశ్రీ తద్విరుద్ధంగా ఏమీ రాయలేదు

వ్యక్తిగా శ్రీశ్రీలో కొన్ని బలవద్గుణాలూ ఉన్నాయి, బలహీనతలూ ఉన్నాయి. సినిమారంగంలో అతడి జీవితం చాలా ఢక్కాముక్కీలు తిన్నది అయినా ఆవ్యాపారం అతణ్ణి ఎప్పుడూ ఆదరించింది అరసంనుంచి వేరుపడి పోయి ఆంధ్రసాహిత్య అకాడమీ రాష్ట్రప్రభుత్వాల గుర్తింపు కోసం అంగలార్చిన ఇతరుల్లాగా అతడెన్నడూ సాహితీ రాజకీయరంగాలు రెంటిలోనూ వామపక్ష మార్గాన్ని వదిలిపెట్టి పారిపోలేదు పురిపండా అప్పలస్వామి వంటి శ్రేయోభిలాషులు సాహిత్య అకాదమీ పురస్కారం స్వీకరించమని ఒత్తిడి తెచ్చారు. నిరాకరించమని విరసం ఆదేశించింది. మామూలు ప్రకారం అతడప్పుడు పారితోషిక ధనం కావాలని అభిలషించినా, విరసం సిద్ధాంతాలకు అనుగుణంగా ఆసంస్థకు అధ్యక్షుడుగా తిరస్కరించాడు విధిలేక బహుమానం స్వీకరించి దాన్ని సొంత ముద్రణాలయం ఏర్పాటు చేసుకొనేందుకు విరసానికి విరాళంగా ఇచ్చి, ఆసమస్యను పరిష్కరిద్దామనుకున్నాడు. ఆ ప్రతిపాదననూ విరసం తిప్పి కొట్టింది కొంత అనిశ్చితిలో పడి, కొంత నాటకమాడి, తానా సొమ్మును బహిరంగంగా కాక రిజిస్టర్డు పోస్టులో వచ్చిన చెక్కురూపంలో స్వీకరించాడు! ఈ నేరానికి శిక్ష ననుభవించాడు అంతటిలో ఆ వ్యవహారం ముగిసింది.

పురిపండాతో కలిసి లండన్ వెళ్ళి సొంతగొంతుకతో దస్తూరీతో మహా ప్రస్థాన గేయాలను ప్రచురించగలిగాడు. అక్కడ అనేక రచయితలను కలిసినందుకు సంతోషించాడు. అమెరికా వెళ్ళి అక్కడ సొంత దస్తూరీలో శిప్రాలి అనే కవితా సంపుటిని వెలువరించి తాను మెచ్చిన మహా విద్వాంసుడు పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రికి (1890-1951) అంకితమిచ్చాడు. ఈ పర్యటనలు అతడి కళ్ళు తెరిపించాయి. కొంత వరకు ఆంగ్లభాషలో అతడికున్న పాండిత్య విస్తృతిని గురించిన విశ్వాసం సడలిపోయింది.

తిరిగి వస్తూనే తన ఇంగ్లీషు పరిజ్ఞానం పుస్తకాలకే పరిమిత మనీ, జీవద్భాషగా దానితో తనకు పరిచయంలేదని, తన భాషాభివ్యక్తి ద్వారా విదేశీయ సభల్లో ఎవర్నీ మెప్పించలేక పోయాననీ బహిరంగంగా ప్రకటించాడు తన వ్యక్తిగత గౌరవానికి భంగకరమైన విషయమైనా దాన్ని ఎన్నడూ దాచి పెట్టలేదు. ఇటువంటివే అతడితో ఎప్పుడైనా ఎంత పరిచయంగలిగిన వారికయినా అతడిమీద సానుభూతి పుట్టించి అతడు ఎదిగిన పసివాడని భావించేట్లు చేశాయి.

# ఏడో ప్రకరణం

## సాహిత్యంలో స్థానం

వేయిన పక్షం ఒక సహస్రాబ్ది చరిత్ర గల తెలుగు సాహిత్యంలో భావితరాల మనస్సుల్లో చెరగని ముద్ర వేయగలిగిన కవులూ రచయితలూ అనేకులున్నారు. ఒక వ్యక్తి సాధించిన ప్రశస్తిని బట్టి ఆవ్యక్తి ప్రభావం తరవాతి తరాలమీద ఉంటుంది కాబట్టి అది అందరికీ సమానం కాదు. అలాంటి మహోవ్యక్తుల సాహితీ సేవనుగురించి విపులంగా తెలిసిన సందర్భాల్లో గూడా చాలామంది జీవన విశేషాలు పూర్తిగా తెలియవు. ఆయా రచయితల ప్రభావం సమకాలిక సమాజం మీద ఎంతగా ఉండేదో, వారి వారి రచనలమీద వారి వ్యక్తిత్వ ప్రభావం ఏమాత్రం ఉండేదో నేటికీ స్పష్టంగా తెలియదు. తెలిసిన కాసిని విషయాలూ పుక్కిటి పురాణాల్లాంటివి. జానపద సాహిత్య పరిశోధన శైశవదశలోనే ఉన్నందువల్ల తెలియగలిగేదీ అల్పాల్పం. లిఖిత సాక్ష్యాలు దొరకని, ఆయా రచయితలకు మనం సమకాలికులం కావటానికి వీల్లేని సుదీర్ఘకాలం తరవాత, వారి నిజ జీవిత విశేషాలను గురించి ఏకొద్ది మంది విషయంలోనో తప్ప మనకు తెలిసింది చాలా తక్కువ. 1983 మధ్యకాలం దాకా శ్రీశ్రీ భౌతికంగా మన మధ్య ఉన్నాడు. అతడి నిజజీవితంలోని అనేకానేక విషయాలనూ అతడు రాసిన ప్రతి అక్షరాన్నీ చెప్పిన ప్రతి మాటనూ సవివరంగా ససాక్షికంగా గుర్తు పెట్టుకొన్న మిత్రులూ, అభిమానులూ ఇంకా అనేకులున్నారు. అది కూడా అతడి (సాహితీ) జీవిత చరిత్రకారుడు అతడి మేధాశక్తినీ రచనలనూ గురించి సంపూర్ణ నిష్పాక్షిక ధోరణిలో అంచనా వేయటంలో కొన్ని ఇబ్బందులు తెస్తుంది. తాను 'ఆత్మాశ్రయ కవి' నని తన్ను తానే అంచనా వేసికొని శ్రీశ్రీ స్వయంగా ప్రకటించినందువల్ల ఈ వ్యవహారం మరింత క్లిష్టమవుతున్నది. అయినప్పటికీ అతడి కవిత్వం అతడి నిజజీవితమంత అరాజక మయింది కాదనీ, అతడి రచనలు వామపక్ష (సోషలిస్టు కమ్యూనిస్టు) ఆదర్శాలను (వాస్తవికతను కాకపోయినా) ప్రతి ఫలిస్తున్నాయనీ చెప్పవచ్చు.

సాహిత్య చరిత్రలో సామాజిక రాజకీయ ప్రయోజనాలను సాధించిన సంప్రదాయ వ్యతిరేకమయిన తిరుగుబాట్లు కొన్ని జరిగాయి. (క్రీ.శ. 11వ శతాబ్దినాటి) నన్నయ మహాభారతం ప్రాచీన కన్నడ సాహిత్యంలో లాగే సంస్కృత పదభూయిష్ఠమై సాంస్కృతిక ఛందస్సులు ప్రధానంగా వాడిన రచన. ఆ కన్నడ గ్రంథాలు జైనులు రాసినవైతే,

అసంపూర్ణమయినా నన్నయ మహా భారత రచన వైదిక సంప్రదాయ ప్రతిపాదకం. ఆ తరవాతి శతాబ్దికి చెందిన నన్నెచోడ, పాల్కుర్కి సోమనాథులనే వీరశైవ కవులు వైదిక సంప్రదాయాలను ఖండించారు. తమ రచనల్లో కులరహిత సమాజాన్ని అపేక్షించారు. పాల్కుర్కి దేశీయ ఛ్ఛందస్సులనూ (వైదిక పురాణసంప్రదాయ విరుద్ధ) దేశీయ వస్తువులనూ కవితా విషయాలుగా స్వీకరించాడు. రంగనాథరామాయణ కర్తలైన వైష్ణవ కవులు అంతకన్నా సమర్థంగా సులభ భాషలో సుకుమార శైలిలో సోమనాథుణ్ణి అనుకరించారు. వారి రచన కొద్దికాలమైనా బహుళప్రజాదరణ సంపాదించింది (క్రీ.శ. 13వ శతాబ్దినాటి) తిక్కన మిగిలిన పదిహేను పర్వాలలో మహాభారత కథను పునః సృష్టించాడు అతడు సులభమైన దేశీయమైన పదప్రయోగాన్ని అభిమానించినా సాంప్రదాయిక ఛ్ఛందస్సులోనే వైదిక మత భావాలను చిత్రీకరించాడు ఆనాటినుంచీ తెలుగు సాహిత్య రచనల్లో రెండు రకాల భాషా శైలులు ఏర్పడ్డాయి - చాలా వరకు నన్నయ మార్గంలోనూ, క్వాచిత్కంగా తిక్కన తీరులోనూ సర్ సి ఆర్. రెడ్డి కాలం నుంచీ ఆధునిక సాహిత్య విమర్శకులు తిక్కన మార్గానుయాయులనుంచే మహాకవులను పేర్కొనటం విచిత్ర మనిపిస్తుంది సర్.సి.ఆర్. రెడ్డి ప్రకారం తిక్కన, పింగళసూరన, వేమనలు అలాంటి కవిత్రయమైతే, శ్రీశ్రీ అంచనాలలో తిక్కన, వేమన, గురజాడలే కవిత్రయం. అయితే శ్రీశ్రీ ఎంపిక తాను విశ్వనాథ దేవుల పల్లుల ప్రభావం నుంచి బయట పడిన తరువాత కొంత ఆలస్యంగా వెలువడ్డది. నవ్యకావ్య భాషాప్రపంచంలో భావ కవితా మార్గంలో ప్రభవ, సుప్తాస్థికలూ రచించిన శ్రీశ్రీ నన్నయ సంప్రదాయంలోనే సంస్కృత భూయిష్ఠమైన కవిసమయాల్తో సంప్రదాయ ఛ్ఛందస్సులతో పదగుంఫనను ప్రదర్శించాడు. కవికొండల, బసవరాజు, నండూరుల ద్వారా తన 'సొంత గొంతుక'ను కనుగొన్న తరవాత, అధివాస్తవిక వచన గీత పద్యాది రచనల్లో ప్రయోగాలు చేసిన తరువాత, చివరకు గురజాడ నాటక కవితా ప్రభావాలకు తన్మయత్వం పొందానన్న తరవాత కూడా మహా ప్రస్థానంలోని కొన్ని కవితల విషయంలో తప్ప ధారాళ సంస్కృత ధారాశుద్ధితోనే పదకల్పన చేశాడు పటిష్ఠమైన శైలినే పాటించాడు స్వదేశంలోని ఠాకూర్, అంతర్జాతీయ కవిగా స్విన్ బర్న్‌ల ప్రభావంతో శ్రీశ్రీ శబ్ద లౌల్యానికే పెద్దపీటవేసి అర్థం కన్నా శబ్దమే ప్రధాన మని భావించాడు అతడి వచన రచనల్లో ఈ దౌర్బల్యం కొంత తక్కువగా కనిపించినా, అతడి రేడియో నాటికల్లో కవితల్లో లాగా ఈ లక్షణం అధికం

శ్రీశ్రీ తాను గిడుగు వేంకట రామ మూర్తి భాషా సిద్ధాంతాలను సమర్థిస్తాననీ, సృజనాత్మక సాహితిలో శాస్త్రీయ రచనల్లో వర్తమాన భాషా రూపాలనే ప్రయోగించ దలచాననీ పైమాటలుగా చెప్పాడు. కానీ గ్రాంథిక వ్యావహారిక భాషా వివాదాల్లో స్పష్టంగా తలదూర్చలేదు. ఈ శతాబ్దిలోని మొదటి రెండు దశాబ్దాలకాలంలో ఈ వివాదంలో చొరబడటానికి అతడి వయసు చాలదు. 1940 తరువాత సుప్రసిద్ధుడై పోయినందువల్ల

అతడికి ఈ వాద వివాదాలను పట్టించుకొనే తీరికగాని, అవసరంగాని లేకపోయాయి. పురిపండాతో సంబంధం, పి.టీ. శ్రీనివాప అయ్యంగార్ కళాశాలలో చదవటం అతణ్ణి ఆధునిక భాషావాదం వైపు తిప్పిందిగాని, వాస్తవికంగా చూస్తే అతడి వ్యావహారిక వాదం ఉచ్చారణ విధేయంగా ప్రత్యయాంతరూపాలను వాడటానికే పరిమితం. క్రొత్తవంటి ప్రాచీన పదరూపాలనూ, అక్కడక్కడ విశాఖ మాండలిక పదాలనూ ప్రయోగించాడు. అయినా తాను గురజాడ భాషాశైలుల్లోని స్పష్టతనూ సౌలభ్యాన్ని అభిమానిస్తున్నానని చెప్పుకొన్నాడుగాని అలక్ష్యాన్ని అతడెప్పుడూ చేరుకోవాలనుకోలేదు. చేరుకోలేదు. భాషలో, భావనల్లో, ఛందస్సులో గురజాడతో పోలిస్తే శ్రీశ్రీ ఆధునికుడు కాదు. గురజాడ చిత్రీకరించిన సమాజస్వరూపం మహా విశాలమయింది. అతడు నాటకాల్లో, కవితలో, కథానికల్లో సృష్టించిన పాత్రలసంఖ్య అపారం; వాటి స్వభావాలు విభిన్నం, విశిష్టం, సజీవం, వాస్తవికం. ఈ విషయంలో శ్రీశ్రీ ఏనాటికీ గురజాడతో పోలడు. తన చరమ రాత్రి కథలు 'సింగిల్ పన్నాకవిత్వ'మని శ్రీశ్రీయే చెప్పుకున్నాడు తాను కథారచయితను కాననీ అంగీకరించాడు కాన అతడు సంస్కృతేతరమైన, ప్రధానంగా ఇంగ్లీషు భాషనుంచి పదజాలాన్ని స్వేచ్ఛగా ఎరువు తెచ్చుకున్నాడు. 'ఫస్టోబర్' (ఫస్ట్ అక్టోబరుకు సంక్షిప్తరూపం) వంటి కృతక పదాలను సృష్టించాడు గురజాడ ఇంగ్లీషు పదాలు వాడినా ఇలాంటి పదచిత్రాలకు ఏనాడు ప్రలోభ పడలేదు. శ్రీశ్రీ కవితలోని అత్యధిక భాగం సాంప్రదాయిక పద జాలంలోనే ఉంది. ప్రాచీన పౌరాణిక పాత్రలనూ ఐతిహ్యాలనూ స్వీకరించి వాటి ద్వారానే గతిశీలమైన, ఆధునికమైన అర్థాలనూ, పూర్తిగా విరుద్ధమైన సందేశాలనూ అందించగలిగాడు. సంప్రదాయంలోని ప్రాచీన పదజాలంనుంచి అతడు సరికొత్త జాతీయాలను భావాలనూ అభివ్యక్తం చేయగలిగాడు. ప్రాచీన ఛ్ఛందస్సుల సర్వపరిష్వంగాన్ని భగ్నంచేస్తాననీ వ్యాకరణ శృంఖలాలను విరిచివేస్తాననీ ఎంత ఘనంగా చెప్పుకున్నా, తన అభిప్రాయాలను బలీయంగా చెప్పదలచినప్పుడు హఠాత్తుగా సాంప్రదాయిక ఛ్ఛందస్సులనే ఆశ్రయించాడు. ఇలాంటి పనికి గురజాడ ఏనాడూ ఒడిగట్టలేదు. శ్రీశ్రీ రచనల మీద సిద్ధాంత వ్యాసం రాసిన మిరియాల రామకృష్ణ అతడు రాసిన ప్రతి పాదాన్నీ చరణాన్నీ పరీక్షించి, విభజించి, కత్తిరించి భిన్న భాగాల్లోనైనా వాటిలో సాంప్రదాయక ఛ్ఛందోలక్షణాలో వాసనలో (సుప్తచ్ఛందస్సులో గుప్తచ్ఛందస్సులో) ఉన్నాయని కనిపెట్టాడు ! మిరియాల ప్రతి పంక్తిలోనూ శ్రీశ్రీ వృత్తగంధిగద్యను రాశాడని నిరూపించాడు!

శ్రీశ్రీ పదప్రయోగం కాలక్రమాన సులభీకృతమయిందనటం నిజమే. అతడి ఉపమోత్ప్రేక్షలు కూడా అలాగే మొదటి రచనల్లో ఉన్నంత ఆకర్షకంగా, ప్రతీకాత్మకంగా, శబ్దలౌల్య పురస్సరంగా లేని మాటనిజం అందుకు కారణాలు చెప్పటం సులభం. ప్రాచీనాంధ్ర కావ్యాలనూ సంస్కృతాన్నీ ఆంగ్లకవితనూ ఎరగని అభాగ్యశ్రోతలకూ

పాఠకులకూ తన కవిత సులభ భాషలో సూటిగా స్పష్టంగా ఉండాలని అతడు నిరంతర కృషిచేశాడు. అతడి అద్భుత పదప్రయోగప్రభావం కాలక్రమాన మునుపటిలా ఆశ్చర్య చకితులను చేయటం తగ్గిపోయింది. వాటిలో మౌలికత లేనందుకుగాక, అతడి అసంఖ్యాకానుకర్తలూ అనుయాయులూ నిరంతరం వాటినే పున:ప్రయోగించి వాటిలోని కొత్తదనాన్ని చాలావరకు తగ్గించగలిగారు. చివరికి వాటిని రాజకీయ నినాదాలుగా మార్చివేశారు. ఈరకం అనుకరణలూ అనుసరణలూ అసంఖ్యాకంగా వెలువడినందువల్ల తెలుగు సాహిత్యచరిత్రలో మొట్టమొదటి సారి అతడు సృష్టించిన అపూర్వ కవితా సంచలనం పాతబడిపోయింది. అసమర్థాభిమానులు శ్రీశ్రీకి చేసిన వ్యతిరేక సేవాఫలితమది.

శ్రీశ్రీ సాంప్రదాయిక ప్రాచీన భాషాప్రయోగం మీద విమర్శ వచ్చింది విప్లవకవి అయినవాడు తన రాజకీయ సిద్ధాంతాలకు వీటిద్వారా అన్యాయం చేశాడని. అతడు అధునాతన విప్లవభావస్ఫోరక పదసృష్టిచేసి ఉండవలసిందని అనుయాయులు ఆక్షేపించారు. (సోవియట్) రష్యాలో క్రేస్టన్ మార్ అనే భాషా శాస్త్రజ్ఞుడూ అతడి అనుయాయులూ ఇలాగే వాదించారంతకు పూర్వం. దేవుడు వంటి పదాలను గూడా రష్యన్ భాషనుంచి బహిష్కరించాలనీ, కమ్యూనిష్టు వ్యతిరేకమైన మార్క్సిజానికి విరుద్ధమైన ఫ్యూడల్ రియాక్షనరీ లక్షణాలున్న మొత్తం పదజాలాన్ని ఆభాషనుంచి తొలగించాలనీ గొడవ చేశారు. గత దురాగతాలనూ, దౌర్భాగ్య సూచక చరిత్రనూ గుర్తుకుతేని సరికొత్త పదాలను సృష్టించాలన్నారు. చర్చల్లో జె.వి. స్టాలిన్ స్వయంగా రంగ ప్రవేశంచేసి, మార్క్సిస్టు భాషావేత్త పాత్రధరించి, భాష అనేది కేవలం అభిప్రాయ ప్రకటనకు ప్రజలు వాడే సాధనం మాత్రమేననీ, అది ఎవరి చేతిలో ఉంటే వారి భావాలను మాత్రమే సమర్థంగా ప్రతిబింబిస్తుందనీ నచ్చజెప్పవలసి వచ్చింది. గతంలో వాడుకలో ఉన్నమాటలను భిన్నభావార్థ బోధకు వర్తమాన కాలంలోని ప్రజలు తమ ఇచ్ఛానుసారం వాడుకోవచ్చు కాబట్టి ఈ మూర్ఖవాదాన్ని ఉపసంహరించు కోవాలని ఆదేశించాడు. మన అదృష్టం వల్లనో దురదృష్టంవల్లనో అర్థరహితమైన ఇటువంటి వాదాన్ని ముగించటానికి మనకో స్టాలిన్ అవసరం పడకుండానే శ్రీశ్రీకి ఈ దండయాత్ర వల్ల ప్రమాదం తప్పింది. ఆదుర్వాదం ఏవైపు నుంచీ సమర్థించే వాళ్ళుగాని ఖండించే వాళ్ళు గానీ లేక సహజ మరణం పొందింది.

శ్రీశ్రీ మరణానంతరం ఒక విచిత్ర పరిశోధకుడు అంతకన్నా అర్థ రహితమైన మహత్తర సిద్ధాంత గ్రంథ మొకటి ప్రచురించాడు. శ్రీశ్రీ మహాప్రస్థానం శ్లేషకావ్యమనీ, అందులో అంతరార్థంగా అద్వైత వేదాంత సారముందనీ, యోగశాస్త్ర సిద్ధాంతాలను ఎత్తిరాసి వాదించాడు । ఆవ్యక్తి పేరు చెప్పి అతడికి లేనిపోని ప్రాముఖ్య మివ్వనక్కర్లేదుగాని అతగాడు తన భ్రమప్రమలను సమర్థించుకోడానికి దయ్యాలు వేదాలు వల్లించినట్లు సంస్కృత పురాణేతిహాస శాస్త్రాలనుంచి పంక్తులకు పంక్తులు, పేరాలకు పేరాలు ఉదాహరించాడు. ప్రస్తావనవశంగానైనా ఇలాంటి ప్రయత్నాలకు పేర్కొనటంలో ఒక

ప్రయోజనముంది. శ్రీశ్రీ మహాకవి కాబట్టి అతణ్ణి ఎలాగైనా మనలో కలుపుకోవటం మంచిదని అతడి రచనలను అర్థమే చేసుకోలేని వ్యక్తులు కూడా తాపత్రయపడ్డా రనటాని కిదో నిదర్శన అతడి జనాకర్షణ ఎంతదాకా పోయిందో చెప్పటానికిది ఒక దృష్టాంతం. ఆబాపతు వ్యక్తుల దృష్టిలో మహాప్రస్థానం ఆధునిక భగవద్గీత; ఎన్నిరకాల భక్తులున్నారో అన్ని విధాలుగా భిన్నదృక్పథాల్లో దాన్ని వ్యాఖ్యానించవచ్చు! తెలుగు రచయితలు అసంఖ్యాకంగా అభ్యస్తం చేసి అలవాటుగా మార్చుకొన్న మరోవిపరీత లక్షణం తమ కలం పేర్ల చివర 'శ్రీ' తగిలించు కోవటం! శ్రీశ్రీ ఈ పద్ధతి ద్వారా అమర్త్యుడయినాడు!

అసలు సాహితీ రంగంలో శ్రీశ్రీ అడుగు పెట్టడమే త్రివిక్రమ పద్ధతిలో జరిగింది. సంప్రదాయ కవితాధర్మాలు తెలిసిన ఆధునిక భావకవిగా, ధారాశుద్ధిగల రచయితగా, మధురభాషా కవిగా ప్రపంచానికి ప్రభవ నిర్మాత భాసించాడు. క్షణాల మీద ఆనాటికే సుప్రతిష్ఠితులైన విశ్వనాథ దేవులపల్లుల సరసన అతడికి సింహాపీఠం లభించింది. ఇతివృత్తం ఎంత సందర్భ శుద్ధి లేనిదైనా సాధారణ పాఠకుణ్ణి సుప్తాస్థికలు చకితులను చేశాయి. అపూర్వ అత్యాధునిక రచనా ప్రక్రియగా ఆధునిక సాహితీ చరిత్రలో తళుక్కున మెరసి ఇంచుమించు దాన్ని అనుసరిస్తూనే మహాప్రస్థాన గేయాలు వెలువడి అఖండాభిమాన గౌరవాలు సంపాదించాయి. వాటిలోని వస్తువు, ఛందోరీతులు, రచనాశిల్పం అడవి బాపిరాజు వంటి సుప్రసిద్ధ రచయితనూ, ముద్దుకృష్ణవంటి ప్రసిద్ధ పాత్రికేయుణ్ణీ ఆకర్షించాయి ఆ ధోరణి అత్యంత నవీనం, అనిదంపూర్వం, అనపేక్షితం బాపిరాజు కృష్ణశాస్త్రులు ఆపాటలను బహిరంగ సభల్లో పాడి ప్రజాభిమానం సంపాదించారు. విశ్వనాథ తన జీవితంలో మొదటిసారి - బహుశా అదే చివరిసారి కూడా కావచ్చు - 'కవితా! ఓ కవితా' లోని శబ్ద సౌందర్యాన్ని, భావనాశబలతను, ఊహలను, శ్రోతృ పాఠకలోకం మనస్సుల్లో అది మొత్తం మీద కల్పించిన భావచిత్రాన్ని బహిరంగంగా ప్రశంసించాడు. సాధారణ కవులు సహజంగానే అతణ్ణి అనుకరించట మారంభించారు. కమ్యూనిస్టులు ఆరచనా విశేషాన్ని ప్రజల్లోకి తీసుకపోయి, గురజాడ సహపీఠంలో ప్రతిష్ఠించి ఆధునిక సాహితీ ప్రవర్తకుడని, వైతాళికుడని ప్రచారం చేశారు. అందువల్ల (అప్పట్లో) శ్రీశ్రీ గర్వించలేదు అతడి వినమ్రతా, అధోజగత్సహోదరుల మీద అతడి కున్న సానుభూతీ శ్రీశ్రీని ప్రజాకవిని చేశాయి అతడి మహారచనలోని కవితాగుణాన్ని పరిశీలించి దాని ప్రభావాన్ని గుర్తించగలవాళ్లు అతణ్ణే మహాకవి అన్నారు అనిదం పూర్వంగా ఆసంపుటిలోని కవితలు సాహితీ చరిత్రగతిని మార్చివేశాయి. విశ్వనాథ స్వయంగా చెప్పినట్లు కలం కాగితం అందుబాటులో ఉండి తన అభిప్రాయాలను వ్యక్తీ కరించదలచిన ప్రతి వ్యక్తీ అలారాసి అదే కవిత్వమని వాదించవచ్చు ఆ పరిస్థితి సామాన్యరచయిత లందరికీ వరప్రసాదమయింది; ప్రసిద్ధ కవులకు తలనొప్పిగా

పరిణమించింది. కవితా రచన ఏకొద్ది మందికో సాధ్యమైన విలక్షణత్వం కోల్పోయింది. శ్రీశ్రీ పుణ్యమా అని అదో క్రీడగా పర్యవసించింది.

అభ్యుదయ రచయితల సంఘంలో సభ్యుడుగా ఉన్న కుందుర్తి ఆంజనేయులు (1922-1982) తెలంగాణా అనే సుదీర్ఘ వచనకవిత వెలయించాడు. అతడే ఫ్రీవర్స్ ఫ్రంట్ అనే సాహితీ సంస్థను 1955లో స్థాపించగా యువ రచయిత లెందరో ఆకర్షితు లయినారు. అందులో సభ్యులైన కొందరు రాజకీయ సిద్ధాంతాలు కారణంగా విభేదించి 1965లో దిగంబర కవులనే పేరు పెట్టుకున్నారు. వాళ్లు ప్రపంచంలోని సమస్త దురాగతాలనూ అశ్లీల భాషలో కూడా దూషించి విప్లవం త్వరత్వరగా రావాలన్నారు. శ్రీశ్రీ వారికి స్వాగతం చెప్పాడు. వారి కవితలను ఆంగ్లీకరించి ప్రచురింప జేశాడు. ఇదే విధంగా అతడు సంప్రదాయ దూరులైన వారందరినీ ప్రోత్సహించాడు - దేశ వ్యాప్తంగానేగాక ప్రపంచంలోని ఏమూల ఎవరలా చేసినా హర్షించాడు సంప్రదాయ వ్యతిరేకత అతడి నరనరాల్లో జీర్ణించింది. 1970లో నక్సల్ బరీ ఉద్యమాన్ని అభిమానించిన రచయితలు మరోసారి వేరై ఒక సాహితీ సంస్థను నిర్మిస్తే శ్రీశ్రీ దాన్ని సమర్థించాడు. అభ్యుదయ రచయితల సంఘానికి సలాంచెప్పి విరసానికి స్థాపకాధ్యక్షుడైనాడు. హన్స్ రాజ్ బబ్బర్ సహ సమావేశకర్తగా ఆసంస్థను అఖిల భారత స్థాయికి విస్తరించే ప్రయత్నం చేశాడు. తలయెత్తిన ప్రతి నూతన సంస్థనూ పొటమరించిన ప్రతి నూతన భావాన్నీ ప్రోత్సహించే స్వభావమే అతడికి ప్రజారంజకత్వం సాధించి పెట్టింది. అతడికి మారుపేరైన మహాకవి అనే బిరుదానికి కారణమైన అతడి శక్తి సామర్థ్యాలను ఎవరూ శంకించలేదు ప్రశ్నించలేదు. 1940 ప్రాంతంలో శ్రీరంగం శ్రీనివాసరావు శ్రీశ్రీగా మారి, దరిమిలా కొద్ది కాలానికి మహాకవిగా పరిణమించాడు

శ్రీశ్రీ కార్టూన్ కవితకు ఆరుద్ర, గజ్జెల మల్లారెడ్డి సమర్థానుకర్తలు. తిలక్ రచనల్లో శ్రీశ్రీ కవితాభివ్యక్తి లక్షణాలు కనిపిస్తాయి అతడి శబ్దచిత్రానుసరణ ఆరుద్రా పట్టాభుల రచనల్లో ప్రతిఫలిస్తుంది. అతడి అధివాస్తవిక ధోరణినీ భావచిత్రకల్పనమూ తొలుత నారాయణబాబూ తరవాత అజంతా అనుకరించారు. అతడి సాహితీ 'సింహాసనానికి' ఇంకా చాలామంది వారసులమనే వాళ్లున్నారు తన స్థానంలో ఆపీఠాధ్యక్షతకు 'నియమించ' గలడనే విశ్వాసం కొందరికుంది. పెట్టుబడిదారులు అతడి మేధాసంపత్తినీ సమర్థతనూ బ్రహ్మాండంగా పొగిడారు. విప్లవకారులతడి భక్తులయినారు. సంప్రదాయ వాదులతడి ఛందోధికారాన్నీ భాషా పాటవాన్నీ అంగీకరించారు. అతడి రచనలనూ కేసెట్లనూ అద్దాల బీరువాల్లో డ్రాయింగ్ రూముల్లో ప్రదర్శించటం తమ సాంఘిక స్థాయికీ కవితాభిమానానికీ నిదర్శనమని విశ్వసించే సంపన్నులున్నారు. తాను జీవించిన సమాజం తన జీవిత కాలంలోనే ఇంతకన్నా ఏమో చేయాలని ఏకవీ ఆశించలేదు. క్లుప్తంగా చెప్పాలంటే అతడు సాహితీ ప్రజారంగాల్లో సజీవ కథానాయకుడైనాడు.

# ఎనిమిదో ప్రకరణం

## భూతభవిష్యత్తులు

తెలుగు సాహిత్య చరిత్రలో 1910 చాలా ప్రముఖమైన సంవత్సరం. ఆ సంవత్సరమే సరికొత్త ఛందోరూపాల్నీ, సామాజిక ప్రయోజనం గల నాటకాన్నీ, పాటనూ, సజీవ వర్తమాన భాషారూపాలనూ, ఆధునిక శైలినీ ప్రసాదించి గురజాడ నవయుగ వైతాళికుడుగా తెలుగు సాహితీరంగానికి వెలుగుతెచ్చాడు. వచనగీతాల నందించిన శ్రీశ్రీ కవితా భావాలనూ, రూపాలనూ విప్లవాత్మకంగా మార్చి అనేక పాశ్చాత్య భావాలనూ, సాహితీ ప్రక్రియలనూ స్వజాతి కందించాడు అతడు పుట్టింది ఆయేడే. ఏరోజు ఖచ్చితంగా ఏ క్షణాన పుట్టాడనేది అంత ముఖ్యంకాదు. తనంతట తానే చెప్పిన జన్మదినం అనుమానాస్పదమైన సందర్భంలో పురపాలక సంఘంవారి రికార్డులా? పంచాంగాలా? ఏవి ప్రమాణమనే ప్రశ్నముఖ్యంకాదు. అయినా తెలుగు సాహితీ స్వరూపాన్నే సమూలంగా మార్చటానికి ఉద్భవించాడనీ తన లక్ష్యం సిద్ధించేదాకా జీవించాడనీ చెప్పవచ్చు. ఈ పరమ సత్యం విషయంలో సందేహం లేదు.

శ్రీశ్రీ పుట్టింది సాంప్రదాయక కుటుంబంలో తెలుగు కవితా సంప్రదాయాలూ, ఆచార వ్యవహారాలూ అతడికి బాగా తెలుసు. అతడి సంస్కృతాంగ్ల భాషాజ్ఞానాన్ని వెలకట్టే విశ్వవిద్యాలయాలిచ్చిన డిగ్రీలేమీ లేవు కాని అతని రచనలు అందుకు సందేహం లేదని నిరూపిస్తాయి. బాల్యం నుండి భాషా భేదంతోగాని, ప్రక్రియా వైవిధ్యంతోగాని, నిమిత్తం లేకుండా అతడు సాహిత్యాభిమానం పెంచుకున్నాడు. తనకు నచ్చిన అన్య భాషా సాహిత్యాన్ని అనువదించటమో అది సాధ్యం కానప్పుడు పునః సృష్టిచేయటమో అలవాటు చేసుకున్నాడు మాతృవియోగం కలిగినా అతడి బాల్యజీవితం ప్రశాంతంగా ఆటపాటల మధ్య సాగింది ఉపాధ్యాయ వృత్తిలో ఉన్న జనక తండ్రి దగ్గరే పెరిగాడు - తన అభిరుచులనూ, నైపుణ్యాలనూ నిర్నిరోధంగా కొనసాగించే స్వేచ్ఛా వాతావరణంలో, తన స్వస్థలమైన విశాఖపట్నంలోనూ దగ్గర్లో ఉన్న విజయ నగరంలోనూ ఆకాలంలో అంతో ఇంతో పేరున్న సాహితీపరులందరితోనూ సంబంధాలు పెట్టుకున్నాడు. సాహితీ రంగంలో తన అభివృద్ధికి తోడ్పడగలిగిన విషయాలను వారిదగ్గర తెలుసుకున్నాడు - నేర్చుకున్నాడు. పసితనంలోనే పద్యరచన చేశాడు నాటకాల్లో నటించాడు. ఆటపాటల్లో కాలం గడిపాడు.

చివరకు అపరాధపరిశోధక నవలిక రాశాడు. మరోకల్పిత నవల రచించాడు ఉన్నత పాఠశాల వదులుతూనే వివాహ మాడాడు.

విశ్వనాథ దేవులపల్లుల ప్రభావంతో రాసి తన సవతితల్లి కంకిత మిచ్చిన ప్రభవలో అతడి భావకవిత్వం బహిర్గతమయింది ఇంటర్మీడియట్ పూర్తిచేసి పై చదువులకు మదరాసుకు చేరే నాటికే ఆధునిక భావాలున్న వర్ధమాన కవిగా గుర్తింపు సాధించాడు. మదరాసులో భిన్నరంగాలకు చెందిన ప్రసిద్ధ వ్యక్తులతో పరిచయం కలగటం, అడయార్ కన్నెమెరా గ్రంధాలయాల్లో అతడి సాహితీ తృష్ణను సంతృప్తి పరిచే సారస్వతం లభించటం ప్రపంచసాహిత్య ధోరణులు తెలిపి కళ్లు తెరిపించాయి. జంతు శాస్త్రం చదివినా కుటుంబం ఎదుర్కొంటున్న ఆర్థిక సమస్యలు ఎం.ఎస్ సి., ఎల్.ఎల్.బి. చదవాలనే అతడి కోరికను మొగ్గలోనే తుంచి వేశాయి యుద్ధానంతరం ఆర్థిక మాంద్యంలో రాజకీయాస్థిరత్వంలో సామాజిక సంక్షోభంలో ప్రపంచం మగ్గుతున్న దుష్కాలంలో ఉదర పోషణార్థం, కుటుంబ రక్షణకోసం ఉద్యోగప్రయత్నాలు చేయవలసి వచ్చింది మూడో దశకంలో భారతీయ రాజకీయరంగంలో అడుగుపెట్టిన కమ్యూనిస్టు సిద్ధాంతమూ తన దారిద్ర్యమూ అప్పట్లో తాను చదువుతున్న సాహిత్యం లక్షణాలూ అతడి సాంప్రదాయిక ధోరణిని తలకిందులుగా మార్చి విప్లవ కవితారచనకు పురికొల్పాయి. అతడి మనస్సు సరికొత్త ఆశావాదంతో దరిద్రమూ ఆకలీలేని నూతన ప్రపంచ నిర్మాణ వాంఛతో భావుకత్వంతో అల్లకల్లోలంగా ఉంది. ఆస్థితిలో మహాప్రస్థానం యుద్ధ భేరీ మోగించి యువలోకాన్ని ఉద్రేకపరచి పాతతరాన్ని నిరుత్తరులను చేసింది తెలుగు వాడైన ప్రతి సాహితీ పరుడూ ఈనూతన కవితవల్ల ఉత్తేజితుడైనాడు. అతడికన్నా వయో వృద్ధులూ లబ్ధప్రతిష్ఠులూ అయిన అడవిబాపిరాజు, దేవులపల్లి కృష్ణశాస్త్రి, బహిరంగా సభల్లో శ్రీశ్రీ పాటలు పాడి ప్రజాదరణ సంపాదించి పెట్టారు ఆనాటి తిరుగు బాటుదారు గుడిపాటి వెంకటాచలం మనసార అతడికి స్వాగతం పలికాడు. అతడికి పూర్వమార్గ దర్శకుడైన విశ్వనాథ బహిరంగంగా సాహితీ సభలో వేదిక మీద కౌగిలించుకొన్నాడు, చకితుడై. ఆవిధంగా ఒక మహాకవి ఉద్భవించి నేటికీ అలాగే జీవిస్తున్నాడు.

శ్రీశ్రీ పేదరికంలోనే గడిపాడు. పేదవాడుగానే ఉన్నత కవితాశిఖరాలధిష్ఠించాడు - అద్భుత భావనలతో, భావుకత్వంతో, భాషా ప్రయోగాలతో, తక్షణ జనాదరణతో. ఇక్కడా అక్కడా ఉద్యోగాలకోసం వేట సాగించినా, స్వభావరీత్యా అతడెందులోనూ నిలదొక్కుకునేదాకా ఇమడలేక పోయాడు. జీవితం దుర్భరమయింది. కోరికలు కొనలు సాగాయి. ఆరోగ్యం తరచుగా చెడిపోతున్నది - సాహిత్య విజయాలకు విలోమాను పాతంలో. తెలిసిన ప్రతి సాహితీ పత్రికలోనూ ఏదో ఒకటి రాసి చిల్లర సంపాదనతో జీవించ వలసి వచ్చింది. తన భవిష్యత్తు గురించి అతడు తీవ్రనిర్ణయం తీసుకున్నాడు. అది ఏక సమయంలో పూర్తి తప్పుగా, పూర్తి ఒప్పుగా పరిణమించింది ! కవిగా రచయితగా

సంపాదించి జీవనయాత్ర సాగించాలనుకున్నాడు - ఇటువంటి ఊహాపోలను సమర్థించి సాయపడటానికి సమాజం సిద్ధంగా లేనప్పుడు, అది తలాతోకాలేని ఆలోచనగా లోకం భావిస్తున్న సమయంలో. వచన గీతాలను సృష్టించాడు. తెలుగులో డాడాయిజం, అధివాస్తవికతల్లో ప్రయోగాలు చేశాడు. కథారచనలో చైతన్యస్రవంతి ధోరణిని ప్రదర్శించాడు సాహితీ రచనల్లో నూతన శిల్ప పద్ధతులను ఆవిష్కరించటానికి నానావిధమార్గాలూ తొక్కాడు తన సామాజిక రాజకీయ భావనలకు అతీతంగా కేవల కవిత్వాభిమానాన్ని పెంచుకొని రసాస్వాదన చేసే మార్గాలను చూపాడు

స్వయం లేఖన (Automatic Writing) పద్ధతులను ఎలా అభ్యసించాలో నిరూపించాడు. ఏదో విధంగా బతకటం కోసం తెలుగులో మొట్టమొదటిసారిగా పజిల్సు సృష్టించాడు సాహితీ సాహిత్యేతర పత్రికల్లో పనిచేశాడు. కొన్నిటికి వాస్తవ సంపాదకుడుగా, మరికొన్నింటికి విలేఖరిగానూ, సంపాదకుడుగానూ పనిచేసినా ఆ రంగంలోనయినా పదికాలాల పాటు నిరంతరాయంగా కృషిచేయలేదు. ప్రధాన సాహితీ మహాసభ లన్నింటిలోనూ పాల్గొన్నాడు. ఇంచుమించు సాహితీ సంస్థలన్నిటిలోనూ సభ్యత్వం స్వీకరించాడు. అతడి సాహితీ వ్యక్తిత్వ ప్రతిష్ఠలు క్రమాభివృద్ధి చెందాయి- అతడి దారిద్ర్య బాధలతో బాటు. అతడి ఉపన్యాసాలు పేలవంగా ఉన్నా సంభాషణ చతురుడనే పేరు సంపాదించాడు. సరదాగా బతికాడు. తానే చెప్పుకున్నట్లు అతడికి శత్రువులు చాలా కొద్దిమంది. ఏయువ రచయితకయినా అతడు అందుబాటులో ఉండేవాడు. వెనకా ముందూ చూసుకోకుండా ప్రోత్సహించేవాడు. నిశ్చితాదాయం కోసం సినీరంగంలో ప్రవేశించే నాటికే అతడు ప్రజల మనిషని పించుకున్నాడు.

ఈర్ష్యాసూయలు లేని ప్రసంగాలతో చమత్కారాలతో భాషాధికారంతో శ్రీశ్రీ సినీరంగంలో తనను నియమించిన వాళ్లను ఆకట్టుకొన్నాడు. అతడి విప్లవ ప్రచార ప్రసంగాలు పెట్టుబడిదారులను బాధించలేదు. ఇతర కళాకారుల కిష్టుడయినాడు. దాపరికంలేని ప్రవర్తనతో ప్రేమాభిమానాలు సంపాదించాడు. భారత కమ్యూనిస్టు పార్టీకి ఆతడిచ్చిన బహిరంగ సమర్థనలుగాని, అరసంతో ప్రజానాట్య మండలితో అతడికున్న సంబంధాలుగాని సినీరంగంలోని ధనవంతుల అభిప్రాయాలతో తన జీవిత విధానాలను రాజీ పరిచే పరిస్థితి కల్పించలేదు. అతడి వ్యభిచారం, గుర్రప్పందేల పిచ్చి, తాగుడూ అతణ్ని తప్ప మరెవరినీ బాధించలేదు. సంఘ జీవనంలో అతడు చేసిన తప్పులన్నీ క్షమార్హా లనిపించటమే వింత. అతడి సాహచర్యం మేధానైశిత్యంతో నిర్మొహమాటంగా హాస్య చమత్కార బంధురంగా గడిచేది. సాహితీ వైశద్యం అతడి దౌర్బల్యాలను మరుగు పరిచింది. కాలక్రమాన ప్రజాసేవకుడని 1953లో మదరాసు శాసన మండలి సభ్యత్వం లభించింది. అప్పుడతడికి చైనా ప్రభుత్వాహ్వాన మందిందిగాని రాజాజీ ప్రభుత్వం చేసిన తాత్సారం వల్ల అనుమతిగాని, ప్యాస్‌పోర్ట్ గాని లభించలేదు.

విభిన్న సంస్థలనుంచి శ్రీశ్రీ అనేక బహుమానాలను, పురస్కారాలను, ప్రశంసలను అందుకున్నాడు. హైదరాబాదులోని దక్షిణ భారత హిందీ ప్రచార సభవారు 'సాహిత్యాచార్య' బిరుదమిచ్చారు. గోకక్, పి వి. రాజమన్నార్‌ల తరువాత ఆపురస్కారమందు కున్న మూడోవ్యక్తి శ్రీశ్రీయే ఆయేడే రూ. 8,000 ల సోవియట్‌ల్యాండ్ నెహ్రూ పురస్కారమూ నగదు బహుమానమూ ప్రభుత్వాతిథిగా సోవియట్ యూనియన్ సందర్శించటానికి ఆహ్వానమూ అందుకున్నాడు. 1979లో పదివేల రూపాయల రాజ్యలక్ష్మి ఫౌండేషన్ పురస్కారాన్ని పొందాడు. ఆసంవత్సరమే ఆంధ్రప్రదేశ్‌లో అత్యుత్తమ వ్యక్తిగా ఆంధ్రజ్యోతి (వార్తాపత్రిక) అతణ్ని ఎంపికచేసింది. మరో 40 రోజులు జీవించనందువల్ల 1982 జ్ఞానపీఠ పురస్కారం అందుకోక పోయారంటారు. 1986లో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం హైదరాబాద్ ట్యాంక్ బండ్‌లో అతడి విగ్రహాన్ని ప్రతిష్ఠించింది. 1970 ఫిబ్రవరి 1న విశాఖపట్నంలో అతడి షష్టిపూర్త్యుత్సవం జరిగింది. ఆసందర్భంలో మొదట నిర్ణయించిన వేదికలో స్థలంచాలక ఉత్సవం మునిసిపల్ స్టేడియంలో జరపవలసివచ్చింది వందల సంఖ్యలో రచయితలు వీధుల్లో పాదయాత్ర చేశారు అతడి సప్తతి జన్మదినోత్సవం 1980 మార్చి 3వ తేదీన కాకినాడలో నిర్వహించారు. అప్పుడు అయిదువేల రూపాయలు బహూకరించారు. ఈరెండు సందర్భాల్లోనూ అతడి రచనలను పునర్ముద్రించారు. అమ్మారు. ప్రశంసాసంచికలు వెలువడ్డాయి. పదిహేనో శతాబ్దినాటి శ్రీనాథుడి తరువాత మరే తెలుగు కవికీ తన జీవిత కాలంలో ఇంత ప్రేమాభిమానాలూ ప్రశంసలూ శతాబ్దాలుగా లభించలేదు

శ్రీశ్రీ చాలాసార్లు విదేశయాత్రలు చేశాడు 1954లో స్టాక్‌హోంలో జరిగిన ప్రపంచశాంతి మహాసభలకు భారత ప్రతినిధిగా హాజరైనాడు. అదే సమావేశం తరపున 1959లో సోవియట్ రష్యా సందర్శించాడు - ఖర్చుల నిమిత్తం సొంత కారును కుదువబెట్టి ! 1967లో సోవియట్ ల్యాండ్ నెహ్రూ పురస్కార మందుకోవటానికి ఆ దేశ ప్రభుత్వాహ్వానంమీద రెండోసారి సందర్శించాడు. డ్వాక్టర్ కోట్నీస్ స్మారక సంఘం వారికోరిక మీద 1976లో మూడు వారాల పాటు చైనా పర్యటనచేశాడు పురిపండాతో కలసి గూటాల కృష్ణమూర్తి అతిథిగా 1980-81లో ఇంగ్లండ్ వెళ్లాడు. గూటాల లండన్‌లోని '1890 సంఘం' సంస్థాపకుడు. అక్కడ నాలుగున్నర నెలలుండి జార్జి బేకర్, జొనాథన్ గ్రిఫిన్, రాబర్ట్ బూత్, మదాం అనీ స్మిత్, మార్టిన్ గాఫ్, చెరిక్ స్టాట్ ఫోర్డ్, శ్రీమతి ఎలిజబెత్, లాంగ్‌ఫోర్డ్ రాజకుమారి, భద్రిరాజు కృష్ణమూర్తితో కలిసి నేటి తెలుగు భాషకు సువిస్తృతమైన వ్యాకరణంరాసిన మాజీ ఐ.సి.ఎస్ ఉద్యోగి జె పి ఎల్.గ్విన్ (ఇతడు ఆక్స్‌ఫర్డ్ యూనివర్సిటీ ప్రెస్ తరపున ఒక తెలుగు - తెలుగు నిఘంటువును ఆధునిక భాషకోసం ప్రచురించాడు కూడా) వగైరాలను కలిశాడు. లండన్‌లోనే మహాప్రస్థాన గేయాలు అతడి గొంతుకతో, దస్తూరితో రికార్డయి ప్రచురితమయినాయి. 1981 మేనెల

23, 24 తేదీల్లో చికాగోలో జరిగిన మూడో ఉత్తర అమెరికా తెలుగు మహాసభలకు హాజరయినాడు. 1981 జూన్‌లో రెండోసారి భార్యాసమేతంగా అమెరికా సందర్శించాడు అప్పుడు శిప్రాలి అనే కవితా సంపుటిని సొంత దస్తూరీతో హ్యూస్టన్‌లో ప్రచురించాడు. డి.ఎ.ఎ.ఎన్. నారాయణరావు వంటి అభిమానులు ఈ అమెరికా యాత్రలకు తోడ్పడ్డారు.

కాలస్వభావానికి అనుగుణంగా పరిశోధకులు శ్రీశ్రీని వదిలి పెట్టలేదు. ''శ్రీశ్రీ కవిత్వం· వస్తువు - సంవిధానం : 1926-1947 అనే సిద్ధాంతవ్యాసం రాసిన మిరియాల రామకృష్ణ తన పరిశోధనను పునః పరిశీలించి కాకినాడలో శ్రీశ్రీ సప్తతి జన్మ దినోత్సవం జరిగినప్పుడు 1970లో విడుదల చేశాడు ''మార్క్సిస్టు దృక్పథంలో మహాప్రస్థాన'' మనే ఎం.ఫిల్. సిద్ధాంత గ్రంథ రచన చేశారు మిక్కిలినేని సుశీలగారు కె.వి రమణారెడ్డి ''జగన్నాథరథ చక్రాలు'' (1986) విరసం ప్రచురణ. శ్రీశ్రీ రచనల గురించి అనేక వ్యాసాలూ సంపుటలూ వెలువడ్డాయి తన జీవితకాలంలో తన రచనలనూ, వ్యక్తిత్వాన్నీ విశ్లేషించి మూల్యాంకనం చేయించుకోగలిగిన కొద్దిమంది అదృష్టవంతుల్లో శ్రీశ్రీ ఒకడు. శ్రీశ్రీ అస్తమయానికి తెలుగు దినపత్రికలు సంపాదకీయాల్లో సంతాపం వ్యక్త పరిచాయి. అనేక రాజకీయ సామాజిక దృక్పథాలున్న రకరకాల సాహిత్య సంస్థలు ప్రత్యేక సంచికలు ప్రచురించాయి. క్లుప్తంగా చెప్పాలంటే ఇవన్నీ తెలుగు దేశంలో తిరుగులేని ఒకే ఒక మహాకవి పొందగలిగిన ఏకైక విశిష్టాధి కారానికి చిహ్నాలు

అనేక పర్యాయాలు శ్రీశ్రీ ఎదురుదెబ్బలు తిన్నాడు. ఎన్ని పొగడ్తలు పొందాడో అన్ని శాపనార్థాలూ లభించాయతడికి అతడు ప్రేమించి దగ్గరకు తీసి ప్రోత్సహించి ఒడ్డెక్కించిన వ్యక్తుల దగ్గరనుంచే అతడు నిందలు పొందటం పరమ దురదృష్టం. తనచేత మహామేధావులనిపించుకున్న తన బంధువులు నారాయణబాబు, ఆరుద్రలు అతణ్ణి అధః కరించారు. ప్రజానాట్య మండలి నుంచి అనేక మంది సభ్యులు సినీరంగానికి వలస పోయినప్పుడు, అభ్యుదయ రచయితల సంఘంనుంచి అనేక లబ్ధ ప్రతిష్ఠులయిన రచయితలు తప్పుకొని ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రాపకం కోసం అంగలార్చినప్పుడు రచయితలూ, సంపాదకులు వార్తా పత్రికలూ కట్టగట్టుకొని కమ్యూనిస్టు పార్టీమీద ధజమెత్తినప్పుడు శ్రీశ్రీ సూటి పోటి మాటల్తో అప్రతిష్ఠ పాలయినాడు. అతడు తిరగబడి వారందరినీ ఎదుర్కొన్నాడనేది మరోవిషయం. తాను ప్రథమ గురువనీ ద్రోణాచార్యుడనీ నెత్తిన పెట్టుకొన్న అబ్బూరే 1956లో తన మహాప్రస్థాన రచనా విధానాన్నీ అందులో ప్రతిపాదించిన సిద్ధాంతాలనూ వెక్కిరిస్తూ ఖండిస్తూ ఓ కవిత రాశాడు. తన షష్టి పూర్తి సందర్భంలో పంపిన సుహృల్లేఖలో కూడా శ్రీశ్రీ కలలుగన్న సోషలిస్టు సమాజాన్ని ఏర్పరచలేక పోయినందుకు అబ్బూరి తన సహజ వ్యంగ్య ధోరణిలో ఆక్షేపించాడు. 1936 తరువాత అబ్బూరి రాయిస్టుగా రాడికల్ హ్యూమనిస్టుగా మారటం ఒక ఎత్తు; శ్రీశ్రీ చేతుల్లో లేని సమసమాజ స్థాపన నెరవేరనందుకు అతణ్ణి ఎత్తి పొడవటం

మరోఎత్తు 1970 నుంచీ శ్రీశ్రీ విరసం చేపట్టిన కార్యక్రమాలకూ ఆదర్శాలకూ తన్ను అంకితం చేసుకున్నాడు. అయినా ఆంధ్రప్రదేశ్‌ను ముక్కలు చేయాలనే ఆలోచనను కూడా భరించలేకపోయాడు. స్వీయాభిమానాలను అన్ని సమయాల్లోనూ సవరించుకొని విరసానికే వంతపాట పాడటం అతడికి చేతకాలేదు. తామే ప్రతిష్ఠించిన సింహాసనం మీదినుంచి వాళ్లే రెండుసార్లు శ్రీశ్రీని కిందికి దించారు హైదరాబాదులో 1980 జూన్ 1 వ తేదీన ఘెరావు చేయటం వాళ్లుచేసిన అమర్యాదకు పరాకాష్ఠ. మరోవైపు మరెవరో చేసిన ప్రకటనకు శ్రీశ్రీని బాధ్యుణ్నిచేసి ఒకప్పుడు తనతో బాటు పాశ్చాత్య సాహితీ ప్రపంచ విహారానికి శ్రీశ్రీని తీసుకపోయిన పూర్వగురువు రోణంకి అప్పలస్వామి నిర్దాక్షిణ్యంగా విమర్శించాడు వేగుంట మోహన ప్రసాదనే రచయిత కొన్ని తెలుగు కవితల ఆంగ్లానువాదాలను ప్రచురిస్తూ ''ద టెన్స్ టైమ్'' అనే పేరుగల ఆగ్రంథం తొలిప్రతిని బహిరంగ సభలో బహూకరిస్తూ శ్రీశ్రీ, 'ఆధునిక కవితాపితామహు' డని శ్లాఘించాడు పత్రికావార్త చూసి రోణంకి ఆ బిరుదుకు అభ్యంతరం చెప్పాడు శ్రీశ్రీ కావాలని తెగబడి గురజాడ పీఠాన్ని కబళిస్తున్నాడనుకొని రోణంకి ఆవార్తను ఖండించాడు ''ఎదురుదాడి'' గా శ్రీశ్రీ ఘోరంగా విమర్శించి వెక్కిరించాడు రోణంకిని. అతడు చేసిన వ్యాఖ్యలు అమర్యాదకరం శ్రీశ్రీ తన సహజ ప్రవృత్తికి విరుద్ధంగా ప్రవర్తించాడు శ్రీశ్రీ అనవసరంగా ఆత్మన్యూనతగా భావించి తాను తప్ప మరెవరూ సక్రమంగా ప్రవర్తించలేరన్న ధోరణిలో వ్యవహరించాడు. నిజానికి ఆధునిక కవితా వైతాళికు లెవరనే ప్రశ్నకు సరైన సమాధానం సమాజం, కాలం ఇవ్వవలసినదేగానీ పండితులు వాదోపవాదాలతో అప్పటికప్పుడు తేల్చేది కాదు. తానప్పటికే ప్రముఖ సాహితీ వ్యక్తిగా గుర్తింపు పొందాననీ, తాను చాటుమాటున పలికిన పలుకులనుగూడా మిత్రులూ శత్రువులూ సేకరించి, పరీక్షించి, వ్యాఖ్యానించి, విమర్శించవచ్చుననీ శ్రీశ్రీ గ్రహించలేదు.

అనేక సామాజిక రాజకీయ దుశ్చర్యలకు పాల్పడ్డాడనే నిందలు శ్రీశ్రీకి తప్పలేదు. ఎన్నోసార్లు తాను నిరీశ్వరవాదినని బడాయి మాటలుచెప్పిన శ్రీశ్రీ తిరుమల కొండమీద శాస్త్ర సంప్రదాయానుగుణంగా తన కొడుకు ఉపనయనం చేశాడు. ఢిల్లీ కన్నడ సాహిత్య పరిషత్తు వారు బహూకరించిన మురళీ కృష్ణుడి చందన విగ్రహాన్ని ఆత్రంగా పొట్లాం విప్పి బహిరంగంగా కళ్ళకద్దుకున్నాడు. ఇవి సామాజిక దుశ్చర్యలు. తాను ఆంధ్రప్రదేశ్ పౌరహక్కుల సంఘానికి అధ్యక్షుడుగా ఉండికూడా ఎందరో రచయితలు సంతకం చేసినట్లు అత్యవసర పరిస్థితిని తొలగించమనే విన్నపంమీద సంతకం పెట్టలేదు. అది 1977 ప్రాంతాల్లో. అంతకు ముందు 1971లోనే ఎన్నికలను బహిష్కరించమని విరసం కోరుతున్నప్పుడు శ్రీశ్రీ భారత కమ్యూనిస్టు పార్టీ అభ్యర్థిత్వం కోసం ప్రయత్నించాడు. 1977లో ఇందిరా గాంధీని, ఆమె మళ్ళీ ఎన్నిక కావటాన్ని సమర్థించాడు. ఆమె పరిపాలన పీడిత ప్రజల నియంతృత్వమని భాష్యం చెప్పాడు. 1983లో ఎన్.టి.రామారావునూ

ఆయన స్థాపించిన తెలుగు దేశం పార్టీనీ సమర్థించి కాంగ్రెస్ ప్రభుత్వం పతనం కావాలన్నాడు. శ్రీశ్రీ తన కారణాలు తాను వివరించాడు. అయితే విరసం పట్టించుకున్నంత తీవ్రంగా మరెవ్వరూ ఈ వ్యవహారాలను లక్ష్యపెట్టలేదు మహాకవి తొక్కుమాటలు మాట్లాడుతుంటాడనీ, అజ్ఞాన పూర్వకమైన రాజకీయ ప్రకటనలు చేస్తూంటాడనీ, అతడి ధోరణి అనూహ్యంగా ఉంటుందనీ లోకం భావించింది. సమకాలంలోని తెలుగు కవుల్లో అతడున్నతోన్నతుడు కానీ అతడి ఆలోచనలు ప్రవర్తనలు చిన్నపిల్లల స్థాయికన్నా ఎక్కువ కాదనే భావం, అంచనా జనసామాన్య దృష్టిలో అతడి వ్యక్తిత్యాన్ని గురించి కలగటం అతడికి శ్రీరామరక్ష వ్యక్తిగతమైన నీతి బాహ్య ప్రవర్తనగానీ, సామాజిక బాధ్యతా రాహిత్యం, రాజకీయ వైఫల్యాదులు సుదూర భవిష్యత్తులో గుర్తుండవు అతడి సాహితీ శిఖరాయ మాణత్వం అతడి దుష్ప్రవర్తనలను, బలహీనతలను, విపరీత ప్రవృత్తినీ తొక్కిపెట్టగలిగింది.

కేన్సరుతో నిండిన తన మృత దేహాన్ని విశాఖపట్నంలోని కింగ్ జార్జి ఆసుపత్రికి సమర్పించాలని అతడి కోరిక. ప్రచురించిన తన వీలునామాలో అటువంటి కోరికను వెలిబుచ్చాడు. అయితే అతడి మరణానంతరం శ్రీశ్రీ కుటుంబం అన్యథా నిర్ణయించింది. అతడి భౌతిక కాయాన్ని సాంప్రదాయికాచారాల ప్రకారం దహనం చేశారు. చితాభస్మాన్ని వారణాసికి తీసుకపోయి గంగా జలంలో నిమజ్జనం చేశారు చితి రాజుకుంటున్న సమయంలో మరో అనూహ్య పరిణామం సంఘటిల్లింది విప్లవ రచయితలు నినాదాలు చేస్తూ శ్రీశ్రీ నక్సల్‌బరీ ఉద్యమాన్ని పురస్కరించు కొని రాసిన ''ఊగరా ఊగరా ఉరికొయ్యపట్టుకొని'' అనే పాటను ముక్తకంఠంతో ఏకగ్రీవంగా పాడారు. శ్రీశ్రీ తాను కవిత్వంకోసమే జన్మించానని విశ్వసించాడు కవిత్వంలోనే బతికాడు తానే రాసిన కవిత మారుమోగుతుండగా కాలి బూడిదై పోయాడు! 1983లో అతడు భౌతికంగా మరణించినా మరికొన్ని సహస్రాబ్దాల పాటు అతడి కవిత్వం బతికే ఉంటుంది తన జీవిత కాలంలోనే చరిత్ర ప్రసిద్ధుడైన శ్రీశ్రీ అనంతర కాలంలో కూడా అలాగే జీవిస్తాడు. కవిత్వ మున్నంతకాలం, కవితా రసాస్వాదన ఉన్నంత కాలం, కవితానుభూతి ఉన్నంతకాలం అతడు ఉంటాడు

# అనుబంధం I

## 1. TO POESY : A RHAPSODY

Poesy o poesy
It was long long ago
It was once upon a time
I was young I was green
There was nothing to be seen
The fragrance of my hope
Clung to me like a robe
So long long ago
At once upon a time
Where were you then
Ask the far horizon
In my hope in my dream
I thought I saw your crepuscular car
How beautiful you were
How beyond my reach
Far beyond my gaze
In the days long agone
My life I loafed alone
Dedicated consecrated
To you to you to you
My life I laughed away
Seeking seeking seeking
I almost forgot
What it was I sought
The intoxicated moments
Were an endless torment
And I knew not
Which was which what was what

This five fingered magic was it you
This imitation of inspiration
This decor of rhetoric
This syllogistic illogic was it you
I knew not then
And what was your form
What sybaritic grace what wind commanding norm
Dulcet halcyon
Eohippus celestial griffon
I knew it wasn't you
I rotted in my room
I waited in the gloom
Alone alone alone
Those days long agone
That onced upon my time

And as I chimed
Drenched in the downpour of my dream
Always expectant
By my discipline putrified
By my determination petrified
With many a fiery sonata
In my medulla oblongata
pleading Oh when Oh when
Shall the gates of creation open
As thus I waited
With my breath bated
What shouts what hetaerae what chimacrae
What parallelograms of emotions
What ultramarine exultation

Bursting on my head
Thud thud thud thud
How did my song come to life
What was it I had seen
I had heard I had been
Was it the midnight sky rending
The very heaven descending
In a perpetual perpendicular of rain
Blowing conch blasting drum
In the Ocean's skyscraping storm
I heard that very night
In the forests intricate
Metreless but not meaningless
The noises and voices of hunger and sex
Of wild animals Leo the rex roaring
Growling tiger prowling jackal howling
And too I heard
The music of the spheres
The symphony orchestra of the stars
The earthquake's ultimatum
Empires crumbling
Governments tumbling down
And I heard the reverberating conflagrations
Of wars and revolutions
There you are
Always everywhere
Immedicate as here
Instantaneous as now
And how
Could I enumerate

All that I saw that I heard
As I thought of you
How could I construe
In so many words
All the sounds all the visions
Conjured up by my contemplation of your presence
Refulgent diamond
Flowering in a lake of fire
Ferric falcon flying
Bells of fever peeling
In the cannon's mouth a deafening choir

And more and more and more
The sight and sounds galore
I saw the maternity ward the midnight birth
A young mother hugging her newborn babe
I heard her dreams describing
Honeysweet vortices in her mind
I heard the sleeping baby
sing the singsong ding-dong memories of its past
And then the vast
Magnified closeup of the patient chloroformed
In a twilight of life and death
I heard his nervestrings thrum
His blood vessels hum
And I saw the drunken bum
Immobilized in the gutter
I heard his confused stutter
Complaining to the dogs
Explaining to the stars

In incomprehensible rigmaroles
The deep sea wisdom of his inner soul
Again I heard I heard I heard again
The strained refrain of strident pain
Welling in the eyelids halfclosed
Of the metropolitan pros -
titute locked in the act
Of carnal *diablerie*
Trading love's counterfeit zeal
For a fee that buys her a meal
I also heard
The whispered secret of the hanged head
I heard the froggy ragtime owlish hoot
Of the madman's foggy crackpot brain
And the shouts of the striking workers
The workers' womenfolks' childrens'
Hungry angry churning burning cries
I heard the wounds of a million stars
The sounds of ten million waterfalls
And the songs of a hundred million waves
All these and more and more

And then when I strove
To express all that I had seen had heard
The crowding words milling in a stampede
abondoning the cemeteries of dictionaries
Snapping the chains of grammar
Forth from the serpentine embrace of prosodies
Issuing endlessly stupendously
Gushing flushing on rushing

Engulfed my being overwhelmed my heart
Oh blessed state
Grand confusion might precipitate
Of rococo sirocco haunting glow
I did not know
What roads I roamed
What joys were mine
My sins washed off by the magic music I mused
All my senses awake
For your only sake
I could not say
Whether it was night or day
What it was I wrote or which way I sped
Whether I was living or dead
Was this indeed *nirvana*
Hypnosis of my song's *dhawana*
A song that was born of the bridal embrace of stars
My nerves its violinstrings
My life held in its grip of eaglewings
Beyond the dualities of happiness and sorrow
Magnificent marvellous
Dreamlong souldeep
Alone absolute
Beyond the beyond
Instant made everlasting
I melted in the strange expereience
Of the essence of existence
As when long ago
So once upon a time
My I-ness lay asleep

In its maternal womb
It was you that said to my who
"I give you hunger and thirst
"I give you love and lust
"I give you the sky and its curse
"Go forth be born" I was born
Since then I wandered forlorn
I garneared some gladness much sadness
All that I humbly accepted
*Ami* of everyone enemy of none
Receiving your bounteous benison
I no longer am alone
I am wholly because of you holy
Therefore this day
I dare sony
Let the wildest flights of my imagination
Bearing in their stride
My most heartrending sighs
Come home to roost upon my shoulder
As I grow older
I do not care
I do not worry at all
If my sight of personal defeat were heard or not
This is my one desire
That when I begin to sing
The race of man take up that song
And like a gong's
It tintinnabulations
Be carried to the farthest limits of earth
And the utmost reaches of the sky

And the sky itself to be sure
Shall be mankind's near neighbour
All that I say
Shall be shared and shared equally
By one and all
My mansize madrigal
Woven of winds
Blowing around your sungirdling wings
Shall be a tabernacle
For you always to dwell
Thus at last in a final fulfilling
As a votive offering
The wafting flower dust
Of my impassioned incantations
My intensest hallucinations
Shall settle down at your feet
You I greet
Oh great river of ecstasy
Giver of life megaphone of prophecy
Mother of generations yet to come
Humanity's future home
Poesy O poesy.

(మూలం : కవితా! ఓ కవితా!
ఆంగ్లానువాదం · మూలరచయిత)

## 2. POETRICS

Teeny weeny pups
Eeny meeny ships
Sheeny shiny soaps
All World silent or noisy
Is material for poesy.
Cottage lamps
Postage stamps
Dreams and 'dromes and shrimps and gamps
Rule the realms of Art for sure
All Art is grand, all Art is pure.
A slice of bread
A piece of wood
A rotten plantain that's no good
Each stares at you
Joy shares with you
There is beauty, there is grace
Here and there and every where
Inspired be
By sea, by tree
Everything see and anything say
The world is a labyrinth strangely arranged
And poesy a deep thirst ever unquenched.

(మూలం : కుక్కపిల్ల
ఆంగ్లానువాదం · మూలరచయిత)

## 3. PATRIOTISM

Your country brother, shall be your love!
Good into better you shall improve!
Let idle chatter
Get no quarter !
Great deeds indeed are needed now!

Work hard, work long in farm and factory!
Let the land flourish in milk and honey!
Food is good
To build brawn and blood!
No brawn, no man - and man is body!

Wisplike, wasplike men are a shame!
With such goes down a country's name!
Move, move faster!
All arts master!

Flood the land with goods, all made at home!
Spread your handiwork all over the world!
Swadeshi everywhere be sold!
That man is filth
Who cannot creat wealth :
He can never hope for glory or gold!

A little that is good, a lot that is bad,
That is what the past is, so do not look back!
Do not be a sluggard,
Take a step forward!
If you fall behind once, then forever you shall lag!

Compete only when knowledge sells;
Only in commerce contest at all;
Strife is no good,
Nip it in the bud!
Throw away the sword, it is a total loss.

Are you a patriot? Do not shout it aloud!
Bragging never did anybody any good!
Quietly instead
Do a fine deed!
Let the people see it, it is they that decide!

The nation is sucked to the marrow, alas!
By ghoulish jealousy, devılish distrust!
Be glad when the other
Be happy, Oh brother!
Learn the lesson of Unity to hold the past!

The sinful wretch who weeps all day
Because another is rich, how can he be gay?
Always happy
Is really he
who sees his own in the other's joy!

So friend ! Think less of selfish ends
And lend your neighbour a helping hand!
Never does land
Mean clay and sand
The people, the people! they are the land!

Hand is friendly hand enlocked
Shall all the people together walk!
In brotherhood

All creeds, all breeds
Shall live and move and love and laugh!

Faiths may differ but what does it mean?
If minds are one, all men are one!
One day the soul
Of the human whole
Shall rise and grow and forever shine!

Like a tree a country shall
Put forth its flowers of love and all
The toiling people's
Sweat in ripples
Shall feed the roots for the tree to yield wealth!

Amid the foliage easily hiding
Sweet poesy like a bird shall sing!
In response
All hearts at once
Shall sprout a patriotic song!

(మూలం : గురజాడ దేశభక్తి గీతం
ఆంగ్లానువాదం: శ్రీశ్రీ)

## II. శ్రీశ్రీ ఇంగ్లీషులో రాసిన కవిత

## A SONNET IN MY BONNET
## (For Indira Devi Dhanrajgir)

Now comes the time of nine times nine, the time
Of time that is a mime of all that's yours and mine
Now octet sings unsung in the rime of slime
And wonders wonderstruck in women and wine
Lord me and land me said the horde without a mind
Grind me and find me in the haystack said the pin
All that was long ago when in a trice the wind
Sinned in the sunned sands sans bone and skin
Lad me said the lass and then alas
The lost nonet in the sonnet creeped and weeped
God me and guide me and goad me said the grass
When the deep asleep surreptly through my two eyes peeped
All wrong orang, said the throng as insults heaped
As moon was mapped, as is at last was was.

(శ్రీశ్రీ ఇంగ్లీషులో రాసిన కవిత, తేదీ 7-1-1969 నాటిది)

## III. శ్రీశ్రీ రచనలు

1928 **ప్రభవ,** కవితాసమితి, విశాఖపట్నం.

1946 **వారం వారం,** ప్రతిమా బుక్స్, ఏలూరు.

1947 **సంపెంగతోట** (ఛెహోవ్ రాసిన 'చెర్రీ ఆర్చర్డ్'కు అనువాదం), ప్రజాసాహిత్య పరిషత్తు.

1950 **మహాప్రస్థానం,** నళినీకుమార్, మచిలీపట్నం (విజయవాడ, హైదరాబాద్ లోని విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ వారు 1952-84 మధ్య 20 సార్లు పునర్ముద్రించారు).

1952 **అమ్మ** (కారల్ ఛెపెక్ రాసిన 'మదర్' అనే నాటకానికి అనువాదం) అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు (సోషలిస్టు పబ్లికేషన్స్, విజయవాడ, 1967లో)

1954 **మేమే,** త్రిలింగ పబ్లిషర్స్, విజయవాడ.

1956 **మరో ప్రపంచం** (రేడియో నాటికలు), అరుణరేఖ ప్రచురణలు, నెల్లూరు (శీర్షికను "1+1=1" అని మార్చి విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ, 1979, 1984).

1956 **త్రీ ఛీర్స్ ఫర్ మ్యాన్,** అభ్యుదయ ప్రచురణలు, మద్రాసు.

1957 **చరమరాత్రి** (కథలు), గుప్తాబ్రదర్స్, విశాఖపట్నం.

1958 **మానవుడి పాట్లు** (మైఖేల్ షొలకోవ్ నవలకు అనువాదం), విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ

1958 **సౌదామిని** (పురిపండా అప్పలస్వామి కవితలకు ఆంగ్లానువాదం) అద్దేపల్లి అండ్ కో, రాజమండ్రి.

1959 **గురజాడ,** మన సాహితి, హైదరాబాద్

1964 **మూడు యాభైలు,** విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ.

1966 **ఖడ్గసృష్టి,** విశాలాంధ్ర ప్రచురణాలయం, విజయవాడ (1984లో పునర్ముద్రణం).

1969 **వ్యూలు రివ్యూలు,** మినర్వా ప్రెస్, మచిలీపట్నం.

1970 **శ్రీశ్రీ సాహిత్యం** (5 సంపుటాలు), షష్టిపూర్తి సన్మాన సంఘం, విశాఖపట్నం.

1970 **శ్రీశ్రీస్ మిసెలనీ** (ఇంగ్లీషు రచనలు), షష్టిపూర్తి సన్మాన సంఘం, విశాఖపట్నం

1971 **రెక్కవిప్పిన రివల్యూషన్** ('ద బిగినింగ్ ఆఫ్ ద ఎన్డ్'కు అనువాదం), ఉద్యమ సాహితి, కరీంనగర్

1973 **వ్యాసక్రీడలు,** నవోదయ ప్రచురణలు, విజయవాడ

1974 **మరో మూడు యాభైలు,** ఎమెస్కో, సికిందరాబాద్

1980 **చైనాయానం,** స్వాతి ప్రచురణలు, విజయవాడ

1980 **మరోప్రస్థానం,** విప్లవరచయితల సంఘం

1981 **మహాప్రస్థానం** (శ్రీశ్రీ సొంతదస్తూరీలో, గొంతులో), విదేశాంధ్ర ప్రచురణలు, లండన్

1983 **పాడవోయి భారతీయుడా !** శ్రీశ్రీ ప్రచురణలు, మద్రాసు

1983 **న్యూ ఫ్రాంటియర్స్,** విరసం

1986 **అనంతం.**

1990 **ప్ర–జ,** విరసం ప్రచురణ

శ్రీశ్రీ రచనాసర్వస్వాన్ని విరసం 20 సంపుటాలుగా ప్రచురిస్తున్నది

# IV. ప్రధానాధార గ్రంధాలు

అనంతనారాయణ, బిహెచ్ (1988) **తెలుగు సాహిత్యంలో కల్లోల క్షీణ దశాబ్దాలు** (1965-88), వికాసినీ ప్రచురణలు, విశాఖపట్నం

చేతన సాహిత్య సంస్థ (1983) . **చేతన :** యుగకవి శ్రీశ్రీ సంస్మరణ సంచిక, భిలాయ్ నగర్.

ఛటర్జీ, సునీతి కుమార్ (1963) **Languages and Literatures of Modern India**, Prakash Bhavan, Calcutta

నాగభూషణం, పి (సంపా ) (1983) రజని (సంచిక 20, సంపుటి 12), ఎ జి ఆఫీస్ తెలుగు సాహితీ సమితి, హైదరాబాద్

రమణారెడ్డి, కె.వి (1986) **జగన్నాధ రథచక్రాలు (శ్రీశ్రీ కవిత్వం గురించి, 1950-85),** ఝంఝు ప్రచురణలు, విజయవాడ

రామకృష్ణ ఎం, (1980) **శ్రీశ్రీ కవిత్వం (వస్తువు-సంవిధానం, 1926-47),** షష్టిపూర్తి మహోత్సవ సమర్పణ, కాకినాడ

రామమోహన్‌రావు, అద్దేపల్లి (1979) **విమర్శవేదిక,** ప్రభాకర ప్రచురణలు, కాకినాడ

**షష్టిపూర్తి మహోత్సవ సంచిక** (1980) . కాకినాడ

సత్యనారాయణ శాస్త్రి, ఎన్. (1990) : **శ్రీశ్రీ వ్యాసప్రస్థానం,** తెలుగునాడు ప్రచురణలు, హైదరాబాద్

**సృజన** (14) (1970) శ్రీశ్రీ సాహిత్య సమాలోచన

సుదర్శన్, ఆర్ (1991) **శ్రీశ్రీ పీఠికలు-పరిశీలన,** అనన్యప్రచురణలు, హైదరాబాద్

శ్రీశ్రీ సమగ్రసాహిత్యం